శ్రీ రస్తు.

# కాళిదాసచరిత్రప్రకరణము.

*A DRAMA.*

ఇది

ప్రస్తుతవేంకటగిరి ప్రభువులు

అనఁగా

ఇరువదెనిమిదవపురుషులు

అయిన

వెలుగోటి.

శ్రీ రాజగోపాల కృష్ణయాచేంద్రులవారి

ధనసహాయమువలన

చిలకపాటి - వేంకటరామానుజ శర్మ విరచితము.

చిలకపాటి - తిరుమలాచార్యులచే

"హిందూరత్నాకర" ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

చెన్నపురి.

1928.



*Price Rs. 1-8-0.*

# ప్రస్తావము.

---

ఓ వైద్యభూషణులారా! మహాకవి కాళిదాసుని చరిత్రము సకలజనకర్ణామృతమని యెల్లవారు నెఱింగినదే గదా! అట్టియతని చరిత్రమునందు; భోజరాజుకూఁతు రగు శశికళాంబుజా, విరజాంబుజ లను విద్వచ్ఛిరోమణులయొక్క యుదయాదిత్యుం డనువిద్వద్రాజకుమారుని యొక్క చరిత్రముతో సంబంధించినకథాంశములు వినోదకథాకల్పవల్లి యను పేరఁ జంపూరూప మగు శ్రావ్యప్రబంధముగా రచియించి; ఆమహాకవి మదనసేన యను రాజకుమార్తెను, గాంచనమాల యను (లీలావతి) వేశ్యాకన్యకను ధర్మపత్నిఁ, భోగపత్నులఁగాఁ గైకొన్నకథాంశమును బ్రకరణాంతములో వేఱొక దృశ్యప్రబంధముగా రచించి ముద్రించినాఁడను. రసమును బ్రత్యక్షముగఁ గనుపఱచుటంజేసి దృశ్యప్రబంధము లనఁబడురూపక గ్రంథములు పూర్వకాలంబున నిప్పుడును సహృదయుల్లాంబుల కానందనిష్యందంబులై యొప్పుచుండుట సుప్రసిద్ధము. కాని నాటకములలో రెండవది యయినప్రకరణముగా నిది రచింపఁబడినయది.

## ఏతద్గ్రంథకథాసంక్షేపము.

ఈగ్రంథమునందుఁ గర్పూరదేవమంత్రికుమారుండగు శశిచంద్రుండను సువనాయనుం గాఁడిదెలమేపువారిం గలసియుండి మదనసేన యనురాజపుత్త్రిం జెఱపట్టి కాళిదాసుం డనం బ్రసిద్ధిపడసి పత్నిం గోలుపోయి ధారానగరంబునఁ గాంచనమాల యను వేశ్యాకన్యకం జేపట్టి భోజునిసెయ్యమున వెండియుం దనసతిని బడసినచరిత్రము పద్యములును; చాటుసమస్యాశ్లోకములును గలసియుండు మృదుమధురవచనశైలిచేఁ బది యంకములు గలప్రకరణముగా స్త్రీలును బాలురును సులభముగఁ దెలిసికొనునట్లు రచింపఁబడినది.

## కథాంశాదులవివరణము.

౧. టియంకమున:—మధుమంతపురాధినేతకూఁతు మదనసేనను దానివిద్యాగురువుగా మించి యేకతమున బలాత్కరించి యాకన్నియ దెబ్బహతముఁ బ్రతిహతముచేసి దానియందు వ్యతిక్రమము సేయం గడంగుట; దనికుండన్నవాఁడు చూడవలసినశృంగారరసప్రతిబింబము.

౨. వయంకమున:—గౌతముఁడును సారథియును మదనసేనకు మంగళసంపాదింపం బోయి లంబభుజుం డనునెఱుకం బట్టుకొన సమకట్టఁగా; నాయారణ్యకుఁడొనరించునసాగరికసంభాషణాదులు హృదయంగమం బగుహాస్యరసంబుతో నొప్పుమిగులుచుండు.

౩. వ యంకమున:—నాగరికవేషము ధరింపంజేసి మహాపండితుండని చెప్పంబడిన లంబభుజుండు రాజసభయందు విభ్రాంతుండై గ్రామ్యోక్తులు పల్కఁ గౌతముండు వానివచనములు సాధుతమంబు లని సమర్థించి రాజసుతకు భ్రమ గల్పించి వివాహంబు సేయించుట యద్భుతహాస్యరసంబులయావేశవిశేష మయి యుండు.

౪. వ యంకమున:—కేళీమందిరమునందు లంబభుజుండు వెఱఁగుపడి యొనరించినపరిహాసనీయకార్యంబుల నారసి మదనసేన దుఃఖించుటయు; ఆకన్యకవలన నతండు గాళిదాసుం డగుటయు; గౌతముండు కపటంబున నాదంపతుల నెడబాపి మదనసేన నపహరించుటయు హాస్య, కరుణా, ఉద్భుతరసంబుల కాలవాలంబులై యుండు.

౫. వ యంకమున:—గౌతముని నిబద్ధుం గావించి కరూశాధిపతి మదనసేన నపహరించుట వీరశృంగారరసములభూమికలై చూపట్టు.

౬. వ యంకమున:—మదనసేనం గోలుపోయి కాళిదాసుండు దుఃఖించుటయు ధారానగరంబునఁ గాంచనమాల యనువేశ్యాకన్యను సంప్రాప్తయౌవనం గావించి రాజస్యాలకునిచేతం జిక్కకొనంబోయినయాకన్యను దప్పించి దానిం దనకుఁ బ్రణయపరిగ్రహము గావించుకొనుటయు విప్రలంభశృంగారము సద్భుతహాస్యరసంబులను బ్రత్యక్షీకరించు.

౭. వ యంకమున:—రాజస్యాలకుండు గాళిదాసునిం జంపందలంచి కపటంబున బ్రహ్మరాక్షసునికడకుం జేర్ప నాకక్కసుని మెప్పించి కవి తనపత్ని యుండువిధంబుఁ దెలిసికొనుటయు; గాంచనమాలానురక్తుం డగు రాజస్యాలకుని భోజుండు స్త్రీవేషధారి యైనయుజ్జ్వలుండనువానిచే వంచనాపరిహాసంబున జేలఁపుచ్చుటయు నద్భుతహాస్యమయంబులై వేడుకఁ బుట్టించు.

౮. వ యంకమున:—కాళిదాసుండు కాంచనమాలయింటికిఁ జని విలాసోక్తుల నాయింతి నలరించుటయు, నాయువతి కవికిం గలప్రియావిరహవ్యథం గని పెట్టుటయు, బుద్ధిసాగరుండు కవిం గాంచుటయు శృంగారశాంతరసంబుల యవతారంబులై వెలయు.

౯. వ యంకమున:—కాళిదాసునియత్యద్భుతకావ్యములు శృంగారసమస్యాపూరణములు భోజకాళిదాసులసమావేశమును అద్భుతరసప్రధానంబులైమహామోదదాయకంబులై యుండు.

౧౦. వ యంకమున:—భోజలీలావతులును గాంచనమాలయుఁ గాళిదాసునికి మదనసేనం జేర్చుటయు; కడుశోచనీయావస్థయం దుండుప్రియురాలిం గని కవివరుం డోదార్చుటయుఁ గరుణను శృంగారంబున నద్భుతంబునను మానసంబులం దేలించు.

## శ్రీరాధానాథవిరజ మనుమూగ్రంథశాలయందు చిలకపాటి - వేంకట రామానుజశర్మగారిచే విరచితమైన గ్రంథముల జాబితా.



### వినోదకథాకల్పవల్లి యనుమహాకవికాళిదాసచరిత్ర.

దీనియందు ; నాటకచ్ఛాయ, మాయాసుందరీవిజయము, రససంజీవనము అను నాటకత్రయము గర్భితమై యుండును.

ఈవినోదకథాకల్పవల్లియందు ; వైదుష్యంబునం గాళిదాసాదిమహాకవులతో సమానలయినభోజనికూఁతులం ; దరుణాంబుజయు విరజాంబుజయు ననువారల విద్వద్రాజకుమారుండగునుదయాదిత్యునికిం గాళిదాసుండు పెండ్లిసేయించినయతివిచిత్రచరిత్రము నుడువంబడియుండును.

### ఈగ్రంథమునందుఁ బ్రతిపాదింపఁబడియుండుకథాసంక్షేపము.

విద్యాసర్వస్వవేదిని యనుకపటపు వేశ్యాకన్యక తనరూపవయోవిలాసములకు మోహించి వచ్చినవారివలన నొక్కొకరాత్రికిని వేయివరహాలు గైకొని యట్లువచ్చినవారిని తనయింటి పరిచారకులయందుఁ గావించియుండువిదుషీశిరోమణులం గొని విద్యాప్రసంగంబున నోడించి తనకన్యకాత్వమునకు భంగంబు గలుగకుండ మాయోపాయంబులం బ్రవర్తించుటయెఱిఁగి మహాకవికాళిదాసుఁడు కట్టెలమ్ముకొనువానివేషంబుతోఁజని యరఁటియాకులకట్టను దననేర్పుమెఱయ నాకనకాంగికి వేయి వరహాలకు విక్రయించి యాధనమునే పదపురోయిగ నొసంగి తనయసమానవైదుషీ విశేషంబు వెల్లడిసేయుచు నొక్కొకద్వారంబునందుం బెక్కులు శృంగారపద్యములు సెప్పుచు నావాకిళులంగడఁచి లోనం బ్రవేశించి యావేశ్యతో విద్యావివాదంబు సలిపి దానింజయించి యదియేర్పఱిచి యుండుప్రతిసిద్ధాంతాసనంబుల నెలకొనితత్తన్మతతత్త్వోపన్యాసపూర్వకంబుగ జయించి నాటకచ్ఛాయ యనునొకయుపరూపకం బాడించి యాశోపవంతి నతిచతురత్వంబునఁ బయల్పఱిచి కాళికాదేవిని భోజభూపతిప్రముఖులకు సాక్షాత్కరింపంజేసితదనుచరీగణంబువలన మాయాసుందరీవిజయ మనునొకయుపరూపకమునాడించి భోజునిరాణిపైఁగలిగిన యపవాదంబు నివర్తింపఁజేసి తరుణాంబుజా విరజాంబుజలకు నుదయాదిత్యునికిని బ్రణయవిశేషంబు ప్రవృత్తం బయినయతి మనోహరచరిత్రంబును రససంజీవనమనుపేరం బరఁగు నేడంకములనాటకంబుగ నభినయింపఁజేసి వసుధారిణి యనుమతియొకరాజకన్యకారత్నంబుతో భోజసుతల నుదయాదిత్యునికిఁ బెండ్లిసేయించినకథ.

వెల రూ. 3-0-0

కాళిదాసచరిత్ర ప్రకరణము.— ఈ గ్రంథమునందుఁ గరూశదేశపతి మంత్రికుమారుండు కళాచంద్రుండు గురుశాపమున గాడిదెలఁగాయువారిం గలసియుండి మదనసేన యనురాజపుత్రిం బెండ్లాడి కాళిదాసుండనం బ్రసిద్ధివడసి పత్నింగోలుపోయి ధారానగరంబునఁ గాంచనమాల యను వేశ్యాకన్యకం జేపట్టి భోజునిసెయ్యమున వెండియుం దనసతిం బడిసినచరిత్రము. వెల రూ. 1 - 8 - 0

శ్రీమదాంధ్ర భోజచరిత్రము.— ఇది "భోజరాజచరిత నాటకము" అనియు "భోజరాజ కవిరాజచరితము" అనియు రెండుభాగములుగల యొకసంపుటము. భోజరాజచరిత నాటకమునందు సింధులమహారాజు జరాభరంబున కొర్వంజాలక కుమారుఁడగు భోజునకి బుద్ధిసెప్పి ముంజునికి రాజ్యంబప్పగించుటయు; భోజునిజన్మపత్రిక వినిముంజుండు భోజునిం జంప వత్సరాజును నియమించుటయు; వత్సరాజు భోజునింజంప శ్మశానమునకుం దోడ్కొనిచనగా నాయిరువురకుం జరిగిన చర్యలును; ప్రాణపరిత్యాగంబుచేసికొనం గడంగిన లీలావతీకన్యకను మారువేషంబుఁ దాల్చినకుమారుండు రక్షించుటయు; పుత్రవధశోకాతురుండై ముంజుఁడువహ్నిసారంబోవం గపటయుక్తిచే బుద్ధిసాగరుండు తప్పించి కుమారు నప్పుడు బ్రదికించినట్లు తెలిపి భోజునికి లీలావతీ పాణిగ్రహణంబును ధారానగరరాజ్య పట్టాభిషేకంబును; భోజరాజ కవిరాజచరితమునందు:—భోజరాజునకును; కాళిదాస, భవభూతి, భట్టబాణ, దండి మాఘ, మల్లినాథ, శంకర, శుక, క్రీడాచంద్ర ప్రముఖులగు ననేకకవిరాజులకును జరిగిన చరిత్రంబు సెప్పంబడియుండు. వెల రూ. 1 - 8 - 0

చమత్కారకథాకల్లోలిని. ఇది, రోచనుఁడను రాజకుమారుఁడు మందారమాల, మదనమాల, మదనసేన, వసంతసేన, మదలేఖ, చందనలేఖ లనువిద్యాధరరాజకన్యారత్నంబులను బరకీయాభావంబునఁ బరిణయమైన శృంగారచరిత్రము. రెండుభాగములు. వెల రూ. 1 - 8 - 0

శ్రీమదాంధ్ర వచన బ్రహ్మవైవర్తమహాపురాణము. ఇది వ్యాస విరచితమగు సంస్కృతమునకు సరియయినది సకలశ్రుతీతిహాస పురాణములయందు గలసందేహములం బోగొట్టుటకు. పురాణసూత్రమను నామాంతరముతో బదవమహాపురాణముగ నితర పురాణాదికథలకు మూలభూతములగు గోలోక భూలోక రాధాకృష్ణులకథలును, లక్ష్మీ, సరస్వతీ, దుర్గా, సావిత్రీ, తులసీ, గంగా, వసుంధరాదిసమస్తస్త్రీ దేవతోపాఖ్యానములు నూఱును, నారాయణ, మహాదేవ, విరాట్పురుష, గణేశాది చరిత్రంబులనేకంబులు, తన్మంత్రోపాసనావిధులును, జనులకావశ్యకముగ నెఱుంగవలసిన ప్రతివిషయంబులును మహర్షి దీనియందు జెప్పెను. దీనిలోని శాఖాకథలంబట్టి పురాణాంతరములు, నిందలి ప్రమాణములంబట్టి స్మృతులు ఏర్పడినవి. వెల రూ. 3 - 8 - 0

శ్రీరాధికాపరిణయము అను శ్రీగోపీకథాకౌముది:—ఇందు పదుమూఁడు యూథములగోపికల యవతారంబులును; వారిపూర్వజన్మవృత్తాంతములును; ప్రస్తుతమున కృష్ణప్రాప్తికై వారుచరించిన వ్రతాదులును; ఫలప్రాప్తియు; శ్రీరాధికావతారంబును; ఆమెవైభవంబును; శ్రీరాధికావివాహంబును; శ్రీరాధ కృష్ణునిపటవేషంబు గాంచి మోహించితత్ప్రాప్తికై తదాజ్ఞచేఁ దులసీవ్రతంబు సలుపుటయు స్త్రీవేషధారియైవచ్చి శ్రీహరి రాధను బరీక్షించుటయు గోపకులలోఁగలిగిన యంతఃకలహంబు నివృత్తంబుసేయ ముక్తావృక్షములను మొలపించి తన్ప్రభావము విశదపఱచి శ్రీరాధాదేవి తనకు గోకులపట్టమహిషియని తెల్పి యాదేవితో రాసోత్సవంబు లనుభవించి నందనందనుండు శ్రీరుక్మిణ్యాదికాంతల ప్రార్థనంబున ద్వారకకుం దోడ్కొనిచనుటయు నిత్యాది కృష్ణచరితము లనేకములిందుగలవు. వెల రూ. 1-0-0

ఆంధ్రకల్కిపురాణము. ఇది శ్రీనారాయణమూర్తి యీకల్యంతంబునం జేయం బోవుపదవదియగు కల్క్యవతారముయొక్కచరిత్రము. శ్రీవ్యాసవిరచితమైన సంస్కృత కల్కిపురాణము ననుసరించి పద్యకావ్యముగ రచింపబడినది. వెల రూ 1-0-0

ఆంధ్రతనిశ్లోకి. ఇది ద్రవిడభాషలో పెరియ వాచ్చాంబిళ్ళగారు రచించిన తనిశ్లోకికిసరిగా నాంధ్రీకరింపబడినదియుదాహృతములగు ప్రమాణవాక్యములకర్థముతో శ్రీరామాయణములోముఖ్యములగు శ్లోకములకుశ్రుత్యాదిసమ్మతములగు మహార్థము లొక్కొక్కపదమునకు వాక్యమునకు నలువదేబదివిధములనుపన్యసింపంబడి యుండు.

వెల రూ. 1-0-0

శ్రీతులస్యుపాఖ్యానము. ఇది లక్ష్మీదేవి తులసియను రాజపుత్రియై జన్మించి శంఖచూడునికింబత్నియై నారాయణునిచేత పాతివ్రత్యభంగంబునుబొంది తత్పత్నియై తులసీపత్రరూపమునుధరించిభగవంతుని కేకాంతకైంకర్యపాత్రమైనచరిత్రము,

వెల రూ. 0-8-0

సుమనో వినోదనభాణము. ఇది శాకుంతలాదులవంటినాటకము. సుమశేఖరుఁడను శృంగారనాయకుఁడు నవమంజరియను భోగముకన్నెకుఁ దొలిగన్నెతికముపెట్టిన శృంగార చరిత్రము, పద్యములుగలసినవచనశైలి బహురసవంతమైయుండును. 0-4-0

☞ వినోదకథాకల్పవల్లియు, కాళిదాసచరిత్రప్రకరణంబును, ఆంధ్రభోజచరిత్రంబును పరస్పరసంబంధముగలవిగానవీనిలో నొకటికొనువారికి మఱిరెండు నత్యావశ్యకము.

చిలకపాటి - వేంకటరామానుజశర్మ అండు సన్.

నెం. 16, పెరుమాళ్ కోవిల్ తోట వీధి. మ దా.సు.

వెనుక నుదహరించిన గ్రంథములు వలయువారి లీక్రిందివిలాస దారులకువ్రాసి తెప్పించుకొనవలయును.

1. చిలకపాటి. వేంకటరామానుజ శర్మ అండ్ సన్,

నెం. 16, పెరుమాళ్ కోవిల్ తోట వీధి,

సాహుకారిపేట పోస్టు,

మద్రాసు.

2. పిడుగు. వేంకటకృష్ణారావు పంతులు,

2/40, పెద్ది నాయని వీధి,

మింట్ బిల్డింగ్సు పోస్టు,

మద్రాసు.



శ్రీరస్తు.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణే నమః.

# కాళిదాసచరిత ప్రకరణము.

## ప్రథమాంకము.

### నాందీపద్యము.

కం. ఇదె! పూర్వకవీంద్రులకును । హృదయంబునఁ బొదలఁబత్తిసిరులొలయ మెఱిఁగి,
డెచ్చదఁ బద్మవాసినీవా । క్పదపతులకటాక్షలీల మనుధన్యులకున్.
నాంద్యంతంబున సూత్రధారుండు రంగంబుఁ బ్రవేశించె.,

సూత్రధారుఁడు.

చం. సరసిజసంభవాదిసురసంతతికైన నలభ్యుఁ డౌమహా,
పురుషుఁడు వేదవాక్యనుతభూతిఁ జెలంగుమహాత్మ గోపికా,
తరుణులఁ గూడి భక్తపరతారతి లీలలఁ దేలుచుండునా,
పరమదయామయుండు పశుపాలకబాలుఁడు మమ్ముఁ బ్రోచుతన్.

అని పుష్పాంజలివికిరణంబుఁ గావించి,,

---

### ప్రకరణార్థప్రకాశిక.

నాటకాదిరూపకములకు మొదటం జెప్పఁబడుపద్యము నాంది యనంబడును.

అందుఁ గావ్యార్థసూచన ముండవలయు ఇచటం బూర్వకవి యనుటవలన నేతత్ప్రబంధప్రతిపాద్యుఁడు పూర్వకవి కాళిదాసుండను కావ్యార్థము శబ్దసూచితమగుచున్నది.

మఱియుఁ బద్మవాసినీవాక్పదపతులకటాక్షలీల మనుధన్యులకున్,, అనుట వలనవారు సంపదయుఁ దత్సంపాదకమగువిద్యయుఁ గలవారను నర్థము స్పష్టమయ్యెని.

ఈ నాందియందు ఎనిమిది పదము లున్నవి గాన నిది యష్టపద మైననాంది యనంబడు.

ఏల కో! నానేయంగడంగినరూపకప్రయోగంబునకుం దోడ్పడువా రెవ్వరును రాకయున్నారు?

నటి. ప్రవేశించి,,

ఆర్య! భవన్నియోగం బనుష్ఠింప నిదె యేగుదెంచినదాన.

సూత్రధారుఁడు. నటీ! అట్లైన నేతత్పరిషత్సమారాధనంబు సేయంబూని నాకుసహాయవై ప్రవర్తింపుము.

గీ. గీతకళాకుశలులుఁ బ్ర। ఖ్యాతగుణోత్తరులు రసికు లధిగతశాస్త్ర,
వ్రాతమహాత్ము లధికవి। నీతులు సభఁ జేరి రిపుడు నెమ్మి దలిర్పన్

నటి. ఆర్య! యిట్టియపరిమేయవైదుషీభాషణులకుం బరితోషంబుఁ గల్పింప మనకు శక్యంబగునే!

సూత్రధారుఁడు. నటీ! అట్లనుకొనకుము. పండితగోష్ఠి నలరించుటకష్టంబు గాదు. వారు గుణమాత్రగ్రాహకులు గాన సంతసింతురు.

నటి. ఆర్య! అగుఁగాక! ఇంతనుకం బ్రవృత్తంబులై యుండురూపకంబు లెల్ల నీసరసాగ్రేసరులు గాంచియుండకపోరు. అట్టివి ప్రయోగించిన ఫలం బేమి?

గీ. అనుపమోదారరససమాహార్య మగుచు। నభినవాద్భుతసద్వస్తుసుభగ మైన,
రూపకవరంబు గాని నిరూఢిఁ గాంచ। దీయభిజ్ఞులనెమ్మది కింపు నింప.

అట్టిది యారయం దగు!

సూత్రధారుఁడు. స్మృతియభినయించి హర్షంబుతో,,

ఓనటీ! భవద్వచనంబునం ; దథావిధసుప్రశస్తి వడసియుండునదిమదీయస్మృతిపథసంచారంబుం గాంచె. అది చిలకపాటి వేంకటరామానుజశర్మ రచియించిన కాళిదాసచరిత్రప్రకరణంబు.

---

నాందీశ్లోకంబు పఠియించి మొదటిసూత్రధారుఁడు నిర్గతుం డయిన నట్టివాఁడు మఱియొకరుండు ప్రవేశించి ప్రస్తావనాంగంబుల జరుపును.

సూత్రధారుండనఁగా:—నాంద్యుపకరణముఁ బ్రవర్తింపఁజేయువాఁడు. సూత్రమనఁగా:—నాంద్యుపకరణములు.

నటి. ఆర్య! సరే! వేదవ్యాసప్రతిపాదితం బగువస్తువు తొల్లి యుదయాది త్యప్రముఖులు తమతమప్రియినులతో నఖిలాగమవేదు లయినరసికవరులు శ్లాఘింపం గవివరునందుం గలగౌరవవిశేషంబున నభినయించినది గాదే!

సూత్రధారుఁడు. నటీ! ఔను! తదనుసారంబుగ నీయాంధ్రకవి తెలుఁగు బాసం గల్పించిన వాఁడు.

నటి. ప్రమోదంబుతో,,

ఆర్య! మనసేయుం బూనినసమృద్ధిగతాభినయశాస్త్రపారీణతాప్రదర్శనంబు సఫలంబగు.

శా. శృంగారంబు రసంబు సాధుజననిస్సీమప్రమోదావహం,
బంగంబు ల్కరుణాదికంబు లతిచిత్రార్థంబు సద్వస్తువు,
త్తుంగోదారయశు ల్సభాసదులు సంస్తుత్యస్వభావంబు లై,
యంగారుం గవిపుల్క లన్ని యిట నాహా కూడె మోదంబుగన్.

కానం దత్ప్రకరణప్రయోగంబు మహామోదదాయకంబు గాఁగలదు.

సూత్రధారుఁడు. అట్లగు నేని యీ ఋతు వధికరించి గీతం బొక్కటి పాడుము.

నటి. ఆర్య! ఇదె భవన్నిదేశం బనుష్ఠించెదను.

పాడుచున్నది,,

కం. * మలయానిలమిళనోత్కట। కలమదకలకలవిరావకలకంఠంబై,
లలితమధులుబ్ధషట్పద। మిల మధువు ప్రమోదభరము నిగురొత్తించెన్.

సూత్రధారుఁడు. నటీ! నీవు పాడినగీతంబు కడుం రసావహం బైయొప్పె. ఈవసంతాగమమును నేను వర్ణించెదను వినుము.

ఉ. చారువనస్థలీనవవసంతవివాహమహోత్సవంబునన్,
సారసబాణవహ్నిశుభసాక్షిక మై తగుదానియందు నా,
సారపికద్విజావళులు జాతముదంబున మాటిమాటికిన్,
జేరి మనోహరధ్వనులఁ జెప్పెడి మంగళమంత్రసంతతిన్.

---

* మలయానిలముసంబంధపడుటవలనఁ దద్దయు మోహనందపుటామనుం గొని కోవెలలు కలకలధ్వనులు నేయుచున్నవని యర్థము.

నటి. శ్లాఘించుచు,,

ఆర్య! మీరు ఆచరించినమధువర్ణనంబువలన వివాహోత్సవంబునందు ద్విజ వరులు స్వస్తివాచనంబు సేయుచు రక్షాబద్ధం బేర్పడుటంజేసి మధుమంతపురాధిపతి యగుప్రియవంతునికూఁతురు మదనసేనకు వేదవిద్యాశీర్షనాదమనోహరంబుగఁ బరిణ యంబు జరుగుట యభివ్యజ్యమానం బగుచున్నయది.

సూత్రధారుఁడు. నటీ! అది యిప్పుడెట్లుజరుగును? మదనసేనయందుందమకం బుంచె దానివిద్యాగురుఁడు గౌతముఁడు దానిలోఁ గలయ నువ్విళులూరుచున్నవాఁడు. రాజపుత్త్రియుం గొల్లదు. బ్రాహ్మణుండును గడుమోసగాఁడు. అంతింబోవు వాఁడు గాఁడు.

* నేపథ్యంబున,,

చం. అనుపమరామణీయకవివాహపదం బగుమోముదమ్మియున్,
స్వనుతనవాభిరూప్యరమ వేడుకఁ గుల్కెడునంగయష్టియున్,
స్తనకృతవిలాసవైభవమునుంగు సెలంగెడుకాను నొప్పునా,
వనజదళాక్షిఁ గూడి సుఖవారిధిఁదేలనిజన్మ మేటికిన్.

సూత్రధారుఁడు. నేపథ్యంబువలనికి దృష్టులు నిగుడించి శంకించుచు,,

ఆ! ఇదె వచ్చుచున్నవాఁడు గౌతముఁడు! మోసగాఁ డని తన్నుం బల్కిన పల్కు వినియెం గాఁబోలు! అట్లగునేని నాయందుఁ గినుకఁ గాంచు.

నటి. ఆర్య! ఇతఁడు గౌతముఁడు గాఁడు. తన్నేపథ్యధారి యయి చనుదెంచు మనమణికంఠుండు.

సూత్రధారుఁడు. నటీ! నన్ను బయితమించుక భ్రమపఱిచినయితనియభినయ చతురత కడు నభినందనీయంబు. ఇఁక మన మనంతరకరణీయంబునకుం బ్రయత్నింపం జనుదము. పోవుదము రమ్ము.

అని నిష్క్రాంతులైరి.

† ప్రస్తావన.

---

* నేపథ్యమనగా:—గాయకులు మొదలగువా రుండెడు యవనికాంతస్థలము.

† ప్రస్తావనయనఁగా:—సూత్రధారుఁడు నటితోనొండె, నటునితోనొండె, విదూషకునితోనొండె, మాటలాడుచుం జిత్రోక్తులం దనకార్యంబు నుడుపునెపమునం బ్రస్తుతకథోపక్షేపణము గావించుట. దీని కాముఖ మనియుం బేరు.

గౌతముఁడు ప్రవేశించి,,

ఆ! రాజసుతయగుమదనసేనరూపరేఖావిలాసంబులనే నెంతని నుతింపఁగలవాఁడ.

ఉ. పూర్ణశశాంకబింబమును బోలెడుముద్దులుగుల్కు మోమున,
భ్యర్ణితలోపరక్త ధవళాయతచంచల నేత్రపద్మముల్,
వర్ణితచంచలాలకలవాసి యెలంగెడునంగయష్టియుం,
దూర్ణమువెట్టిదిట్టలను దూలఁగఁ జేయవె మానసంబులన్.

ఈమనోహరాంగి నాతో విద్యాభ్యాసంబు సేయఁ గడఁగినకొన్ని నాళ్లకు.

సీ. ఇంచుకించుక మించుచంచలభావంబు విప్పువాల్గన్నుల మెప్పుగుల్క,
శ్రీకరంబై స్మరస్మేరవిలాసము ల్ముఖపంకజంబున మురువు లీన,
నున్మీలితంబులైయుదుటుసూపఁ గడంగుకుచకోరకంబులు గులుకులొలుక,
నసమగ్రమయి యొప్పునరుణంపునునుఁజిగి యధరబింబంబున సందడింప,

గీ. భావసౌరభ మెదను జూపట్టఁ దొడఁగ,
సంగకంబుల లావణ్య మలవరింప,
యౌవనోద్భేదవేళ నీపూవుఁబోఁడి,
యుండుసింగార మాత్మ మోహోర్మి ముంచె.

ఇట్టియతివిలోభనీయం బగుయౌవనోద్భేదంబున,

చం. చదువులు సెప్పునప్పు డలచానమనోజ్ఞవిలాసవైఖరుల్,
మదిని గలంప సాగ ననుమానవిలగ్నను నిండుకౌఁగిటన్,
బొదవఁదలంచి గ్రక్కునను బుద్ధి మరల్చుచుఁగాముఁ దూఱుచున్,
మదవతికి న్వివేకముఁ గ్రమంబునఁ దెల్పెపంబు దోఁపఁగన్.

అదియటునుండఁగాక,

గీ. ముగుద పతియింపఁ గోరి నామ్రోల నుండ,
దానిసోయగమే మదిఁ దలఁతుఁగాని,
శాస్త్రసారార్థములు వల్కువాయ తెలమి,
నించుకేనిఁ దలంపున నెక్కవపుడు.

మఱియు నాచంద్రవదనామణినగు మొగంబుం గనుంగొననియొక్క క్షణంబు సయితము యుగసహస్రంబుగఁ దోఁచుచున్నది. క్రమక్రమంబున నోడఁబడఁజేసి యేన దీనిం బెండ్లాడెదను. ఇది యెల్లవిద్యలయం దసదృశం బగు పాండిత్యంబుం గడించియున్నది గానఁ దనకంటె విద్యలయందుం దక్కువైయుండువాని వరియింపం గడంగదు. ఏన దీనికంటె నెల్లవిద్యలయం దధికుండను. నామనోగతార్థంబు నివేదితంబు సేయ వల్లెయనును.

చింతయభినయించుచు ,,

ఏలకో! యీదంతిగమన యింతదనుక రాకున్నది! సూర్యోపస్థానాదు లొనర్చునప్పుడు నాసన్నిధికిం జేరునావన్నెలాడి సూర్యుండు యుగాంతరాధిరూఢుం డయ్యెను దడయుచున్నది.

ప్రోలం గనుంగొని ,,

ఇదె మదనసేనసఖి గుణమాలిని వచ్చెడిని ! దీనివెనువెంట నదియు వచ్చు !

గుణమాలిని ప్రవేశించి. ఊరుపునిగుడ్చుచు. ఆత్మగతమున ,,

ఇప్పటికిఁ గదా! నామానసంబు సుస్వస్థతం గాంచినది. రాజపుత్రి ఋజుబుద్ధితోఁ బ్రవర్తించుచున్న బ్రాహ్మణుండు సుతాసమాన యగు శిష్యం గోరుట తగునా యని యెంచక మదనసేనయం దనురక్తుండై యున్నవాఁడు. తల్లక్షణంబులు పలక్షించుచు, గురువునం దతిభక్తిగలదిగాన నాప్రియసఖి మదనసేనకది యే మనుకొనునో యని తలంచి యెఱింగింపక యుండెద. ఎప్పుడేని యీపాఱుండు పదరి పైఁబడం గడంగు నని భయం పడుచు వీరిరువురసన్నిధానంబు వదలక మెలంగుచున్నదాన. నాగోరుచుండినరాజు మువలయు నేటి కయ్యె. ఇఁక నాకుం గంటికిం గూరుకు పట్టు. బ్రాహ్మణునికి వృత్తాంతంబు దెలిపెదను.

పరిక్రమించి ,,

ఆ! ఈబ్రాహ్మణుఁడు మదనసేనయం దాసయిడి కడు నిడుమలు పడుచున్నవాఁడు.

ఉ. నిద్దుర లేక రక్తరుచినిర్భరమై కనుదోయి యుప్పెడిన్,
వద్దయు మేను బుష్పశరతాపము హెచ్చుటఁ జిక్కెవైశమే,
ప్రొద్దును జింతయుం జతత పుల్కలు మష్టము లైనయూరుపుల్,
పెద్దయు నీతనిం దొడరి పీడితుఁ జేయుచునున్న వక్కటా.

ఈమందప్రతిభుం డందరానిపండున కఱ్ఱు సాచుచున్నాఁడు. కఠోరం బగు రాజాముదలకు వెఱఁగంది పదరక బాధలుపడుచుండెడిని. ఈయుడియాసయుని త్తితిని వర్తింపంబోయెడి.

ప్రకాశముగ,,

బ్రాహ్మణోత్తమా ! వందనము !

గౌతముఁడు. ఓసి గుణమాలినీ! అభీష్టప్రాప్తిచేనలరుచుండుము. విశేషమేమి?

గుణమాలిని. వేదవిద్యావిశిష్టుఁడా ! నీపలుకులువ్యర్థంబులగునే! మీర లీవేళఁ * ప్రియార్థంబు వడయబోయెదరు.

గౌతముఁడు. సంతసంబుతో ఆత్మగతమున ,,

ఈగుణమాలిని పలికినపలుకు ; మదనసేన నాయందుం బ్రియంబుం గొనియున్నదనునర్థంబును సయితము బోధించుచున్నది. అట్లయగునేని యింతకంటెశ్రేయంబు వేఱొండు గలదా !

ప్రకాశముగ,,

ఓసి ! ప్రియార్థంబని నీనుడివినపదంబు బహువిధార్థంబుల బోధించుచు నద్విష్టార్థంబును దెలుపమింజేసి మానసంబునకుం ద్వైరార్తిఁగల్పించుచున్నయది. దానివివరింపుము.

గుణమాలిని. నవ్వుచు,,

గురుపుంగవా ! ఏపదంబునకేనిశ్రోత తన నిజభావానుసారముగ నర్థము స్ఫురించుటగలదు గాదె! కాని మీకనేకార్థంబు లగుచున్నవేలకో ?

గౌతముఁడు. ఆత్మగతమున ,,

ఈగుణమాలిని బహుచతుర. నాకుం గలయుత్కంఠాతిశయంబు నెఱింగియు నిట్లనుచున్నది. ఈయర్థంబుఁ ద్రచ్చి యడిగిన నన్ను వేళంజేయు. కాననిది మాని యొండర్థంబుఁ బ్రస్తావించెదను.

ప్రకాశముగ,,

ఓసి గుణమాలినీ ! రాజపుత్రి శాస్త్రపాఠంబు పఠియింప నింత తడవయ్యె నేల రాకున్నయది.

---

* ప్రియార్థము:—ఇష్ట మయినధనము,, అనునది పైకిదోఁచునర్థము. ప్రియయనఁగా నిష్టురాలైననాయిక. తద్రూపమగునర్థ మనఁగా తదాత్మకవస్తువు,, అను

గుణమాలిని. గురువర్యా! ఇఁక నీశాస్త్రపాఠంబు లేల! అన్నియు ముగిసె.

గౌతముఁడు. ఆత్మగతమున,,

ఆమగువయు నావలె మదనశరార్తయయ్యె నేమొ? కానిచోఁ బాఠంబు లేల వదలుకొనును?

ప్రకాశముగ,,

ఓసి గుణమాలిని! మదనసేన శాస్త్రపాఠంబులు వదలుట యేల?

గుణమాలిని. ఓవిప్రోత్తమా! నీయదృష్టంబు ఫలోన్ముఖం బయ్యె. అదియె కారణమనం జనును.

గౌతముఁడు. సంతసంబుతో. ఆత్మగతమున,,

ఈగుణమాలిని మాటలతీరు మదనసేన నాయందుం బ్రియంపడియుండునను నర్థంబు సూచితంబు గావించెడిని. ఇంకను నమ్మం జనదు. క్రమక్రమంబుగ మాటలవెంబడిం గలతెఱంగు విస్పష్టంబుగ నెఱుంగుదునుగాక.

ప్రకాశముగ,,

ఓసీ యింతదనుక నిగూఢార్థంబుగ మాటలాడితివి. కలిగినయర్థంబు వెల్లడిసేయుము.

గుణమాలిని. పండితవర్యా! గూఢార్థంబు మఱేమియు లేదు. భర్తృదారిక మిమ్ము గురుదక్షిణాప్రదానపరితోషితస్వాంతులం గావింప నపరిమితమణిగణపూర్ణంబులగు బంగరుపళ్లెరంబుల దాసీగణముచే నెత్తించికొని భవత్పాదార్చనంబున కించుక తడసి వచ్చు. అర్థంబెల్లరకుం బ్రియంబు. అదిపుణ్యఫలంబువలనం గాని ప్రాప్తింపదు. అదిమీకిప్పు డనంతంబుగఁ గలుగం బోయెడిని. కానఁ బ్రియార్థంబుం బడయంబోయెదరనియు మీయదృష్టంబు ఫలోన్ముఖం బయ్యెననియుఁ బల్కితిని. ఇందేమియు గూఢార్థంబు గానంబడదే! ఉండునుపో! మావంటిమూఢాత్ముల కెట్లెఱుకపడు?

గౌతముఁడు. వెలవెలంబోవుమోముతో. ఆత్మగతమున,,

కట్టా! తా నొక్కటి దలంప దైవం బొకటి దలంచు నన్నమాట యథార్థం బయ్యె. ఏను రాజపుత్రీపరిణయ పరిరంభాదిసుఖంబులం గోరుచుండఁ దదీయదర్శన సల్లాప వినోదంబునయితము దుర్లభంబు గాబోయెడిని. హా! దైవంబు కడుఁ గ్రూరతరంబు. ఏమిసేయుదు!

అని తల వాంచుకొని యూరకుండె,,

గుణమాలిని. నవ్వుకొనుచు,,

ఓపండితోత్తమా! అపరిమితంబు లగుమణిగణంబులు మీకుఁ బ్రాప్తింపంబోయెడినని నేఁ జెప్పినవచనంబు చెవి సోఁక నపగతఖేదుండవై సుప్రసాదాతిశయంబుఁ గాంచిన మొగంబుతోఁ గనంబడవలసియుండ నట్లు గాక దీనతాభాజనం బనం దగిన వాఁడవువోలెఁ జూపట్టెద విది యేలకో? ప్రియశిష్య యగుమదనసేనం బాయ మనంబు రాకున్నది కాఁబోలు?

గౌతముఁడు. ఆత్మగతమున,,

ఇది యాప్రతివచనముగ నధిక్షేపించినయది. రాజకులసంచారనిపుణ లిట్టియర్థం బుల నతిచతురలు గారె!

ప్రకాశముగ,,

ఓసి గుణమాలినీ! అందుకై కాదు! మఱియుం గొన్నిశాస్త్రంబులు పఠనీయం బులు గల వవి పఠియింపకయ విద్యాపరిచయమునుండి విరమించుకొనుట యేలకో యని విచారపడియెదను.

గుణమాలిని. బ్రాహ్మణోత్తమా! మదనసేన మీతో ననేకశాస్త్రంబు లభ్యసించె. ఇంకనిప్పటి కీయెలజవ్వని యభ్యసింపం దగుశాస్త్రం బొండు గల దది దానిమగనితో నభ్యసింపంగలదుసూవె! అందు కేల మీరు విచారంపడియెదరు?

గౌతముఁడు. ఆత్మగతమున,,

ఆ! ఈచేటిక యెట్లు మాట్లాడినను మరల్చుచున్నది. నామొగమువలన నేను భర్తృదారికయం దనురక్తుఁడనై యుండు నర్థంబు రాఁబట్టం గడంగెడిని. అనువు మెయిం దప్పించుకొనుచు మాటలాడంజనును.

ప్రకాశముగ,,

ఓసీ! నీవక్రోక్తిచాతుర్యం బటుండనిమ్ము. ఇప్పుడేను రత్నంబుల కాశించితినా!

గుణమాలిని. మందస్మితంబుతో,,

ఓమహాత్మా! భర్తృదారికగుణరత్నంబులపైఁ గోరిక యుడినమీకుఁ గేవల రత్నంబులయం దాస వొడమునే!

గౌతముఁడు. ఆత్మగతమున,,

ఆ! ఈచేటికకుటిలవచనంబు లేమందును. వీనిని సమర్థించెద.

ప్రకాశముగ,,

ఓసి దాసీ! దానివినయాదిగుణంబు లట్టివే!

గుణమాలిని. బ్రాహ్మణోత్తమా! అట్లగుటంజేసికాదె మదనసేనయందుం * ప్రియంబుంచితిరి.

నేపథ్యంబునఁ గలకలము,,

గౌతముఁడు. ఓసీ గుణమాలినీ! ఆకోలాహలం బేమి?

గుణమాలిని. బ్రాహ్మణోత్తమా! భర్తృదారిక మీకు గురుదక్షిణ సమర్పింప మణిగణపూర్ణంబు లగుబంగరుపళ్లెరంబులు దాసికలు గొనిరాఁ దూర్యస్వనములతో భవన్మందిరమున కేగుదెంచుచున్నది. ఆరాజపుత్రికం బలసికొని యేతెంచుగజఘటలయుం గుఱ్ఱంబులయుం ఘీంకారహేషితధ్వానంబులును భూషణగణవిరావంబులును వర్షవరుల హాహానినాదంబులును బెరసి యీమహాకలకలంబు వీతెంచెడిని. భర్తృదారిక సనుదెంచు వృత్తాంతం బెఱింగింప దొలుత భవత్సన్నిధానంబునకేఁ జనుదెంచినదాన.

గౌతముఁడు. త్వరతో,,

ఓసీ గుణమాలినీ! నీవు వైళంబ భర్తృదారికకడ కరిగి నన్నస్వస్థశరీరుంగా నెఱింగించి బలంగమును వాకిట నాపి ఒంటిమై రమ్మనుము.

గుణమాలిని. ఆత్మగతమున,,

ఇది యావిప్రుండు మదనసేనతో నేకతంబున మాటలాడ నారసి చేసినయనువు. కానిమ్ము. ఇ ట్లగునో!

ప్రకాశముగ,,

గురువర్యా! భవన్నియోగం బనుష్ఠించెద.

అని నిష్క్రాంత యయ్యె

గౌతముఁడు. కట్టా! ఏమి సేయంజాలుదు. మదవతీముఖచంద్రదర్శనోత్సవంబు సతతము నాకింక లభింపం బోదు. ఇప్పుడైన నీయిందీవరేక్షణతో మాటలాడి యేకతంబున మానసం బెఱింగింతు నటన్నను గుణమాలిని దాని నెడబాయకుండుటంజేసి యనువుపడం బోలదు. దైవం బెట్లు సేయనున్నవాఁడో!

---

* సంతోషముంచితిరి. అనునది పైకిఁదోఁచునర్థము. స్నేహముంచితిరనునదిగూఢార్థము.

చం॥ మదవతి నాకడ న్నిలిచి మాటలు సెప్పఁ గడంగువేళ నా,
మది యొతిఘించెద న్నియతి మంచిఫలంబు నిగుడ్చ నేని స,
మ్మదధరణీధ్రకోటితటమండలి కెక్కినవాడ నాడు పెం,
పొదవు నిలాతలంబున శుభోన్నతి యన్నది యియ్య దారయన్.

అట్లు గానినాఁడు,

చం॥ సుమశరతాపదావశిఖి శుష్కతృణంబుగఁ జచ్చుకంటె నా,
రమణిని గాఁగిటం బొదివి రాజనిభాననఁ దేహసంగ సౌ,
ఖ్యముఁ ద్రుటి గాంచి భూరమణకల్పితదండన మేను వాసి ని,
స్సమముద మందుదు న్నికృతికాలితఁ బట్టెదఁ గామినీమణిన్.

గుణమాలీద్వితీయయై మదనసేన ప్రవేశించుచున్నది.

మదనసేన. ససంభ్రమముగ నరుగుచు,,

ప్రియసఖి! గుణమాలిని! మనయాచార్యుం డింతయస్వస్థశరీరుం డగుటకుం గతం బేమొకో!

గుణమాలిని. భర్తృదారికా! ఈయర్థంబు * తన్మనోజవృత్తివిశేషైకవేద నీయంబై యున్నది.

మదనసేనయుం గుణమాలినియుఁ గౌతమునిసమీపమునకుం జనిరి.

మదనసేన. వినయంబుతో,,

ఆచార్యులపాదకమలముల కంతేవాసిని మదనసేన యభివాదనము సేయుచున్నది.

గౌతముఁడు. రాజపుత్రి! బుద్ధిమతి వగుదువు గాఁక.

గుణమాలిని. ఇంచుక నవ్వుచు,,

బ్రాహ్మణవర్యులయాశీర్వాదంబు తథ్యంబు గావలయును.

మదనసేన. ఓమహాత్మా! మీర లస్వస్థశరీరులరై యున్నారని వింటిని. రాజన కునికిం జెప్పిపంపి నిదానదక్షు లగుభిషక్శిరోమణుల రప్పించెదను. ముదలయే?

---

* మనస్సునం గలిగినవ్యాపారవిశేషంబున కొక్కటికే యెఱుంగందగినది. అనఁగా:—అతనిమనోవృత్తికే యది తెలియును అనిభావము. ఇది పైకిం దోఁచు నర్థము మనోజవృత్తి విశేషముఅనఁగా:—మన్మథావస్థావిశేషము. తదేకవేద్యము; అనఁగా:—అది యొకటిగానే యెఱుంగునది. అనునీయర్థము గూఢము.

గౌతముఁడు. ఆత్మగతమున,,

ఈగోల నాకుంగలిగియుండువ్యాధిని నివర్తింపంజేయు సిద్ధౌషధంబు తానయై యుండ నది యెఱుంగక యితరుల వెజ్జుల రప్పించెద ననుచున్నది. ఇది దీనితో నేకతంబు సంపాదింప దగువేరవు గాఁగలదు. ఈనెపంబున నీచేటిని వెడలనడిచితి నేని రాజపుత్రికి మదీయమనోరథంబుం దెలుపవచ్చు. దైవం బనుకూలంబై రాజసుత చేత నీమాట సెప్పించె.

ప్రకాశముగ,,

రాజపుత్రి! వైళంబ యగదంకారులఁ బిలిపించుట యొప్పు.

మదనసేన. మహాత్మా! అట్లొనరించెదను.

గుణమాలినిం గాంచి,,

ప్రియసఖి! నీ వతివేగంబునం జని యాచార్యులయస్వస్థశరీరత నాజనకునికి విన్నవించి తత్ప్రేషితుల నగదంకారులం దోడ్కొని రమ్ము.

గుణమాలిని. వినవియట్లుండెను,,

మదనసేన. ప్రియసఖీ! ఆచార్యునికి వ్యాధి ప్రతికలము. బెంపు వడయుచు న్నది. కడునలసట యగును. ఇంకులకుం బ్రతిక్రియ సేయం దడయఁ జనదు. నిన్ను వేఁడుకొనియెదనే! వైళంబ చని భిషక్కులం దోడ్కొనిరమ్ము.

గుణమాలిని ఆత్మగతమున,,

భర్తృదారిక ఋజుహృదయ యగుటంజేసి కపటం బెఱుంగక నన్నుం బనుచు చున్నది. ఏ నిద్యోడ వాసి చనిన నీబ్రాహ్మణుం డీమానవేశ్వరునికన్యకయందతి క్రమంబుంగావింపంబోయెడిని. కాముకుల కెట్టియతిక్రమంబుఁ గావించుటకైనను మాన సంబు తెంపుఁగొనును. రాజపుత్రియాజ్ఞను జరుపకపోరాదు. ఇచ్చోటువిడిచి పోతి నేని యీనాతికింగష్టంబు గల్గకపోదు. ఏమైన నేమిసేయవచ్చు. పోకతీఁరదు. ఇడుమ రాకమానదు. అగుఁగాక! నాశక్తికొలది తన్నివర్తనోచితసంవిధానంబునొనరించెద.

ప్రకాశముగ,,

భర్తృదారికా! నీచేసినముదల యనుష్ఠింపక యుండంజనునా! నేనేప్పాటిప్రణ యంబు సంపాదించినను నీకుం బరిచారిక నేకదా! పరిజనమునకు భర్తృదారికలయాజ్ఞ దురతిక్రమణీయం బని యెఱుంగనా!

మదనసేన. అనునయముతో,,

ప్రియసఖి! యింతదనుక నీవు నామాటజవదాటి యొక్కింతయేనిం దడవు చేసిన దానవు గావు. ఇప్పుడిట్టివ్యథం బూన నావచనం బనుష్ఠింప నిచ్చలేనిదానవువోలెం బ్రవర్తించెదవు. ఇందుకుగతం బెఱుంగక యుమ్మలించుచున్నదానను. ఏవాఁడేని నీయందుం బరిజనమునందుఁబోలెఁ బ్రవర్తించియుండునటే! నాజీవితనిర్విశేష వని తలంచియున్నదానను నీవయితేని యాచార్యునిరోగమూలంబుఁ గలతెఱంగున నెఱింగించి తగువారలం దోడ్తెత్తువని పొమ్మంటిని. ఈయర్థంబు సేయం బ్రియంపడవు. ఇదేలకో! ప్రియసఖి! కరుణించి పోయిరమ్ము.

గుణమాలిని. భర్తృదారికా! నేను పోయి వచ్చునంతలోనన యీయాచార్యునికి వేదనాశాంతి గలుఁగుఁబోలు!

మదనసేన. సంశయించుచు,,

ప్రియసఖి! నీనుడివినవచనంబున కర్థంబు నిగూఢంబై యున్నది. వెజ్జులు రాక యింతలోవ్యాధి యుడుగుట యెట్లు?

గుణమాలిని. భర్తృదారికా! నానుడికినవచనంబులకు గూఢార్థం బేమియు లేదు. మీతండ్రికి నేనిది విన్నవించి వెండియు నియ్యెడకు వచ్చునంతలో వైద్యులు సనుదెంచి యితనివ్యాధితాపం బడంపంగల రనియు నీకార్యము పిలువంబోయినదాన మరలి వచ్చునంతలో చక్కంబడు ననియు నింతవైళంబ ప్రవర్తించి పనియొనర్పంగల వార లుండెదరనియు నావచనంబులభావంబు.

గౌతముఁడు. సాసూయముగ. ఆత్మగతమున,,

ఈదాసీపుత్త్రి భర్తృదారిక సెప్పినవచనంబు వేయక విళంబించు చున్నది. ఇదియీచోటు విడిచిపోకయే యిట్టిముక్కుడివచనంబులం బ్రొద్దుపుచ్చునని తోఁచెడిని. దీనిందఱుమక కార్యంబు గాదు. కాలం బతిక్రాంతం బయ్యెడిని.

ప్రకాశముగ,,

ఓరాజపుత్త్రి! నేను శిరోవేదనాపీడితుండ నయి యున్నాఁడఁ గానమీయిరువురమాటలు వినుటకు నయితము కష్టపడుచున్నాఁడ. ఊరకుండుండు. నాలి వించుక యేనిలే కుండిన నది సంభృతార్తులకుం గొంత యుపశాంతిఁ జేయు.

మదనసేన. త్వరతో,,

ప్రియసఖి ; ప్రియసఖి ! ఈయాచార్యునికి జ్వరార్తిక్షణక్షణమున కధికమగు చున్నది. వైద్యులు వచ్చునంతలోనే మగునో ! ఓసి ! నాప్రాణంబులపై యాన, తక్షణమ నావచనం బనుష్ఠింపుము.

గౌతముఁడు. ఆత్మగతమున, సంతసించుచు,,

ఈలంజ యింక నేమి సేయగలదు. పోవలసినట్లు విధి యయ్యె.

గుణమాలిని. ఆత్మగతమున,,

ఋజుబుద్ధి యగునీభర్తృదారిక కింకను వీనికపటం బవగతంబు గాకయున్నది. నేను తనమాట సలుపనికోపమున నొట్టువెట్టి చెప్పెను. ఇఁకఁ జోక తప్పదు. ఇప్పుడు నాతి విస్పష్టంబుగ నీయర్థంబుఁ దెల్పుచుం జనియెద.

ప్రకాశముగ,,

వారువచ్చునంతలో నేమికావలయునో యది యగును.

అనుచు నిష్క్రాంతయయ్యె.

మదనసేన.ఓమహాత్మా! ఇంతదనుకనొక్కనాఁడేని ఈగుణమాలిని మద్వచనంబు నకు మాఱు వల్కియెఱుంగదు. ఇప్పుడటు సేయకుండుటకుం గతం బెదియో ! ఆ యర్థం బటుండనిండు.

ఓమహాత్మా ! మీ కిప్పు డిట్టిజ్వరార్తి దుర్భరంబై పెరుగుటకుం గారణం బే మొకో ?

గౌతముఁడు. మందస్మితము సేయుచు,,

ఓకామినీమణి ! యిది యిట్లు పెరుగుటకుం గారణంబు వ్యాధితత్వం బెఱింగి చికిత్స సేయం గడంగుటకు లేకపోవుటయే !

మదనసేన. ఓమహాత్మా ! నాతండ్రికడ నుండువైద్యులుకడుసామర్థ్యముగల వారు. వార లియ్యెడకు రాఁగాఁ గలగుణం బెఱింగి ప్రతీకారంబు సేయుదురు. మీకు శరీరారోగ్యంబు గలుగుట కిద్దియే నీఁబూనియున్న దానను.

గౌతముఁడు. మోమున వింత యగువిలాసముతో,,

ఓకలఁవకంఠీ ! ఈ వ్యాధితత్త్వంబు వైద్యు లెఱుంగునదిగాదు. దీనినిగుడు ర్చుటకు వారు తగరు. నాకారోగ్యంబు గల్గుట కిద్దియైన నిచ్చెద నని నీవాడినపల్కు సత్యంబు గావించెదవేని నాకీజ్వరార్తియడంగు. కానిచో నంతకంతకు దుర్భరంబై ప్రాణాంతంబుం జెలఁగించు.

మదనసేన. మహాత్మా! అది తప్పిపోవుటయుఁ గలదే! కులపాలికాజనంబున కిది తగునే! మీకు దేహారోగ్యంబు గల్గుట కేదియేని యున్నదానను. ఈవేదనం గుదుర్చుటకు వైద్యులు దగరని యానతిచ్చితిరి. మఱి యెవ్విధంబున నీజ్వరార్తి యడంగును?

గౌతముఁడు. ఓమదవతీవతంసమా! నాకుం గలిగియుండు వేదనకుం బ్రతిక్రియ వినుము.

చం. కమలదళాక్షి నీకుఁ బిగికౌఁగిటఁ జేర్చి యురోజచర్చితో,
త్తమనవకుంకుమంబును సుదారత మై గలయంగ నొత్తి కా,
మమునను మోవిపానకముఁ గ్రక్కున నానఁగ నిచ్చితేని నా,
సుమశరసంజ్వరార్తి యిది శోభనగాత్రి యడంగుఁ జెచ్చెరన్.

మననసేన. వెఱఁగుపడి. తలవాంచుకొని యూరకున్నది,,

గౌతముఁడు. ఓవరవర్ణినీతిలకమా! ఏల మోము వాంచుకొనియెదవు.

ఉ. దుర్భరతాపకారణముఁ దోయజనేత్రి వచింపఁ [illegible]ం,
దర్భముదాఁకఁ జత్తరిలి తన్వియి చేలకో! యూరకుండె దా,
నిర్భవదుత్కటార్తిఁ గని వేమరు బల్కినపల్కు కల్లయో,
నిర్భరమన్మథాస్త్రశిఖి నిచ్చలు గ్రాగెడునన్నుఁ గావుమీ.

మదనసేన. ఆత్మగతమున,,

ఆ! ఏమనవచ్చు! ఇట్టిసర్వవిద్యానిధు లయ్యు నీయాచార్యులు కామునిం జయింపలేకయున్నారు. కామాంధులు కృత్యాకృత్యంబు లెఱుంగరనుట నిక్కమం బయ్యె.

ఉక్తవాక్యంబధిక్షేపించుచు,,

ఇట్టివారి కిదియొకదోసమా పో!

కరమువిరక్తు లయినమహర్షులు సయితము కామినీమణుల రూపాతిశయములకు మనసు గరంగి తత్పరతంత్రత గైకొన్నవారు. ఇంతమాత్రాన నీమహామతిని నిరాకరింపం జనునా! విద్యాగురువునందు భక్తిఁదొలంగినం దదుక్తంబులగునర్థంబులు స్ఫురింపక నిరర్థంబులై చెడునని చెప్పుదురు. కావున నితనిం గుపితునిం జేయంజనదు. అనువుమెయి ననువర్తించి యీదుర్వ్యవసాయంబువలన నివృత్తుం జేసెదను.

ప్రకాశముగ,,

మహాత్మా! మీర లిన్ని దినంబులదనుక యీయంతేవాసినియందు సుతావత్సలతం బ్రకాశింపంజేసి యిప్పుడివ్విధి ననుచితంబు లయినవచనంబు లాడుటతగవా? సమస్తధర్మంబులును మీవలన నేకడా వింటిని. నాతండ్రి నన్నింక నంతఃపురంబుం బాసి రాఁజన దనిముదలయిడియె. మీతో విద్య లభ్యసించినందుకు మీకు గురుదక్షిణ లొసంగి యనుజ్ఞవడసి చనంజనుదెంచియున్నదాన. శిష్యవాత్సల్యంబున నా తెచ్చినవస్తువులం గైకొని నాకుం బోవ నాజ్ఞయొసంగుఁడు. అనర్ఘంబులగుమణులును బంగారంబును మాయయ్య మీకుం బంపియున్నాఁడు.

గౌతముఁడు. ఓమదవతీవతంసమా! ఈమణులు నాకేల? ఈబంగార మేల? అభినవరాగమనోహరం బగునీయధరవిద్రుమమణియ నా కిష్టంబు. నాకుఁ గావలసినబంగారము నీయొడలిబంగారమే! ఇది యెఱుంగక నీజనకుండు పెరయవి బంపిన నాకవియేల? ఓరసజ్ఞురాలా! నాతో విద్యాభ్యాసంబు సల్పినదానవు; సమస్తకళాకౌశలంబున సరస్వతిం బోలెడుదానవు; నీకంటెం గళాకౌశలంబున నధికుండు మదన్యుండు లేఁడు.

చం. ముదము దొలంగఁ జేడె యొకమూర్ఖుని గూడి యడంగుకంటె నా,
మదవతి పండితోత్తముని మానితరీతి వరింప నుత్తమం,
బది యొకరత్నహారము నియత్యాభయుక్తిని గోఁతిచేత నా,
పదపడుఁ జిక్కె; కాంచెడిని భద్రము రత్నగుణజ్ఞలబ్ధమై.

కాన నోమానినీమణీ! యితరములయినతలంపులు మాని మాననీయత నన్నుం జేపట్టుము. నీకుం దగినవరుండు పండితుండును రూపయౌవనసంపన్నుండును నగువాఁడు నాకంటె శ్లాఘ్యతముండు లేఁడు.

చం. కమలముఖీవతంసమ! నికామరతి న్ననుఁ బెండ్లియాడి భ,
ద్రముగఁ గళావళీజలధిఁ దాఁటిననేరుపు సార్థకంబు సే,
యుము. పెరవానిఁ గోరి విభవోజ్వలమారసభావవిజ్ఞతన్,
గ్రమము దొలంగ బుద్ధిసెడి కాననచంద్రిక సేయఁ బోకుమా.

మదనసేన. మహాత్మా! కన్యకాజనంబునకుం దగినవరుని సంపాదించుట తలిదండ్రులపని. ఇతరుల కందుం బ్రవర్తించుట తగదు. కొందఱు రాజకన్యకలు తామె మగలం వరించిరి. సకల గురుజనశ్లాఘ్యతేఁ బడయుటం జేసి యుపయుక్తంబు లయ్యె. అట్లుగానినాఁడు తామ పతులం గోరువారు పుట్టినయింటికిం గెట్టు గలిగించువారలు గాక పోరే!

శ్లో. * పితా రక్షతికౌమారే భర్తా రక్షతి యౌవనే,
రక్షంతి వార్ధకే పుత్రాః న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి.

అనునుక్తియు మీరు నాకుం దెల్పినదియ. మఱియు.

శ్లో. † జ్యేష్ఠా భ్రాతా పితా చైవ యశ్చ విద్యాం ప్రయచ్ఛతి,
అన్నదాతా భయత్రాతా పంచైతే పితర స్స్మృతాః.

అని యుండుటంబట్టి మిమ్ము నగోరం దగదు. పితృసమానుల రగుమీరు నన్ను శాస్త్రమర్యాదాపేతం బగుపథంబునకుం బూన్పం జనదు.

గౌతముఁడు. ఓమందయానా! నీనుడివినపల్కులు యుక్తంబుల. ఒందు వినుము.

గీ. జనకతుల్యుండ నగుటచేఁ జాన నీకు! కష్టసుఖముల నారసి యిష్టముగను, హితముఁ దెల్పితి. దుఃఖింతు నెలమిఁజెప్పి! నట్టిచదువులు వ్యర్థంబులగునె యనుచు.

ఓమతిమంతురాలా! నీ వలంకారశాస్త్రవిచక్షణురాలవు. విద్యాప్రదాత జనకతుల్యం డనుటకు భావం బెఱుంగవే.

గీ. రెండువస్తువులకు సమరీతి గవులు! సెప్ప; నఖిలార్థముల నది యొప్పఁ బోదు.
జనకతుల్యత హితకాంక్ష సలుప నగున! టన్నదేకాని; కా దఖిలార్థసమత.

---

* కుమారి యయి యుండఁగాఁ దండ్రి రక్షించు. యౌవనమునందుఁ బతిరక్షించు. వృద్ధురాలైనఁ బుత్రులు రక్షించెదరు. కాన స్త్రీకి స్వాతంత్ర్య మనునది లేదు. ఇచటం గుమారి యై యుండునప్పుడు తండ్రిరక్షించుట యనునది; సముచితవరసంప్రదానంబుదనుక నని భావము. దీనఁ గన్యకకు వరసంపాదనము జనకుఁడు సేయునది గాన నందుం బాలస్వతంత్రయై ప్రవర్తింపం జన దని తెలియపఱుచుచున్నది.

† జ్యేష్ఠభ్రాతయు, తండ్రియు, విద్య నేర్పినవాఁడును, అన్నమిడినవాఁడును, భయంబువలనం గాచినవాఁడును, అనునైదుగురు దండ్రు లగుదురు. ఇందు గౌతముఁడు విద్యాప్రదాత గానఁ బిత యయ్యె. పితరు బెండ్లాడఁజనదు గాన నతనిని బెండ్లాడంవగ దని భావము.

ఈయర్థంబు బిల్హణుం డేలుకొన్న యామినీపూర్ణతిలక వివరించియుండ లేదా! ఆకవి విద్యాగురు వయ్యు నఖిలగుణగణంబు లొప్పియుండు రసజ్ఞశిఖామణి యని యేకదా! యా రాజముఖీమణి తానె కామించె. ఈ వట్టిల నేయవు.

మదనసేన. ఓమహాత్మా! మీరు నుడివినయర్థంబు సంగతార్థంబ యయ్యు నాదరణీయతం గాంచంబోదు. సకలధర్మతత్త్వవేది యగునర్జునుండు తనవలన నాట్యవిద్యాభ్యాసంబు సల్పినవిరాటదుహిత నుత్తరయనుదాని దానిజననీజనకులు బెండ్లాడం బ్రార్థించిన ను శిష్యయగుటంజేసి సుతానిర్విశేష యని యాదరింపక పోయె. కాన విద్యాప్రదాతకు జనకతుల్యత్వంబు సెప్పుటకుం బరిణయాదికార్యంబులందును నిషేధంబె భావం బగును.

గౌతముండు. నవ్వుచు,,

ఓసిచతురా! నీనుడివినవచనంబులు నీకే విరోధము లయ్యె. ఎట్లంటివేని! ఆయర్జునుం డుత్తర తనకు సుతానిర్విశేష యయినం దనకుమారుఁ డగునభిమన్యునికి సగర్భానిర్విశేష గాదె!

శ్లో. * గురుపుత్ర స్తథా భ్రాతా పోష్యః పరమబాంధవః,

అను ప్రామాణికోక్తి యెఱుంగకయ కాఁబోలు! తనశిష్యను దనకుమారునికిఁ గట్టి పెట్టినవాఁడు. మహనీయులగు ద్వైపాయనాదిమునులును దాని కభ్యుపగమము సల్పిన, వారలు! ఇవి యారసి చూడ నతనికి విరాటదుహితం దాను బరిణయము చేసికొనుటకుం బ్రియంబు లేక వయో విశేషాదులం దదనురూపుఁడై యుండుటం జేసి తన కుమారునికిం దగునని యెంచి తన కాకన్య యిష్టముగా దనుమాటకు బదులుగా శిష్యయగుటంజేసి తానిష్టపడ ననియె నంతియ కాని శిష్యను బరిణయముచేసికొనం గూడదని కాదు; నీవు శాస్త్రార్థంబు నెఱింగినదానవు. ఆరసి చూడుము.

మదనసేన. మహాత్మా! మీరు బుద్ధిచాతుర్యంబునందు గీష్పతిసమానులరు ఏవచనంబుల కేకథల కేయాచారంబులకు నైన నభిమతార్థానుయోగంబుఁ గల్పింపం జాలినవారు. మీతో వివాదంబు సలుప నే నెంతటిదానను. విద్యాప్రదాత శిష్యం గోరుటయు నది యియ్యకొనుటయు నిర్యోది యయ్యిరువురకులశీలయశోవిభవంబులకుం గళంకంబయగు.

గౌతముండు. విదుషీరత్నమా! నీ వఖిలపురాణంబు లెఱింగినదానవు. నానుడువంబోవునర్థం బందు విస్పష్టంబు గాదె! మహనీయు లగువారలు తాము గోరినసారం గనయనలం గూడుటయె సంప్రదాయాగతం బగునర్థం బని యెఱుకపడుచున్నది.

---

* గురువు తండ్రియయినట్లు గురుపుత్రుఁడు భ్రాతయగు. అంతియగాదు పోష్యవర్గంబునను జేరినవాఁడు. పోరాసిచుట్టము నగు.

చం. లలనల రూపయౌవనకళావిభవంబుల నొప్పువారలన్,
గలయఁగఁ గోర్కి యుప్పతిలఁగా నిటు లాత్మల సంశయించిరే,
సలిలజసూతి చంద్రుఁడును సర్వసుపర్వగణాధినేతయున్,
గలయరె కూఁతుతో గురునికామినితో మునినాథుపత్నితోన్.

మదనసేన. మహాత్మా! మీర లానతిచ్చినయర్థంబు విస్పష్టంబు. * తేజస్వులగుటంజేసి వారికార్యంబులు పాపావహంబులు గాకపోయెనని సమర్థింపం జనును గాని ప్రమాణంబు లని యంగీకరింపంజనునా! చను నంచు రేని † నిషేధశాస్త్రంబులు నిష్ప్రయోజనంబు లగు. మఱియు.

చం. ‡ అలఘుమహాత్వపూజితులయాచరణంబులు సుప్రమాణతన్,
జెలఁగవు. వారివాక్యములు సూవె ప్రమాణతరంబు లౌను. ని,
స్తులఘనయోగవైభవులు దుర్గ్రహమై తగు కారణంబుచే,
నలసుజనాళి సేయనిక్రియల్ రచియించిరి తొల్లి యిచ్ఛమై.

సీ. § సృష్టికర్తకుఁ దొల్లిస్మృతివినాశము గల్గ భగవదాదిష్టయై బ్రాహ్మి నలువ,
మోమునఁ బొడసూపి కామినియయ్యె నాతనికి వెండియు స్మృతిదప్పకుండ,
చందురుం డలగురుచంద్రాననను గూడెమమతయందు వ్యతిక్రమంబుగురుఁడు,
సలుపుటఁజేసి. యానన్మార్గవర్తికి దౌష్యంతివంశంబు ధరణియందు.

---

ఇందుకుం బ్రమాణము. శ్రీభాగవతము.

శ్లో. * ధర్మవ్యతిక్రమో దృష్ట మీశ్వరాణాంచ సాహసం,
తేజీయసాం నదోషాయ వహ్నే స్సర్వభుజో యథా.

ఇందుకుం బ్రమాణము.

శ్లో. † నైత త్సమాచరే జ్జాతు మనసాపి హ్యనీశ్వరః,
వినశ్య త్యాచర న్మౌఢ్యా ద్యథా రుద్రోబ్ధిజం విషం.

ఇందుకుం బ్రమాణము.

శ్లో. ‡ ఈశ్వరాణాం వచ స్సత్యం తదే వాచరితం క్వచిత్.
తేషాం యత్స్వవచో యుక్తం బుద్ధిమాం స్తత్త దాచరేత్.

§ తొల్లి సరస్వతి భగవత్సన్నిధానమున నుండి; బ్రహ్మ కదాటునవినష్టమై పోయినస్మృతిని వెండియుఁ బుట్టించి యాస్మృతివిభ్రంశము వెండియు గలుగకుండ నాపద్మసంభవునిదండన యుండు మని యాభగవంతునిచే నాజ్ఞాపితయై యట్లొనర్చె.

గీ. పతఘుఁ గల్పించి వెండియు విస్తరిల్లఁ,
జేయుటకె యట్టిమతిఁ గల్గఁ జేసె విధియు,
త్రిదశపతి కాయహల్యకు మది గలయుట,
వేదములయందుఁ జెప్పఁగా వినమె యెపుడు.

శంభుండు లోకహితార్థంబు విషము మెసవె నని యది దినం గడంగినం దెర వారలు తనువు నిల్పుకొనం గలరె.

" గౌతముఁడు. ఆత్మగతమున,,

కట్టా ! తన్నుం గట్టఁ ద్రాళ్లు తానె తెచ్చుకొన్నట్లు దీనికి నిఖిలవిద్యా విశే షంబులం గఱపుట నాకె సంకెలు లయ్యె. ఉత్తరోత్తరయుక్తివాదంబున దీనిం జయిం పలేను. జయించితినిపో ! ఇది యీవిధంబున నీయర్థంబునకు సమ్మతింపదు.

మఱియునిట్లుప్రశ్నోత్తరంబులుసలుపుచున్న గుణమాలిని ననుదెంచెనేనిఁగా ర్యంబు చెడు. యింతలో నీయింతిని బలాత్కరించియుద్దిష్టంబునెఱవేర్చుకొనుటయురవు. విద్యాప్రదాతయనుగౌరవంబుచేతనైన నామనోరథంబు పసుతూర్చ ననుమతింపకపోదు. దీనిచరణంబులపైవ్రాలి వేఁడుకొనుదు నేని శృంఖలానిగళితయగుకరేణువుపగిదిఁగట్టువడు,

ప్రకాశముగ,,

ఓపృథునితంబా ! బింబాధరా ! ఇందు రోదంబడుమా !

చం. కలికిరో యిట్టిపల్కులను గాలము పుచ్చుట యేల యారకే,
సలిలజబాణబాణచయసంతతవర్ష మసహ్య మయ్యె నీ,
కులకుమిటారి గబ్బిచనుగొండలయందకుఁ జేర్చి కావు ని,
ర్మలమతి నీపదంబులకు మానిని మ్రొక్కెద నాదరింపుమా.

---

ఇదియుఁ జంద్రుఁడు తారను బట్టినకథయు నతివిపులముగ నేనాధీకరించి యుండు శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణమునం దెలిసికొనవచ్చును.

బృహస్పతి యుచథ్యునిభార్య యగుమమతయనుదానిం బలాత్కరించి దానితోఁ గూడె. తనసహోదరునిభార్యయం దిట్టివ్యతిక్రమంబు నేయుటంబట్టి యితనిభార్యను పరుండపహరించునట్లు సంభవించినది. దేవగురువునకును మమతకును పతఘుం డను వాఁడు జనియించి సంతానార్థియై యజ్ఞ మొనరించినభరతునికి దేవతలచే నీఁబడి యతనికి వంశకరుండయ్యె. ఈకథ భాగవతనవమస్కంధమునఁ జూడవచ్చు.

అని నమస్కరించు చున్నాఁడు,,

మదనసేన. సంభ్రమంబుతో. ఆత్మగతమున,,

ఆ! ఈతఁడు కామపిశాచాభిభూతుండై కృత్యాకృత్యవివేకంబు మాని నాకుం బ్రణమించుచున్నాఁడు. ఇంతటిపనికిం బూనినవాఁ డిఁక నెంతటి కార్యంబున కేని సాహసించునా! ఇఁక నిచ్చో నిలుచుట యుక్తంబు గాదు. ఈయర్థం బెఱిం గియే కాఁబోలు గుణమాలిని నాపనుపునప్పుడు జంపు చేసినయది! దానిభావం బెఱుంగక మందబుద్ధినై కఠినంబుగఁ బల్కి పంపితిని.

అని యనుకొనుచు గృహబహిర్ద్వారాభిముఖి యై త్వరితముగఁ బరిక్రమించు చున్నది.

గౌతముఁడు. ప్రణమించి లేచి,,

ఆ! ఇది నాకు శిష్య యయ్యెఁ బ్రణతుండ నైన న న్నాదరించె. ప్రణా మంబునకుం గడంగినవాఁడను పైకొనుటకుం గడంగితి నేని యభిమతార్థంబు సమకూరి యుండదే! ఇది తొలుతం దోఁచక పోయె. ఏమి సేతు!" * విప్రాః పశ్చిమబుద్ధయః,, అన్నలోకోక్తి నాయంద యన్వయించె. ఇప్పటికిని కార్యం బేమియుఁ జెడలేదు. త్వరితగతి దానివెంట నంటియీయిల్లు దాఁటునంతలో నాపల్లవాధరంబట్టుకొని మనోర థంబుఁ దీర్చుకొనియెద.

అని సత్వరముగఁ బరిక్రమించుచున్నాఁడు,,

మదనసేన. వెనుకకు మరలిచూచి. భయపడుచు,,

ఆ! ఈతండు నావెనువెంటనంటి సరభసగతి నేతెంచెడిని. నన్నుం బలాత్క రించి యశ్రేయంబు జరుపం బూనియున్నాఁడని తోఁచెడిని. నాకు రక్షణార్థంబుగ నలు దెంచి యుండుభటులఁ బిలుతునన్న నో వారలు కడుదవ్వుల నుండుటంబట్టి నాపి లుపు వారికి వినంబడదు. ఈగృహబహిర్ద్వారంబుం గడఁచునంతలో నే నితనిచేతం బడక తప్పించు కొనవలె నని తోఁచెడిని. శక్తి గలకొలందిఁ దప్పించుకొనఁ బ్రయత్నా పడవలయు. అనంతరము దైవాయత్తము.

అని తలంచుకొనుచు ద్రుతతరంబుగఁ బఱువిడుచున్నది,,

గౌతముఁడు. పరువునంజనుచు,,

ఆ! ఇప్పుడు గదా! నానయనంబులు సఫలంబులయ్యె. ఈమందగమన గడు సంభ్రమంబున నరుగువిలాసం బుల్లంబునకుఁ గరము మోదావహంబయ్యెడిని.

---

* బ్రాహ్మణులు ముందాలోచనలేనివారు.

చం. కులుకుఁగుచంబులం బయిఁటకొంగు వెసం దిగజాఱఁ గట్టుకొం,
గలఘునితంబబింబయుగమందలికాంచిగుణానుషక్తమై,
నెలకొన ముంగురుల్ చెదరి నెమ్మొగమెల్లను గ్రమ్ముచుండ నీ,
యళికచ వోవ్వనీటు సురతాంతవిలాసపులీలఁ గ్రాలెడిన్.

ఓ బాలికామణీ! యిదె చేయలంతిం జిక్కితివి. అని పట్టుకొనం దరిసెను.

మదనసేన. భయంపడుచు,,

హా! ఇతనిచేతం జిక్కుకొంటి నే!

అని పరువుపాఱుచున్నది,,

గౌతముఁడు. ఓ రాకేందుబింబాననా! రావే రావే!! యని వైళంబ పట్టుకొనం బోయె.

మదనసేన. బిగ్గరగ,,

ఓ యయ్యో! సుతావత్సల! యీనిర్దయునిచేతం బడంబోవుచున్న సత్వరంబుగ వచ్చి రక్షింపుము రక్షింపుము.

సంభ్రమంబుతో రాజును గంచుకియుం బ్రవేశించిరి.

రాజు. ఆయుష్మతి! భయంపడకుము; భయంపడకుము. నిన్నుంగావ నిదె చనుదెంచుచున్నాఁడను.

మదనసేన. నిలువంబడి నిట్టూరుపువిడిచి. తుఱుము చక్క నొత్తుకొని. చీర సవరించుకొని. ఆత్మగతమున,,

ఆ! దైవగతి నిప్పుడు రక్షిత నైతిని. ఇఁక స్వస్థచిత్తనయ్యెదను.

గౌతముఁడు. ఖేదముతో. మదనసేన కనుపదమున నిలువంబడి. ఆత్మగతమున,, కట్టా! విపరీతపువిధి యీభూపతి నియ్యెడకు రప్పించె. వ్యర్థమనోరథుండనై చెడుటయగాక యీరాఁపరాధంబుతోఁ బట్టువడినవాఁడనైతి. ఏఁడు దండింపకపోఁడు. ఇప్పుడేమి సేయంగలవాఁడ.

ఆయుష్మతీ! నీవిట్లు కాతరభావంబుం జెందం గారణం బేమి?

మదనసేన. ఆత్మగతమున,,

ఇప్పు డీతం డొనరించినయపరాధంబు బయల్పఱచితినేని నాయయ్య యీ విప్రునందుం గడుం గ్రూరం బగు నాగ్రహంబుం జెంది తలదునిమి వేయక పోఁడు. బ్రాహ్మణహననంబున నైన పాపంబు దప్పక గలుగు ; అంతియ కాదు. ఇతండు నాకు విద్యాగురువు గాన గురుహత్యాదోషంబు సంభవించు. కాన నిప్పుడు భయ కారణం బన్యంబు వచించి యీతని రక్షించుటయ యురవు.

ప్రకాశముగ,,

అయ్యా! మఱేమియు లేదు. ఆచార్యుండస్వస్థశరీరుండై యున్నాఁడని మీకడకు గుణమాలిని నగదంకారులం బిలుచుకొనిరా నంపి యది రాఁదడవగుటయుఁ దన్మార్గప్రతిపాలనంబు సేయఁ దలవాకిట కేతెంచుచుంటి. మఱియందుం గల భ్రమంబున నేమొ యొకబ్రహ్మరాక్షసుండు నాపైఁ బడవచ్చినట్లుండె. అసహాయనై యెన్నఁడు నున్నదానం గాను. కాన భయంపడి నిన్నుం బిలిచితిని.

గౌతముఁడు. ఆ! ఏమి దీనిచాతుర్యంబు! జరిగినయర్థంబు శ్లేషార్థోక్తిన్నయంబుగ నన్యథాసమర్థితంబుఁ గావించె. నే నపరాధంబుఁ జేసినవాఁడ నయ్యు నన్నుఁ బట్టి యీజన దని యెంచి యిట్లు చేసె. దైవవశంబున మృత్యుదంష్ట్రలవలనం దప్పించుకొంటిని. ఏను నీమానినీమణివచనానురూపముగఁ బల్కం జనును.

ప్రకాశముగ,,

మహారాజ! జయం బగుంగాత. ఏను గొన్నిదినంబులనుండి మద్గృహంబును గాచి యప్పుడప్పుడు పొడసూపి జనుల భయపెట్టుచు వచ్చుచుండినయొకబ్రహ్మరాక్షసుని నుచ్చాటితునిఁ జేయ మంత్రోపాసనంబు సల్పుచున్నవాఁడను. దాన నారాక్షసుం డిల్లు విడిచి పోవలసినట్లయ్యె. తాఁబోవుకాలంబున నాయసుర యీ మదనసేన కగపడి భయంబుపుట్టించె. ఆబ్రహ్మరాక్షసుండును నిగ్రహీతుం డయినవాఁడు. ఇది భయభ్రాంత యై బిగ్గరగ నఱచుటం జేసి దీనిం గావ నేనును ద్వరితగతిం బఱతెంచుచున్నాఁడ.

రాజు. ఆశ్చర్యముతో, ఆత్మగతమున,,

ఆ! జ్యోతిషికుండు సెప్పినవచనంబులకు నియ్యెడం జరుగుచుండు వృత్తాంతంబు సరిపోయినది. ఇది కర మబ్బురంబై తోఁచెడిని. ఆవృద్ధబ్రాహ్మణుండనయము నా సేమంబ యాకాంక్షించుచుండువాఁడు. నక్షత్రశాస్త్రపరిశీలనంబున రాఁబోవునెడరుఁ దెలిసి తాన సనుదెంచి నాకుం దెల్పినవాఁడు. ఇట్టిసంకటంబులందుఁ దొలుతం దెలిపి

తత్ప్రీతివిధానంబు గావింపఁ బనుచుట కేకద భూపతులు జ్యోతిషవిద్యానిధుల నపరిమితధనంబు లొసంగి తమకడ నుంచుకొని పోషించెదరు. బ్రాహ్మణపోషణంబు సేయువారల నారసి భగవంతుండు గాచుచుండుఁ గాదే! బ్రహ్మరక్షోభిభూత యగునా ముద్దులపట్టి నిట్టియవసరంబునం గాఁచినవాఁడు గౌతముఁడు సూవే! ఇతండు చేరువకుం బఱతెంచినకతంబున నారక్కసుండు నాకూఁతుం బాసి పోయెనోటు!

ప్రకాశముగ,,

ఓ పట్టీ! దైవవశంబుచే బ్రహ్మరాక్షసునివలన విముక్తవయితివి. ఇప్పుడు నిన్ను వెండియుం బుట్టినదానవుగా నను కొనియెదను. గుణమాలినిని నాకడ కంపితి నంటివి. అది నాయొద్దకు రాలేదు. ఆ చేటి నాసకాశమునకుం జేరునంతలో నేనాస్థానమండపమును బాసి వేఱొండుమార్గంబునం జనుదెంచియుండుదుం గాఁబోలు?

మదనసేన. తండ్రీ! అట్లయిన మీర లియ్యెడ కిప్పుడు సనుదెంచుటకుం గతం బేమి?

రాజు. పుత్రి! వినుము. ఏను గొన్ని నిమిషములకాలమునకు ముందు సభాస్థలంబున నుండునప్పుడు కాళికుం డనుమనయాస్థానజ్యోతిషకుఁడు త్వరితగమనంబునం జనుదెంచి నాయిచ్చునర్ఘ్యాదికంబు నొప్పరికించి నన్నుం జూచి యిట్లనియె. ఓ రాజా! నీముద్దులపట్టి మదనసేనకు తత్క్షణంబున బ్రహ్మగ్రహాభియోగంబుచే నెడరు దొడరం బోయెడిని. ఆయెడరునం గావ నీ వయ్యాబలకడ కరుగం జను. జంపు సేయం జనదు. నీపుత్రికజన్మపత్రికం బరికించుచుండి గ్రహసంచారానురూపముగ సంప్రాప్తంబు గాఁగల యీయెడరు నామానసంబున కదాటునం దోఁచె నది నీకు దెల్పి తత్ప్రీతివిధానంబును గావింప నిదె యతిత్వరితగతిం జనుదెంచినవాఁడ. అనిచెప్పఁగా నే నదరిపడి చామరగ్రాహిణివలన నీ వియ్యెడకుం జనుదెంచియుండుట యెఱింగి ససంభ్రమముగ నిదె పాదసంచారమునఁ బరువిడుచు నేతెంచితిని. దైవవశంబున నీవు సురక్షితవై యుండం గాంచితిని. ఓయమ్మ! నీ వియ్యెడ నుండి గురుదక్షిణ లన్నియు సమర్పింపం జాలవు. ఈకంచుకియె పరిచారికాసమానీతంబు లైననానావిధరత్నంబులును ధనంబులును వస్త్రవాహనాలంకారాదులును వెవ్వేఱ నీవిద్యాగురునకు సమర్పించు. నీవు బ్రహ్మగ్రహాభియోగజనితం బగుభయాతిరేకంబునఁ గడు నలసటం జెంది యున్నావు. వైళంబ నాతోఁ జనుదెంచియుండు పరిచారికాజనంబు గొల్వ నీయింటి మొగపాళంబునకుం దేఁబడియుండుకరేణుకాస్తోమంబు నధిష్ఠించి నీతల్లికడకుం జనుము.

మదనసేన. తండ్రీ! ఆజ్ఞ! అని పరిక్రమించుచు. ఆత్మగతమున,,

ఇప్పుడు జరిగినయదియుఁ జనకసమావేశంబుం గనుంగొన గుణమాలినికరము చతురతం

ప్రవర్తించినవిధంబు మానసంబునకుం దోఁచుచున్నది.

ఆనాసఖి గుణమాలిని యాచార్యుండు నేయంబోయెడుదురతిక్రమంబుం దొలుత నూహించి, వైద్యులం బిలిపింపఁ బంపు వడసి పోయినయాయుకాద నన్నీ యెడరు వలనం దప్పింప నను వారసి కాశికుసికడకుం జని యాతనిం గొని నాతండ్రి సిర్యోడకుఁ బంపెను. నాయనుజ్ఞ లేక నాయయ్య కీగౌతమునిదుర్వ్యవసాయం బెఱింగింప నిచ్చగింపక యీపని యొనర్చినయది. దీన నే నీయాచార్యుని చేతం జిక్కుపడక తప్పించుకొనుటయును బ్రాహ్మణదండనజనితపాపంబు సంభవింపక పోవుటయు నయ్యె. నావిద్యాగురుని దురుద్యమంబు విన్న నాయయ్య కరము కినుకం జెంది యతని దండితునిం జేయకపోఁడు. ఇం దను వారసి సమయోచితకార్యంబు సలిపినగుణమాలినికి గుణమాలిని యన్న పేరు తగినయదియ. ఏఁ జని దాని నభినందించెదను.

అనితలంచుకొనుచు నిష్క్రాంతయయ్యె.

రాజు. గౌతమునింగాంచి,,

ఓపండితోత్తమా ! ఇంతకుం బూర్వమున నేనిట్యాడకు వచ్చునప్పుడు రావే ! రావే ! యని యొకఁడు పిలిచినవిధంబు నాకుం గర్ణగోచరం బయ్యె. అందు సందియంబు నొందియున్నాఁడను. తత్ప్రకారం బెఱింగింపుము.

గౌతముఁడు. భయంపడుచు. ఆత్మగతమున,,

ఈరాజు మోహావేశంబున మదనసేనను నేఁ బిలిచినమాటలు విన్నాఁడు. సంశయాకులుండై యడిగె. దీని నాబుద్ధిచతురతచే వేఱువిధంబుగ సమర్థించి యితనిమనఃకాలుష్యంబుఁ బోనడంచెదను.

ధైర్యంబుఁదెచ్చుకొని ప్రకాశముగ,,

ఓరాజా ! రావే ! రావే ! యని నుడివినది యేన. అవి నేను దొల్లి రచించిన పురవర్ణనమును బోధించుసంస్కృతపద్యంబులోనివి. అవి యిప్పుడుస్మృతిపథంబునకు వచ్చి పునరుచ్చరితంబు లయ్యె.

రాజు. ఆత్మగతమున,,

ఇతఁడు వర్ణనంబునం గరము సమర్థుండు. ఇతఁ డొనరించినపురవర్ణనంబు కడు రసావహంబై యుండకపోదు. వినవలయు.

ప్రకాశముగ,,

ఓపండితోత్తమా! మీరచించినపద్యంబు రసోత్తరంబై యుండును. కరుణించి వినిపింపుఁడు.

గౌతముఁడు. రాజా! వినుము. ఈపద్యంబు భవత్పురవర్ణనంబు గావించుచు నానుడివినయది.

శ్లో॥ * గేహేగేహే జంగమా హేమవల్లీ।వల్ల్యాంవల్ల్యాం పార్వణః చంద్రబింబః,
బింబేబింబే కోకిలానాం విరావో। రావేరావే మన్మథః పంచబాణః.

రాజు. పరమామోదంబుతో,,

ఓకవివరా! భవద్వచనసరణిం గలసారస్యం బేమని పొగడంగలను?

గీ. ఇక్షురససారసంపద లెలమిఁ గాంచి। ముగుదతనమున నుండెడుమగువమిన్న,
ప్రణయలజ్జాకులాపాంగపజ్క్తిఁబోలె। నుల్లము హరించె నీపల్కు లురవు మీఱ.

పండితోత్తమా! ఇఁక మీకుబాలికాధ్యాపనకార్యంబు లేదు. కాన మత్సభాస్థలంబున నంతఃపండితులకుం బ్రముఖత్వంబుఁ దాల్చి యథాసన్మాననాదులు వడయుచు నాకడకు దినదినము వచ్చుచుం బోవుచుండుఁడు. భవత్సల్లాపామృతధారల చే మా మోదించుచుండంగలవారము. ఇప్పుడు నాకంచుకి సమర్పింపంబోవురత్నంబులంగైకొనుఁడు.

కంచుకివలనికింజూచి,,

కంచుకీ! మదనసేనవిద్యాగురుదక్షిణావస్త్రపల మోచుకొని వచ్చినపరిచారికాజనంబుల నిర్యోడకుం దవ్వుల నిలువంబడియుండువారిం దోడ్కొని వచ్చి తత్సమానీతంబులగురతనంపుంబళ్లెరంబుల నీపండితోత్తమునకర్పించి యితనిమొదలఁగొని నాకడకు రమ్ము. నేను సభాస్థలంబున కేగి కాశికుని సన్మానింపవలయును. పోయెదను.

---

సంస్కృతశ్లోకమునకు సరి యయినవి సీసపాదములును, వానిభావముఁ దెలుపునట్టిది గీతము నీక్రిందిపద్యమునం దుండు.

* సీ. ఇంటింటఁ గన్గొన హేమలతాతతు లంచితరతి సంచరించుచుండు,
లతలత కొక్కకలలితపార్వణశారదేందుబింబము వొల్పుచంద మమరు,
ప్రతిపార్వణేందుబింబంబునఁ గలకంఠకంఠనాదంబులు గడలుకొనును,
రావరావమునకు రతిపతి ధృతపంచబాణుఁడై మెనయుచు రాణఁ జెలఁగు,
గీ. నవఁగ బంగరుదీవెల కెన యనంగఁ। జాలుపెలజవ్వనపుశరచ్చంద్రముఖుల,
కంఠనాదము కలకంఠకంఠరుతము। మాడ్కిఁ గలిగించు నంగజోన్మాద మనుట.

కంచుకి. మహారాజ! ఇదె యుత్తమతురంగంబులం బూన్చినరథం బాయత్తంబై సారథిసమానీతం బగుచు వాకిలిముంగట నున్నది. మహారాజా సభాస్థలంబునకు విచ్చేయ రథారోహణంబు నొనరింపుడు నేలికనియోగంబనుష్ఠింప నేఁ జనుచున్నాఁడ.

రాజు. కంచుకీ! అగుఁగాక. రథంబుకడకుఁజనియెద.

కంచుకి. దేవ! ఇటు! ఇటు!

రాజును గంచుకియు నిష్క్రాంతులైరి,,

గౌతముఁడు. మహాదుఃఖంబుతో,,

ఇఁక నేమి సేయంగలవాఁడను. ఇక్కన్యక నే నెంత యనువర్తించినను నా వేఁడికోలున కియ్యకొనక పోయెం. సకలశాస్త్రప్రవీణుఁడ నగునన్ను నొప్పరికించినది గాన దీనివిద్యాభిజనసౌభాగ్యగర్వం బడంగునట్లు మూఢుని నొక్కనిం బతి సేయవలయు. తదర్థ మను వారయుచుండి యది గావించి సూడు దీర్చుకొనియెదను. ఇప్పుడు కన్యకారత్నంబు చెయిజారిపోయె. తక్కినరత్నంబులనైన నేల విడువవలయు. పోయి కైకొందుం గాక.

అని నిష్క్రాంతుండయ్యె.

ఇది కాళిదాసచరిత్రప్రకరణంబునందుం

ప్రథమాంకము సంపూర్ణము.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణేనమః.

శ్రీరస్తు.

---

* రంగప్రవేశంబుచే నాయకునిచరితము ప్రత్యక్షముగఁ గాన్పించుచు; నర్థప్రకృతి పంచకమునం జేరినబిందువును వ్యక్తము సేయుచు నానావిధము లగునవాంతర ప్రయోజనములకును గథాసన్నివేశములకును రసములకు నాశ్రయమై యుండునది యంక మనంబడును. ఇది ప్రాయికము.

బిందువనఁగా:—అవాంతరఫలములచే విచ్ఛిన్న మయినప్రధానఫలంబు చెడకుండుటకుఁ గారణ మయినయొకయర్థప్రకృతి.



శ్రీ ర స్తు.

# కాళిదాసచరిత్రప్రకరణము.

## ద్వితీయాంకము.

గుణమాలిని ధనమాలిని అనుచేటికలు ప్రవేశించిరి.

ధనమాలిని. ప్రియసఖి! నన్నుం గాంచినప్పు డెల్ల నత్యాదరంబుతో మాటలాడుదానవు నే నేతెంచి యింతతడ వయ్యుఁబల్కరించుకొనక యున్నావ దేలనే!

గుణమాలిని. అనునయముగా,,

ప్రియసఖి! కోపగించుకొనకుము. నితాంతచింతాసంతానసమాకులస్వాంత నై యున్నదానను. ఈకతంబున నీవు వచ్చుటయు నెఱుంగను. నాతప్పు మన్నింపుము.

ధనమాలిని. ప్రియసఖి! యుపచారోక్తు లటుండనిమ్ము. నీవు నాకు వాగుపచారంబు సల్పలే దని గాదు చెప్పినది! ఇట్టిచింతకుం గారణ మే మని యడిగినదానను.

గుణమాలిని. ప్రియసఖి! వేఱు కారణం బే మున్నది? మనభర్తృదారిక మదనసేన తాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లని సాధింపఁగడంగియున్నది. అదియే.

ధనమాలిని. ప్రియసఖి! మనభర్తృదారిక పట్టిన పట్టేమి? యేల యిట్టి పట్టుపట్టె?

గుణమాలిని. ప్రియసఖి! ఈమదనసేనకుం బరిణయయోగ్య మగుప్రాయంబు సంప్రాప్తం బయిన దాదిగ మనరాజు సకలదేశములరాజకుమారులం బిలిపించి కూతుఁతో నీకుం బ్రియుండగువానిని వరియింపు మన నావిదుషియు నొక్కొక్కని నొక్కొక దుర్గ్రాహమగుసమస్య యిచ్చి యోడించి యిట్లందఱం దఱుమం గొట్టినయది. తనకంటె విద్యావిశేషసంపన్నునిఁ గాని వరియింపదట. అట్టివాఁ డిందనుక దొరికినవాఁడు గాఁడు. ఈయర్థంబునం బ్రవర్తించి రాజును రాణియుఁ గడు నలయుచున్నవారు. వరునితో సంగత యైనకూఁతుం జూడఁ గోరి త్వరాకులితహృదయులై వరసంపాదనమునం దనారతమాత్మవృత్తుల వెల్లించెదరు. ఇది యెట్లు పోయి యెట్లు వచ్చునో! ఈయర్థంబునం బ్రియసఖీ! నే నెంత చెప్పినను భర్తృదారిక పెడచెవిం బెట్టుచున్నది. ఇది మంచి కగునో! చెఱుపున కగునో!

ధనమాలిని. ప్రియసఖి! స్త్రీల కిట్లు మిక్కుటముగ విద్యాభ్యాసము సేయించుట యెప్పటికింగాని యనర్థావహంబు గాకపోదు. మనరాజు మదనసేనను సర్వవిద్యలయందుఁ గరము చతురం గావించినవాఁడు. దాన నిట్టికష్టం బనుభవింపవలసివచ్చె.

గుణమాలిని. ప్రియసఖి! తొల్లింటిరాజకన్యక లెల్ల నపరిమితవిద్యావిచక్షణత్వంబు గలవారలు గారే! వారివలన వారితలితండ్రుల కిట్టిదుముల వడవలసివచ్చెనా! గౌతముఁడు రాజపుత్రికతోఁ దనకంటె విద్యావిచక్షణుండు లేఁడని గర్వించి పల్కెనట. కాన వానికంటె బండితునిం బరీక్షించి తెలిసికొని యట్టివాసిన పెండ్లాడవలయు నని యున్నది. ఇది యిట్టిపట్టు పట్టుటకు మూలం బడియె. స్త్రీలకల్పవిద్య యగునేని యనర్థావహంబగుం గాని సత్సంప్రదాయలబ్ధం బయిననిరవధికవిద్యావిశేషంబు లిడుమలకు మూలంబు లగునే! మఱియు నట్టివారలు * సావిత్రీ, ద్రౌపదీప్రముఖులవలెఁ బతిసౌఖ్యప్రద లగుదురు.

సత్వరంబుగ వసుమాలిని యనునొకచేటి ప్రవేశించి. రొమ్మున చేయి యిడుకొని.

కట్టా! కార్యంబుగతి యిట్టు లయ్యెఁగా! దీన ననర్థంబు వాటిల్లక పోదు. ఈ యర్థంబు ముగియుదనుక నుండి తనకుం దెల్పు మని చెప్పి నన్ను రాజకులంబున నునిచి యార్య గుణమాలిని యింటికిం జనినయది. త్వరితగతిం జని జరిగినవృత్తాంతంబు దెల్పెదను.

అని పరిక్రమించుచున్నది.

గుణమాలిని. ప్రియసఖిధనమాలిని! రాజకులంబునం జరుగువృత్తాంతంబుం దెలిసికొని వచ్చి నాకుం దెల్పు మని నాయనుజాతను వసుమాలిని నయ్యెడ నిలిపివచ్చితిని. ఈ దినము కరూశాధిపతికుమారుండు మనభర్తృదారికతో విద్యావివాదంబు సేయ నేతెంచియున్నాఁడు. అతండు జయంబు వడసి రాజపుత్రిం జెట్టపట్టంగలండో? లేక యోటువడి పరిభవంబున కోడిగట్టం గలండో? యితండును విజితుం డయ్యెనేని యిప్పటిరాజకుమారులలో నింక నీమదనసేనం జయింపఁగలవాఁడు లేఁ డనవలయు. వృత్తం బేమయ్యెనో వసుమాలినివలన నెఱుంగ నగు.

ముందుకు దృష్టులు నిగుడ్చి. కుతూహలంబుతో,,

ఆవసుమాలినియె యిదె వచ్చుచున్నది. ఓసీ! ఆయుష్మతి వసుమాలిని! కరూశాధీశునికుమారుండు మనభర్తృదారిక యడిగినప్రశ్నల కుత్తరంబు లే మైనఁజెప్పెనా!

* వీరుభర్తలకు సౌఖ్యముఁ గల్పించిన విధము గ్రంథాంతంబునఁ దెల్పంబడు.

వసుమాలిని. ఓయార్యా! ఉత్తర మన్నమాటయెక్కడిది! గౌతమునికపటము నం బరాతిసంధానంబునందుఁ బరము కౌశలముం గానిపించు మనభర్తృదారిక యొసంగు విషమసమస్యలకు గీష్పతి గాక మనుష్యమాత్రుం డుత్తరము సెప్పం జాలునే!

గుణమాలిని. ఓసీ! ఏమే యీవింత! సకలశాస్త్రపారంగతుం డనియుఁ గవితా పారసర్వస్వవేదియనియుఁ బ్రఖ్యాతిఁ గాంచినయీకరూశాధినేతకుమారుండు నిట్లయ్యె నా! ఇతండు నితని సెయ్యుండు కళాచంద్రుండు నీయిరువురే మదనసేనను విద్యా వివాదంబునం గెలువంగలవార లని యెల్లరుం జెప్పుకొన విని సంతసంబు నందుచున్నందు కిప్పుడిగతి యిట్లు లయ్యెగా! కళాచంద్రుండు గొన్నినాళ్లనుండి యున్నచో టెఱుక పడక యుండెడిని. ఇంక మదనసేనను బెండ్లాడంగలవాఁ డెవ్వఁడో తెలిసికొన శక్యంబు గాకయున్నది.

వసుమాలిని. ఓఆర్యా! గౌతముఁడు దగ్గఱనుండుదనుక నీరాజసుతను జయింప నెవ్వరికి నలవి గాదు. అతఁడు మాయావి. కరము కుశలుఁడు. కపటయుక్తులచేఁ బరుని బరాభూతునిం గావించుసామర్థ్యం బతివేలంబుగఁ గడించి యున్నవాఁడు. రాజ పుత్రికివాని నేరిపి దానిచే నఖిలవిద్యావంతులను మోసపుచ్చుచున్నవాఁడు.

గుణమాలిని. ఓసి! మనభర్తృదారిక తనయందుం గపటవృత్తిం జరించు చున్నాఁడని గౌతముని నిరాకరింపకయున్నది చూచితివా! ఇవ్విధంబునం బండితుల నెల్ల నిరాకరింపఁగా భర్తృదారిక తన్నే పెండ్లాడు నని యెంచి సుమీ? యీగౌత ముం డిట్లు సేయుచున్నాఁడు. ఇది మదనసేన యెఱింగి యుండదా!

వసుమాలిని. ఓ ఆర్యా! అంతయు నెఱింగియు నెఱుంగనిదానివలెఁ బలికెదవు. నీప్రేమం బట్టిది. మనభర్తృదారిక; గౌతమునికి గురుదక్షిణ సమర్పింపంబోయిన వాఁడతండు గావించినమహాతిక్రమమును సయితము గురుభక్తివిశేషంబున మనసునం దుంచుకొనక యీఁకని తఁడేమిసేయంగలఁ డని యొప్పరికించి యథాపూర్వముగ నతని యందు శిష్యోచితజనులగు వినయభయభక్తులతోఁ బ్రవర్తించుచున్నది. అట్టిబుజా హృదయ తక్కిన యవగుణలేశంబుల గణించునే!

గుణమాలిని. ఓసి! నీవుడివినది పరే! ఆనాఁడీగౌతముఁడు భర్తృదారికయందుం జేయంగడంగినమహాతిక్రమంబు రాజునకుం దెలిపియుండిన నప్పు డతండు దండితుండై యెప్పటికేని రాచనగరునం బ్రవేశంబుఁ గాంచకపోవుం గదా! అక్కాలంబున స్త్రీబుద్ధి సుజాతం బగుబ్రాహ్మణదండనపాపభీరుత్వంబు బ్రబలినకతంబున మదనసేన నాయెడరున

నుండి తప్పింప మాత్రమె తలంపుగొని రాజాన కత్యంతగౌరవ్యుండగు వృద్ధబ్రాహ్మ ణుండును తదీయాశ్లేషకాంక్షియై యుండుకార్యాంతికునిం బ్రార్థించి యాతనిం గొని భూపతిని భర్తృదారికను గానం బరిచితిని. అప్పుడు నాపబుద్ధి పెడతలం బట్టి యుండె. ఇప్పు డయినను రాజపుత్రికి గౌతముని ప్రకటంబుఁ దెల్పుమనెన్నగు నన్నతో మదపతికిగలుగురుభక్తివిశేషంబునానామాటను చెవిం జొరనీడనిమ్మెంచుచు నూరకున్నదాన.

వసుమాలిని. ఓ ఆర్యా! ఇట్లనవరతము స్నేహదన్యంబున నాపరానిచింతా సంతానంబునం బొక్కుచుండునీకు నప్రతివిధేయం బైనవేఱొకసంకటమును సంప్రాప్తం బయి యున్నది. అది యెద్ది యంటి వేని! వినుము. ఈదినముననఁ గరూశదేశాధీశుకుమారుని మదనసేన తనలోననేకవిద్యల వివాదంబు సలిపి జయంబుఁ గాంచిన వానిందుదవు విషమసమస్యల నోడించెను. అది రాజెరింగి తనపుత్రికయందు గుపితుండై సమీపమున నుండిన గౌతమునిం గాంచి యిట్లనియె.

ఓ విప్రోత్తమా! ఈ మదనసేన భవదుపదిష్టం బగువిద్యావిశేషంబున గర్వించి యఖిలరాజపుత్రులనవమానితులం జేసినయది. ఎతన్మూలకముగ రాజచక్రంబునకు నాప యువిరోధంబునయ్యె. ఇఁక దీనికిం దగినవరుని సంపాదించుట నీ భరంబు. అందుకుం గావలసినధనసంచయంబులు మదీయాజ్ఞానుసారి వయి కోశాధికారులవలనం గైకొని యితరదేశం బులకరిగి యురవైనవానిం దోడ్కొని రమ్ము. వాఁడు బ్రాహ్మణుం డయియుండె క్షత్రియుం డయియుండె నుండ నగును. అని ముదల చేసె. అది విని గౌతముఁడు కడుసంతసంబున నేని వీడ్కొని పోయినవాఁడు. గౌతముఁడు రాజపుత్రి కెగ్గునేయందలంచి యున్నాఁ డని నీవు భయంపడుచుండినదానికిం దగినట్టులు విధియుం బ్రివర్తించుచున్నయది.

గుణమాలిని. వెలవెలఁబోవుమొగంబుతో,,

హా దైవమా! యివ్విధంబున నా! యొనరించితివి. ఓ వసుమాలినీ! నాకు హృదయావేగం బుత్కటంబై శిరోవేదనాదిబాధలం గలిగించుచున్నది. అప్రతివిధేయం బగు కార్యంబున నేల యిట్టిచింత యని యనుకొనినను మానసంబు నివర్తింపక యుత్తలం పడుచుండెడిని. బాల్యంబునందొట్టి సహవాసంబు రచియించుచు వచ్చిన కారణంబున నెచ్చెలి కభద్రం బే మగునో యని చింతంగూరుచున్నది.

ధనమాలిని. ప్రియసఖి గుణమాలిని! ఎందుకే యి ట్లుమ్మలించెదవు! గౌతముఁడు తోడైవచ్చువాఁ డతనికంటెఁ గడు సమర్థుండై యుండఁడటే!

గుణమాలిని. ఓసి ప్రియసఖి! దూరాలోచన లేనిదానవై పలికెదవు! రాజపుత్రియుం గాఁ జమకంబుఁ గొనియున్నవాఁడు దానికిం దనకంటె వలంతిం దెచ్చి కూర్చునటే! ఇంతమాత్ర మెఱుంగవా! అతఁడు కడు మాయావి భర్తృదారిక తన్ను నిరాకరించిన దనుమానము మనంబున నుంచుకొని యుండువాఁడు. యీరాజపుత్రి కేవిధి నైన గర్వభంగంబు సేయవలయు నని యాయా రాచనగరుదాసికలతోఁ జెప్పుకొనుచున్నాఁడు.

ధనమాలిని. ప్రియసఖి! గౌతముఁ డెవ్వనిఁ దోడ్తెచ్చినను మనభర్తృదారిక పరీక్షింపక పరిణయముఁ జేసికొనదు గదా! పరీక్షసమయంబున నెట్టివాఁడైనదియు బయల్పడకపోదు.

గుణమాలిని. ఓసి! ఆపాఱుండు తాఁ జేయునిక్కృతిఁ బయల్పడనీఁడు. మూర్ఖు నింబండితుం డని యనిపించు. ఎట్టివారికేని మతిభ్రమంబు గల్పించు. నిక్కృతికల్పనంబున మయశంబరమారీచాదులతోఁ దులఁదూగువాఁడు గాని సామాన్యుండు గాఁడు.

ధనమాలిని. ప్రియసఖి! యేలనే యిట్లు లేనిపోనిచింతలు గల్పించుకొని దుఃఖించెదవు? నాఁడు నొసట వ్రాసినవాఁడు నేడు తుడుపఁబోఁడు.

శ్లో. † హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి,
లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుం నశక్యతే.

అని నీతికుశలులు వక్కాణించి యుండలేదా? యీచింతమానుము. జరుగవలసినది జరుగకపోదు. త్రోవం బోవుచుం బ్రియసఖి వగుట నిన్నుం జూడ వచ్చితిని. యింటికిం జనవలయు.

గుణమాలిని. ప్రియసఖి ధనమాలిని! మంచిది! అట్లయొనర్పుము.

వసుమాలినిం గాంచి,,

ఓసి వసుమాలినీ! ఇప్పు డేమియు మాటలాడుటకు మనం బొల్లదు. నేను గొంతతడవు విజనస్థలంబున నుండినం గాని యీమనోవ్యాకులత యుపశమింపదు. నీవు గృహకార్యంబులు సూచుకొనుము. నే నీయింటిచంద్రశాలయందు వివిక్తం బయిన చోటఁ గొంతతడవుండి హృదయవిశ్రాంతిం బడసెద.

---

† హరియొండె హరుఁడొండె బ్రహ్మయొండె సురలొండె నొసటివ్రాఁత దుడుపంజాలరు.

అని యందఱు నిష్క్రమింతురు.

## ప్రవేశకము.*

---

గౌతముఁడు. ప్రవేశించి,,

ఆ! మదనసేనకు మగని సంపాదింపు మని రాజు నడిగినపు డెంతసంతోషంబునం గైకొంటినో! అంతసంతాపంబు పడుచున్నాఁడను. ఎంతకష్టము సంభవించినను దాని కోర్చుకొని మఱియుం గొన్నిదేశంబులు సంచరించితినైన మదనసేనకు గర్వంబడంగ నేనుద్దేశించినవాని దెచ్చి పెండ్లిసేయుటయు నని పద్దు పట్టితి నే! కట్టా! నాయభీష్టంబు నెఱవేఱుట యెట్లో! అభినవమన్మథసమాన బహురూపంబు గలిగి కరము మాహాత్మ్యుండై యుండెడువాఁడు గదా మదీయాభిప్రాయంబు తుదముట్టించువాఁ డగును. అట్టివాఁడు దొరకుట కడు దుర్లభం బై యున్నది. పెక్కుదేశంబులు దిరిగి యురవైనవాఁడు నేకూరమి మరలి మధుమంతపురమును బ్రాపకాంతారంబుం జేరి యున్నాఁడ. ఇకఁ జెయ్యుడ వెదకుదు. ఉద్దిష్టకార్యంబనుకూలతాపరిహారంబున నాయాసప్రద మయినకారణంబుచే మనంబునం గలయుల్లాసంబు దక్కె. ఏపనులయందు నితికర్తవ్యతాజ్ఞానంబు స్ఫురింపకయున్నది. నేఁ దలంచియుండువాఁడు బ్రహ్మక్షత్రవంశములలోనివాఁడు గాక నీచకులజాతుండైనను తోడ్కొని పోయి యుత్తమవంశజుం డనిబొంకినైనఁ గార్యము ముగింపవలయు. నాతోఁ జనుదెంచియుండు సారథి జయసేనుఁడు బహుదినములుగా నొప్పుకొనకయుండి దేశాటనశ్రమంబున కోర్వక తుదకెట్టివానినేని రాజున కల్లుండని తోడ్కొనిపోయినం జాలు నని తలంచి నాతో నోయార్య గౌతముఁడా! రాజపుత్రికి వరుని సంపాదించుటయందు నీ కేఁకఁ బ్రతికూలాభిప్రాయము గలవాఁడఁ గాను. నీవు నన్నెట్లు పొమ్మన్నను నా కిష్టమే! ఎట్టివానినైనం దోడ్కొని వైళంబ యూరికిం బోయి చేరుట నాకుం బ్రియంబు. ఏపనిజరిపినను నేనికిసమాధానంబు చెప్పవలసినవాఁడవు నీవయియున్నాఁడవు. అని నుడివి శిథిలప్రయత్నుండై యుండెడిని. ఇఁక నా నేయుపని కష్టంకియు నుండదు. అయిన నేమి నేతు. రూపవంతుండును లేఁబ్రాయముగలవాఁడును దొరకినచో వానిని సువేషాలంకృతునిం గావించి పండితుం డని చెప్పి నిక్కృతి మెయి నాబుద్ధిచాతుర్యంబున రాజును

---

* ప్రవేశక మనఁగా :—పూర్వాంకంబునందు శేషించియుండునవియు నుత్తరాంకంబునందు సూచితముసేయఁదగనవియు నయి యొప్పుచుండుకథాంశంబులం దెలుపునది. విష్కంభప్రవేశకములచే సూచ్యార్థంబు సూచిత మొనరించి యంకంబులందు దృశ్యమగు వస్తువును సందర్శితము సేయుదురు. ప్రవేశకము నీచపాత్రప్రయోజితమయి యుండు.

రాజపుత్త్రిని భ్రమింపంజేసి వానికి మదనసేన గంతమునూపున ట్లొనర్తు. జరగవలసిన కార్యంబుగతి యిట్టిదే! ఇట్లైనం గాని దానిగర్వం బడంగదు. ఇప్పు డిక్కాంతారం బున ననేకతరుషండమండితంబగుదానియందుం బ్రవేశించి దూరదేశప్రయాణాయాసంబు వాయం గొంతసే పుండి సురభికుసుమరాజివిరాజితం బగువనరాజిం గాంచుచు; రథరథ్యంబుల నేటినీటం గడిగి పచ్చపచ్చిక కడుపార మేపి జయసేనుండు రథంబు నను రథ్యంబులం బూన్చి తోలుకొనివచ్చునంతదనుక గాలంబుం గడపెదను.

దూరమునను దృష్టులు నిగుడించి,,

అదిగో యింతకుం జెంతల మనుష్యులు మెలంగువిధంబు జూపట్టెడు. వారి నారయుదును.

పరిక్రమించుచున్నాఁడు,,

ఇరువురు కిరాతకుమారులు ప్రవేశించిరి.

ఒకఁడు. లంబభుజుఁడా! మనయొడయండు పోతరాజునకుం బోతేరికిని జాతరసేయం గడంగినవాఁడు. ఆ దేవరరాత్రికిం బండిరి పెట్ట గట్టిగూచంబులనఱికి తెండని సెలవయిడిమె. కానఁ దలుచుగ నుర వైనచెట్టు లుండునిరవులకుం జని చెట్టులు నఱికి తెత్తము. గొడ్డలి మున్నగుకొలముట్టులు గొనిరమ్ము. పోదము.

లంబభుజుఁడు., ఓరీ కుటిలభుజుఁడా! పోవచ్చును గాని నేనడిగినకత యొకింత సెప్పుము. మాయయ్య యిప్పు డున్నట్టుండి యీజాతర పెట్టుకొన్నాఁడ దేలా!

కుటిలభుజుఁడు. ఓరీ నీవెఱుంగవా! కడచినరేయి పెందలకడ నొకగద్దె సెప్పు నెఱుకలసాని మనచనుపకు వచ్చినయది. ఆపెం గూరుచుండంబెట్టి కొల్లాపురమ్మకుఁ బందేరంబిడి యాపెను మాపిల్లవానికి రాఁబోవుబాగెంబు సెప్పుమని యడుగఁగా నా యెఱుకత తనయిలువేలుపునకు మ్రొక్కులిడి నీతలిదండ్రులతో నిట్లనియె. ఓ యెఱుక లొడయఁడా ఓ యొడయనివడఁతీ! మీకొమరుం డీనాఁడేలు సేని కల్లుండు గాఁ బోయెడి. వానిబాగెంబు సెప్పం దరంబు గాదు. అనియెను.

లంబభుజుఁడు. సంతసముతో,,

ఓరీ అల్లుఁడ నగుదు నన్నుఁ గూఁతురిమగఁడనగుదు ననియేకదా! తెలివిడి.

కుటిలభుజుఁడు ఓరి కూఁతురిమగఁడవు గాక మఱి మేనల్లుండ వగుదువా!

లంబభుజుఁడు. కౌతుకంబుతో చంక లెగరవేయుచు,,

ఓరీ రాజుకూఁతురు బాగుండు నందురు. మనకొదమగాఁడ దెవలె నుండదటరా!

కుటిలభుజుఁడు. ఓరీ మనయాఁడంగు లప్పుడప్పుడు పాలపూస లమ్మకొన రాచ నగరునకుం జని వరవుడంపుంబడంతులు పిలచుకొని పోఁగా రాచగతిత లుండుచోటు

లకుం జనుట గలదు. మనగాజాపూజలకుం బెం దళతళలాడు పెక్కువన్నెలబట్టుపురాలు వాదిగినసొమ్ములు వారు పెట్టుకొందురట. వారికన్నులు జింకపిల్లలకన్నులవలెఁ గడు సొంపై యుండునట. ఆకన్నులతోఁ బెదరి బెదరి చూతురట. వారినడుము కంది రీగకుంబోలెఁ గడు సన్ననై యుండునట. వారియొడలిచాయ పచ్చిబంగరుమాడితోఁ దులదూఁగుచుండు నట. పిండితోఁ జేసిపెట్టిన బొమ్మలే యనవచ్చు నట.

లంబభుజుఁడు. ఆ! అంత యందకత్తెలా యా పడంతులు. వారేనా నాకుం బెండ్లాలు గాఁబోయెడివారు.

కుటిలభుజుఁడు. ఓరీ యందఱు గారు. అం దొక్కతెయే నీకుఁ బెండ్లామగునది.

లంబభుజుఁడు. ఇసీ! ఒక్కతె నాకెందుకు! మనవారలో నెవ్వఁడైన నిరువురకు ముప్పదికుందక్కువగఁ బెండ్లిచేసికొనినవాఁడు గలఁడే? ఒక్కతెను జేసికొనుట గౌరవంబునకుం గొఱంత కాదా!

కుటిలభుజుఁడు. ఓరీ! ఒకతెను మగఁడ వైన నంతకుం బైనజూచుకొనవచ్చును. దానికి పైమాటలు గదా నీవు చెప్పునది. ఇప్పుడు కూచములు నఱుకుటకుం బోదము రా!

లంబభుజుఁడు. అట్లె కానిమ్ము,,

అని గొడ్డలిమొదలగు కొలముట్టులు గైకొని.

ఓరీ యింకబోదము రమ్ము.

పరిక్రమించుచున్నారు.

గౌతముఁడు. ఇయ్యెడ నెలుకలు దిరుగుచున్నట్లు దోఁచెడి. వీరలుండుచను వరయు సమీపమున నుండఁ బోలును. కొంతదూరము నడచి వారిం జూతము.

పరిక్రమించి. లంబభుజునిం గాంచి. ఆశ్చర్యంబభినయించి,,

ఔర! ఇట్టియుత్తమలక్షణవంతుం డగుమహాపురుషుని నింతకనుకఁ గాంచినది లేదు. ఏమి వీనిగాంభీర్యము! వీనినగుమొగం బున్నతభ్రూవిలాసశోభితంబు నతివిశాలలోచనద్వయశోభావిభ్రాజితంబు నీషచ్చలితకుటిలనీలకుంతలావృతనిటలతటఫలకామనోహరంబును నయి సౌందర్యలక్ష్మీనివాసం బగుకమలంబు నాఁ బొలుపారుచున్నయది. కర్ణంబులు దోస్తంభడోలాయమానంబులై యొప్పెడిని. భుజాగ్రశంబులు జానుభాగపర్యంత ప్రలంబంబులై యతిమనోహరంబులై పొల్చెడి. ఉరంబు కడువెడందమై యానందంబుం గూర్చెడిని. ఈలక్షణంబులును దేజంబును గనుంగొన నితండు బలవత్కారణంబున నీయెలుకలలోఁ జేరినవాఁ డనియు రాజకుమారుండొండె బ్రాహ్మణకుమారుండొండె నిట్లు కిరాతులతోఁ గలసికొనియున్నాఁ డనియు విస్పష్టం బయ్యెడిని. ఇట్టియాకారంబుండియు నా కేమియు నుపయోగము లేదు. మూఢుఁడు నై యుండవలెఁ గా! వీఁడట్టివాఁడు నయ్యేనేని నాకోరిక పండినయదియ. ప్రాయి

కంబుగ నిట్టివారు మూఢులై యుందురు. ఇంచుక తడవి చూచిన వీనియోగ్యతయూ వెల్లడి యగును.

అని నిలువంబడుచున్నాఁడు,,

లంబభుజుఁడు. ఓరీ కుటిలభుజుఁడా ! నే నీచెట్టున కెక్కెద. నీ వాచెట్టున కెక్కుము.

కుటిలభుజుఁడు. ఓరీ ! అగుఁగాక. నీవు వైళంబ యెక్కి యురవైనకొమ్మల నఱుకుము.

లంబభుజుఁడు. ఓరీ ! యిదె నతికెదను జూడుము నాదెబ్బ !

అని చెట్టెక్కి యాచెట్టుకొమ్మ నూర్ధ్వంబునం గూరుచుండి దాని యధోభాగంబును నతికి దానితో నిలువఁబడి లేచి మరలమరల నష్టెగావించుచున్నాఁడు.

గౌతముఁడు. సంతసంబుతో,,

ఆ ! నే నెట్టివానిని సంపాదింపం దలంచి యుంటినో యట్టిమూఢుండె యతి సుందరవిగ్రహుండు నా కనుకూలం బయినవిధిచేతఁ గాన్పింపంబడియె. చెట్టుకొమ్మ కొనకెక్కి దానిమొదలు నఱుకువాఁ డెట్టిమూఢాత్ముం డనవచ్చు. ఇట్టివానిని సంపాదింప నే ననేకదేశంబులు దిరిగి తిరిగి తుదకు మధుమంతనగరసమీపమునన గనిపెట్టితిని. కాలంబనుకూలించిన నేకార్యంబేని తనకుఁ దాన యనుకూల మగును. వీనిసమీపమున కుం జని వృత్తాంతము విచారింతము.

దగ్గఱకుం జని,,

ఓరీ యెఱుకా యిటు రమ్ము.

లంబభుజుఁడు. మరలి చూచి. భయంబుతో,,

అయ్యాలూ ! ఏదో యొకదయ్యము నన్నుం దినం బిలుచుచున్నది. ఓరీ కుటిల భుజుఁడా ! మన మిద్యోడ నుండం జనను. నీవు నాతోఁ బరువిడుచురమ్ము.

అనిపరువిడుచున్నాఁడు,,

కుటిలభుజుఁడు. ఓరీ వీఁడు మానిసివోలె నున్నాఁడు ! దయ్యము గాఁడు. మన మెన్నఁడును జూచినవేషంబు గాదు గాన బూఁచి యని తోఁచుచున్నది.

గౌతముఁడు. నవ్వుచు. ఆత్మగతమున,,

నా నాగరికవేషంబుం గాంచి యిట్టివేషము ధరించినవారిని జూడనియారణ్యకులుగాన వీరు నన్నుఁ బిశాచం బని యనుకొని దగ్గఱకు రా భయంపడిరెదరు. నేను వీరితో సంభాషించినచో నీ సంశయంబు వీరికి నివర్తించు.

ప్రకాశముగ,,

ఓరీ! నేనుదయ్యమునుగాను మనుష్యుండను. భయపడకుండుము. దగ్గఱకురమ్ము.

లంబభుజుండు. ఓరోరి! దగ్గఱకుఁ బోకుము పోకుము. మోసపుచ్చి నిన్నుఁ దినం బోయెడిని. మానిసి రైన నిన్నాస్తు రాసివాఁడిన్నఁడేల యిచ్చోటికి వచ్చె ఓరీ మానిసివైన వీఁడిచ్చోట కేల యేతెంచెనో యడుగుము. మనల నేల పిలుచుచున్నాఁడో తెలిసికొనుము.

గౌతముఁడు. ఓరీ! మీలో నొక్కరునితో నక్కరయుండి వచ్చితిని.

లంబభుజుఁడు. ఆ! తెలిసికొంటివా! వీఁడు మనలో నొక్కరునిఁ బట్టితినం బోయెడిని. వీఁడు దయ్యమనుట నిక్కువంబ. ఓరీ అక్కడ నుంటివేని యీదయ్యమువాతం బడం బోయెదవుసుమా! వేగముగ రమ్ము. ఈమనువులలో మానిసులుం డుదురా ఈచెట్లనడుమ దయ్యంబు లున్నవి యని విందుము. తనకుం జిక్కక పోవుదమని తలంచి యనువుమెయి నీపాటుఁ బన్నినయది. తప్పక పట్టుకొని తినును. వేగిరంబ రమ్ము. నేఁ బోవుచున్నాఁడను.

అని కిలకిలారవంబులు సేయుచుం బరువిడెను.

గౌతముఁడు. ఆత్మగతమున,,

ఔర! వీఁడెంతమూఢుఁడు? వీఁడేమి సెప్పిన నొప్పుకొనఁడు. ఏమి సేయుదును. నేను దగ్గఱకుఁ బోవం బోవ వీఁడు బెగ్గడిలి పఱువిడుచుండం బోయెడిని. వీని నెట్లు పట్టుకొననగును?

చింత నభినయించి,,

జయసేనుండు నాకు రథంబుఁ దోలుకొనివచ్చినవాఁడు నను దెంచెనేని వీని నిర్బంధపఱిచి పట్టుకొనును. ఇతరప్రకారంబునం గాదు. అతం డింతకుం జెంతల నేటినీట గుజ్జంబులం గడగఁ దడసినవాఁడు. నేనును కాననలక్ష్మీవిలోకనోత్కంఠచే నింత దూరము చనుదెంచితిని ఇంక నతఁడు రాలేదు.

జయసేనుండు. రథంబుతోఁ బ్రవేశించి,,

ఆర్య! గౌతమ! ఇదె వచ్చినాఁడ. నాకేదేని ముదల గలదే!

గౌతముఁడు. కరముచే నపవారణముఁ గావించుకొని.

ఓజయసేన! నీరథచోదనసామర్థ్యంబు మెఱయించుచుం జని యీపొదసూపు కిరాతకుమారు నతి సుందరాకారుం బట్టిరథంబున బెట్టుకొని రమ్ము. ఇంతకు సమీపమునన యీతఁడు వసియించుచనుప యుండంబోలును. అందు వీఁడు సారఁ బోనీక రథంబునడ్డంబుగ నడపి యనువుమెయి వీనిం బట్టితెమ్ము.

జయసేనుఁడు. ఆర్య ! గౌతమ ! యట్ల కానిమ్ము.

రథమును లంబభుజునికడకుం దోలుచున్నాఁడు.

లంబభుజుఁడు. చూచి నెవ్వెఱపడుచు,,

ఆ! ఇ దేమి ! ఎన్నఁడును గాంచినది గాదే! కట్టా ! ఇది నాకడకే వచ్చుచున్నది. వేగముగఁ బరుగెత్తి ఓడారంబున జొరవలయును.

జయసేనుఁడు. అనేకవిధములు లఘురథచర్యలఁ జూపుచు లంబభుజునిం బోనీక యాలయించి పట్టుకొనెను.

కుటిలభుజుఁడు కనుఁగొని.

ఆ ! వీనిం బట్టుకొన్నాఁడిఁక నన్నుంబట్టుకొనును. వీనిచేతికింజిక్కక పరువిడెదను. ఎవి పిపాక్రింతుంజయ్యో.

లంబభుజుఁడు. ఏడుచుచు,,

ఓయయ్యా ! నన్ను వదలిపెట్టుము. నీపాదముల కిదె మ్రొక్కెద.

అని చేతులు మొగుడ్చుచున్నాఁడు.

జయసేనుఁడు. ఓరీ! నీపాదంబుల కేమెల్లరము మ్రొక్కవలసినకాలము వచ్చియుండఁగా నీవు మాపాదంబుల కేల మ్రొక్కెదవు ?

లంబభుజుఁడు. దీనత్వంబుతో,,

సామీ ! నన్నేమియు నిడుమలు వెట్టఁబోకుము. నేను మీబానిసను సామీ!

జయసేనుఁడు. ఓరీ ! యీతని నింతదనుక దయ్యం బని యంటివి గాదా !

లంబభుజుఁడు. దేవరా! అంటినయ్యా! ఎఱుక లేక చెప్పినయీయెఱుకను మన్నింపుము.

జయసేనుఁడు. ఓరీ! నా చెప్పినచొప్పునం బ్రవర్తించెదవేని నిన్ను దండింపను. లేనిచో దండింపకపోను.

లంబభుజుఁడు. ఓ యయ్యా నీమాటకు జవదాఁటను. నీ సెప్పినపను లెల్లం జేసెద. మాయమ్మకడకుం దోడుకొని పోయెదవా ?

జయసేనుఁడు. ఓరీ ! ఆమాట యనం బోకుము. ఇఁక నమ్మయు లేదు. అబ్బయు లేఁడు. వారలం బాసి నీవు నగరంబునకు రావలసియున్నది ! ఇఁక నింటిమాట యనఁబోయెదవు సుమా !

లంబభుజుఁడు. శోకముతో,,

అయ్యలూ ! మాయమ్మను జూడ నీవా !

ఏడుచుచున్నాఁడు,,

జయసేనుఁడు. కోపాక్రాంతుఁడై,,

ఓరీ నీవెలుఁగెత్తి యేడ్చెదవేని యీకశచేఁ గొట్టుదును. నోరు మూసికొనుము.

లంబభుజుఁడు. అయ్యలూ! ఏడవనయ్యా! కొట్టకుఁడయ్యా!

అని రెండుచేతుల నోరు మూసికొని వెక్కుచున్నాఁడు.

గౌతముఁడు. సాక్షీ! వీఁడు కడు భయంపడినవాఁడు. ఇఁక వెఱపింపకుము.

జయసేనుఁడు. ఆర్య! గౌతమ! గానుగకోకటల నుండక చెఱుకా! పాలిమ్మనిన నిచ్చునా! సామంబున వీఁడు సాధ్యుం డగునే! ఇప్పుడు చూడు మే జేసిఁ జెప్పునా!

లంబభుజునింగాంచి,,

ఓరీ! కిరాత యీతనికి మ్రొక్కుము.

లంబభుజుఁడు. కాళ్లు గౌతమునివలనికిఁ జూపి జయసేనునిం గాంచుచు నిలాతలంబునం బడియె.

జయసేనుఁడు. ఓరీ మూఢ! మ్రొక్కు వేయవలసినవిధ మిదియేనా ఏమి? నీవు ఒడలెఱుంగక యున్నాఁడవు.

లంబభుజుఁడు. భయసంభ్రమంబులతో,,

దేవరా! యేను మ్రొక్కు వేసి యెఱుంగ. నాకు మీరు మ్రొక్కి చూపుఁడు. అట్లు గావించెదను.

జయసేనుఁడు. అధికకోపముతో,,

ఓరి నీకావరం బెంత యనవచ్చురా!

లంబభుజుఁడు. దేవరా! కోపము సేయవద్దు. తెలియక యడిగితిని. ఎంతటి వారికైనఁ జెప్పనిది యెట్లు తెలియును.

గౌతముఁడు. ఓరీ! యెఱుక! నీవు నేఁజెప్పినచొప్పున నుంటివేని నీకుం గొప్ప మేలు సమకూరం బోయెడిని.

లంబభుజుఁడు. సామీ యట్లే వినియెదను. నాగాడిదకుఁ గాలు విఱిగియున్నది. అది కుదురునా.

జయసేనుఁడు. కన్ను లెఱ్ఱజేసికొని,,

ఓరీ యింకను గాడిదెను దలంచుచున్నావు. మూఢ! ఆ మాట నీనోట నింక వచ్చెనేని నిన్ను పెడ రెక్కలు విఱిచికట్టి కొట్టెదను సుమీ!

లంబభుజుఁడు. దైన్యంబుతో,,

అయ్యా! యది కోదమగా నున్ననాటంగోలె దాని నేన పెంచితిని. దాని నెట్లు విడుతును. దానికి నిన్న కాలు విఱిగినది. కట్టుకట్టి వచ్చినవాఁడను.

జయసేనుఁడు. ఓరీ మూర్ఖ! యింక నీ కావిచార మక్కఱలేదు.

లంబభుజుఁడు. అగుఁగాక! అయ్యా! నాగాడిదెల నీవు గాచెదవా! అట్లైన నేనే నాతలంపు మానుకొనియెద.

జయసేనుఁడు. ఓరీ బుద్ధిహీనుఁడా! నీ కింక గాడిదెలవిచార మక్కఱలే దను మాటకు నే వానిని గాయుదు ననియటరా యర్థము! వినుము. అది యర్థము గాదు. నీ కింక గాడిదెలఁ గాయవలసిన కష్టము లేదు. అది యిప్పటినుండి తొలఁగినది యనుచున్నాఁడను.

లంబభుజుఁడు. ఓయయ్యా! గాడిదెలఁ గాయక యూర కుండిన నాకింట మా యమ్మ కూడు పెట్టదే! కూటికిఁ ద్రోవ యేమి?

జయసేనుఁడు. ఓరీ మందుఁడా! నీవు నగరంబునకు రాఁబోయెదవు. నీకు నీ తల్లియుఁ దండ్రియు నిం కేలా! అయ్యెడ నీ కన్నమునకుం గొఱంతా! అన్నము పెట్టువారు లేరా!

లంబభుజుఁడు. అయ్యో! అక్కడ నా కొకయమ్మ యున్నదా! ఆయమ్మ గాడిదెలు గాయకయే కూడు పెట్టునా!

జయసేనుఁడు. కశెం జూపుచు,,

ఓరీ నిన్నిఁక బిట్టు గొట్టెదను. ఇఁకఁ గాడిదె యనుమాట యెత్తఁ బోయెదవు సుమా!

లంబభుజుఁడు. అయ్యలూ! లేదయ్యా లేదయ్యా!

అని నోరు మూసికొనుచున్నాఁడు.

గౌతముఁడు. ఓరీ కిరాత నీకట్టుకొనియుండుపుట్టము వీడ్చివేయుము.

లంబభుజుఁడు. అయ్యా బట్టలు సయితె మూడఁ బెఱుకుకొంటారా! నేను దిస మొలతో నింటికి కెట్లు పోదు. పోయిన మాచనుపలోనివారు నన్ను దూఱుదురుసుమా! నాబట్టలు మాత్రము వీడ్చుకొనకుఁడు.

జయసేనుఁడు. ఓరీ ! జాల్మ ! నీ దుర్భాగము లైనపుట్టములు మేము సంగ్రహించుకొనిపోవుటకుఁ గాదు నీబట్టలు విడువుమన్నది ! మఱి సువర్ణంబు లగుజిలుఁగు వలువలు నీకుం గట్టుటకు !

లంబభుజుఁడు. ఓయయ్యా! నాబట్టలకంటె నవి నాకేమిగలవో! బద్దలు పెద్దవిగా నుండునా ! వీనికంటె మఱింత ఒళెసరిగానుండునోటు !

జయసేనుఁడు. ఓరీ ! మూర్ఖ! ఈ ఉత్తమవస్త్రము లనఁగా నిట్టివియే యని యను కొంటివో. తొల్లింటిపుట్టములు విడువుము. మఱియు నీ యఱుత ప్రేలాడుపాలపూసల దండలును దీసి వేయుము.

లంబభుజుఁడు. సశోకముగ,,

ఈ దండలు మాయమ్మ గట్టిన వయ్యా ! ఇంటికిం బోతినేని నాతల్లి మెడదండ లెక్కడ వని యడిగిన నేమి చెప్పుదును ? ఆపని వల దయ్యా !

జయసేనుఁడు. ఓరీ ! అనర్ఘ్యమణిగణఖచితంబు లగునాభరణంబులు దాల్చుకొన వలసినయదృష్టంబు సమీపించియుండ నింక నీపాలపూసల కేడ్చెద వేమిరా ! ఓరీ నీకు బుద్ధిలేదా !

లంబభుజుఁడు. సామీ! కోపగించుకొనవలదు. మీ కివి గావలయునా ! కావలసియున్న మాయింట నున్నవి యెల్ల మీ కిప్పించెదను. నన్ను మాగుడిసెకుం బోనిండు.

గౌతముఁడు. సారథీ ! వీఁడు కడు మూర్ఖుఁడు. మనమాట వినఁడు. వీనిం బట్టి యీ చెట్టునకుం గట్టి యొడలితోలు వ్రీలం గొట్టుము. అట్లయిన వీఁడు తనవారల ప్రస్తాపంబు మానును. మనయిష్టానుసారంబుగఁ బ్రవర్తించు.

లంబభుజుఁడు. అయ్యలూ ! మీరు సెప్పినట్టు లుండెదనయ్యా ! నన్నుం గొట్టవద్దు.

జయసేనుఁడు. ఓరీ ! అట్లయిన రహస్యస్థలంబునకు బోదము రమ్ము. అయ్యోపకుంజని యీపుట్టంబులు విడిచి మంచివి గట్టుకొని యీపాలపూసలకు బదులుగా రత్నహారములు దాల్చుకొని రాఁ గలవు.

లంబభుజుఁడు. ఓయయ్యా ! మీ రేమిచేసిన నేమి ? మీవేతలకు మాఱునేత గలదా ! అని దీనాననుండై జయసేనునితో నిష్క్రమించి ; వస్త్రాభరణభూషితుండై ప్రవేశించి,,

జయసేనునితో,,

ఓయయ్యా! ఇవి నాప్రాఁతపుట్టంబులు ప్రాఁతసొమ్ములు. ఇవి పదిలపఱిచి వెండియు నాగూడెమునకుం బోవునప్పుడు నా కిమ్ము.

అని ప్రాఁతపుట్టంబులును పాలపూసలును సారథిచేత కీఁగడంగుచున్నాఁడు.

జయసేనుఁడు. ఓరీ మూఢ! అవి యటుండనిమ్ము.

లంబభుజుఁడు. వస్త్రాదులిలపయిం బెట్టి,,

అయ్యా! నా కిప్పుడు కైసేఁతచేసితిరిగదా! పోలేరి కిట్లు కైసేయుఁగాఁ గోడి పుంజులను గొఱియలను బలి యిచ్చుటగలదు. అట్లు నాకుం బలివెట్టెదరా!

జయసేనుఁడు. ఇఁక వీఁ డివ్విధంబునన ప్రల్లదంబు లాడుచుండు. వీని మాట లాడకుండం జేయనగును. ఓరీ యిఁక నీవు నోరు దెఱచితివేని నీపడఁబోవుపాట్లు జూడుము.

లంబభుజుఁడు. దేవరా! నోరుదెఱవకయున్నఁ గూడు గుడుచుట యెట్లు? కుడువనేని బ్రతుకంగలనా!

జయసేనుఁడు. ఓరీ కుటిలబుద్ధీ! మాటలు నిలుపు మంటిని గాని నోరుదెఱవ వలదన లేదు.

లంబభుజుఁడు. దేవరా! అట్లయిన సరే! నాయబ్బతోడు. ఇఁక మాటలాడను.

అని చేతులతో నోరు మూసికొనుచున్నాఁడు.

గౌతముఁడు. సారథీ! వీఁ డాకారంబున నతిమనోహరుండై యుండెడిని. కాన రాజపుత్రి వీనిం బరిణయంబు చేసికొనం గడంగు. రాజు వీనికిం బ్రణామము చేసినప్పుడుగాని రాజపుత్రి నమస్కరించినప్పుడుగాని వారల నాశీర్వదింపకున్న మన కపటంబు బయల్పడి కార్యంబు చెడును. ఇందు కొక్కయనువుఁ బన్నవలయును. ఇరువదేఁడునక్షత్రములపేళ్లు వీనికిం జెప్పి యివి వీనిచేత నానమయంబునం జెప్పించి తదనుసారముగ సమర్థించుకొనియెదను.

అని యశ్విన్యాదినక్షత్రనామములు చెప్పి యవి చెప్పు మనుచున్నాఁడు.

లంబభుజుఁడు. నోరు మూసికొని యూరకుండెను.

గౌతముఁడు. అసూయతో,,

కష్టము కష్టము! వీఁడు కడు మూర్ఖుఁడు. మాటలాడవల దన్నందు కిప్పు డూరకుండెడిని. ఓరీ మూఢ! నోరు తెఱవుము.

లంబభుజుఁడు. నోరు తెఱచుచున్నాఁడు.

గౌతముఁడు. వెడనవ్వునవ్వుచు.

ఓరీ నోరు తెఱవఁ గాదు ; నాయడిగినపలుకులు నుడువు మనుచున్నారు.

అశ్విన్యాదినామము లిఱువదియేఁడును జెప్పించెను.

ఓరీ ! యిది రాజు నీకు మ్రొక్కు చేయునపుడు చెప్పుము. రాజపుత్త్రిక వచ్చి నమస్కరించునపుడు "త్రిపీడాపరిహారోస్తు" అని యాశీర్వదింపుము.

జయసేనుని జూచి,,

సారథీ ! పురోపవనసీమను జేరి మఱియు వీనిని దిద్దవచ్చును. వీని రథారూఢునిం జేయుము.

జయసేనుఁడు. ఆర్య గౌతమ ! అగుఁగాక.

లంబభుజునింజూచి,,

ఓరీ ! యీరథంబుపై నెక్కుము.

లంబభుజుఁడు. కడువేగముగ రథముకొన కెక్కెను.

జయసేనుఁడు. నవ్వుచు,,

ఆ ! ఏమి వీనిమూర్ఖత !

కోపముఁదెచ్చుకొని,,

ఓరీ ! అక్కడనా ! కూరుచుండవలసినది.

లంబభుజుఁడు. భయంబభినయించుచు,,

దేవరా ! నీవు పైకెక్కుమన్న నెక్కితిని.

కోపగించుకొనుచున్నావదేమి ? ఎక్కడ నుండు మనియెదవో ! అక్కడనుండెదను.

జయసేనుఁడు. ఓరీ! యడుగున గూరుచుండుము.

లంబభుజుఁడు. దేవరా ! అట్లయ !

అని రథంబుదిగి దానియడుగునం గూరుచున్నాఁడు.

గౌతముఁడు. నవ్వుచు,,

సారథీ ! యీయనాగరికుని సముచితస్థలంబునం గూరుచుండం బెట్టుము.

జయసేనుఁడు. అట్లుగావించుచున్నాఁడు.

గౌతముఁడు. సారథీ ! యిట నేనును రథం బెక్కెదను.

అని రథారోహణం బభినయించి,,

సారథీ ! ఇఁక స్వచ్ఛందంబుగ మందగమనంబునం బోనిమ్ము. నగరంబునకుం జేరునంతలో రాజాజ్ఞవలన రాజపుత్రికడను గార్యంబు ముగియునంతదనుకఁ బ్రవర్తింప వలసిన విధంబు గఱపెదను. ఇదె దినకరబింబంబు చరమగిరి సానుతటీవిలంబమానంబై గగనలక్ష్మీకరగళితం బయినలీలారవిందంబుగతిం దోఁచుచున్నది.

చం. మునివిభుపర్ణశాలికసుమంబు జెలువొందెడు ముస్ఠుఁ డౌసుధా,
దినపతికిఁ గాంతివిచ్ఛురితఁ గట్టఁగఁ జేయఁ గడంగి సంధ్య యూ,
స్ఫురతరరాగరమ్య వెలుచఁ దోఁచెడు తారకలక్ష్మితోఁ బతిం,
బర వరగుకాంతకీర్తిని నిభాతిత యారెవ్య నతిస్ఫుటంబుగన్.

జయసేనుఁడు. రథవేగమునిరూపించుచు ,,

ఆర్య! గౌతమ! మహాజవంబు లగునశ్వవరంబులం బూన్చిన దగుటం జేసి వైశంబ పురసమీపంబునకు రథంబు వచ్చి చేరినయది.

గౌతముఁడు. సారథీ ! అట్లయినఁ బురోపవనసీమకు రథంబుం బోనిమ్ము. అయ్యెడ కరదంబు నేనుఁను నీవు దిగి మున్న తోనికడకుం బోయి మదాగమనంబుం దెల్పి యుపరిమేయవైరాక్షిభూషితుం డగునరుండు వొరకినవాఁ డాతని నెయ్యఁకొనన రాఁజనునని యాభూపతికి నాచెప్పిపంపినరీతిం దెల్పవలయు.

జయసేనుఁడు. ఆర్య ! గౌతమ ! అగుఁగాక ,,

అని రథగమనంబు నిరూపింపుడు నందఱు నిష్క్రాంతు లయిరి.

ఇది కాళిదాసచరిత్రప్రకరణంబునందు

ద్వితీయాంకము సంపూర్ణము.

శ్రీరాధాకృష్ణ పరబ్రహ్మణేనమః.

శ్రీరస్తు.



శ్రీరస్తు.

## కాళిదాసచరిత్రప్రకరణము.

### తృతీయాంకము.

అంతఃపురమునందు దేవీసహితుండై రాజు ప్రవేశించుచున్నాఁడు.

రాజు. దేవీ! మనమదనసేనకు విద్యాధికుం డైనవరుని సంపాదింప గౌతముఁడు దేశాంతరంబులకుం జని యున్నాఁడు. బహుకాలం బయ్యె నింతదనుక రాక యుండెడిని. అట్టివిద్యాధికుండు లభించిన మరలి రాక యుండునే! ఇంతదనుకఁ దొరకి యుండఁ డని తోఁచెడిని. ఈ చతురుదధివేలావలయితం బగుభూమండలంబునం గల బ్రహ్మక్షత్రంబులందు నీ మదనసేనకంటె నధికుఁడు లేకయున్నాఁడా! ఏమి యీ యాశ్చర్యము!

దేవి. ప్రాణనాథ! మదనసేనకుం దగువరుని సంపాదింపకలయు నన్నవ్యసనంబె మీమానసంబున నెలకొని యున్నది. దీనిచే ననుకలము వ్యాకులపడుచు నన్నము నిద్రయు ననాదరించి యుండెదరు. విధి వ్రాసి కనుకూలుఁ డగునేని తగువరుండు లభించు. కాఁడేని మన కట్టివానిని సంపాదింపం దరంబు గాదు. పురుషుండు దా నుద్దేశించినపనిఁ జేయంగడంగుటయు తాఁ జేయఁ దగినపని. సఫలంబు సేయుటకు దైవంబ స్వతంత్రంబు. మన మిట్లు చింతించియు నుపయోగంబు లేదు. గాన భగవంతునిపై భారంబు మోపి తదీయధ్యానంబు సేయుచుండంజనును.

రాజు. ప్రాణవల్లభా! ఏమి సెప్పెదవు! సంపూర్ణయౌవన లగురాకేందుముఖులు రసభావాభిజ్ఞ లగువారు మగలఁ బొందు వడయనినాఁడు వారియిడుమలు దుర్విభావ్యంబులయి కాఁతియ పెట్టుచుండు. ఎట్లనిన!

చం. మనమున నుప్పతిల్లఁ గలమానినికోర్కులు లీయమానతం,
గనఁ దమబోటిజవ్వనులు కాంతులకౌఁగిటుల న్సుఖించుటల్,
మనఃకొని చూచి దుఃఖమున మున్గుచు డెందము రాయి చేసికొం,
చనుగతమారవేదనల నన్యహాముం దపియింతు రాత్మలన్.

ప్రతీహారి. ప్రవేశించి,,

మహారాజ! గౌతమప్రేషితుం డగు సారథిపుత్రుండు జయసేనుండు ద్వారంబు కడ విలంబంబడి లోనం బ్రవేశింప సెలికయానతిం బ్రతీక్షించుచున్నవాఁడు. ముదల యయినం దోడ్కొనివచ్చెద.

రాజు. సత్వరంబుగ,,

ప్రతీహారీ! తడవేల! వైళంబ ప్రవేశపెట్టుము.

ప్రతీహారి. మహారాజ! ప్రసాదంబ.

అని నిష్క్రమించె.

రాజు. దేవీ! జయసేనుండు రాఁగలండు. యవనికాంతరితవై యుండుము.

దేవి. నిష్క్రమించుచున్నది.

ప్రతీహారితో జయసేనుండు ప్రవేశించె.

ప్రతీహారి. సూతపుత్ర! అదె భూపతి పశ్చిమసంధ్యోపాసనంబుసలిపి భవత్సమావేశమునకుం బ్రతీక్షించుచున్నవాఁడు. దగ్గఱకుం బొమ్ము. అని నిష్క్రమించె.

జయసేనుఁడు. రాజు సమీపమునకుంజని,,

మహారాజ! విద్వజ్జామాతృలాభంబునంజేసి వర్ధిల్లుదువుగాత.

రాజు! సంతసంబుతో,,

భద్రముఖ! నీ విట్టివచనంబు పల్కుటంజేసి నాకభివృద్ధి నిక్కంబ. భవద్వచనసుధాధార నామనంబునం గలసంతాపం బార్చె. అనుకూలుం డగుజామాత లభించెఁగా!

జయసేనుఁడు. మహారాజ! మన మిన్నిదినంబులదనుకఁ బడినయిడుమలు నేటికి సుఖరూపంబు లయ్యె. నీ వొనరించిన పుణ్యంబులపంట పండినయది. ఇప్పుడు నీకు లభించియుండెడుజామాత మానవశరీరంబుం దాల్చినసరస్వతియే యనవచ్చు. ఆమహాపండితునెదుట మనగౌతముఁడు సయితము మాటలాడ నోపఁడు. పెరవార లెంతటివారు? బహుదేశములు దిరిగి మేము మానుషలోకబృహస్పతిని సంపాదించితిమి. అతనిం దోడ్తెచ్చి యస్మన్నగరబహిరుద్యానసీమను విడియించి వృత్తాంతంబుం దెల్ప గౌతముఁడు నన్నంపినవాఁడు. ఇప్పుడ యతని నెదుర్కొని పట్టణంబునకుం దోడ్కొని రావలయు.

నేపథ్యంబునం గలకలంబు.

రాజు. ఆలకించి,,

సూతపుత్ర! మననగరువాకిటం బోలె నున్నది. ఇంతకలకలం బేల?

జయసేనుఁడు. మహారాజ! నేను గౌతమప్రేషితుండనై యతివేగంబున రాజరథ్యయందుం జనుదెంచుచుండ మంత్రిపుంగవుండు భవదీయంబు లగురాచకార్యంబులు సూచి రాత్రియగుట నింటికరుగుచుండువాఁడు నా కెదురువడి నన్నడిగి వృత్తాంతంబుం దెలిసికొని నన్ను విడిచిపుచ్చి యింటికిం బోక మరలి యేలిక పండితవర్యు నెదుర్కొనం

బోవుటకుం దగురీతి నియోగిజనంబులచేత సకలసేనాసముదయంబులను రథాశ్వగజపాదాతంబును గణికాజనసంతానంబులను రప్పించి నీకు వృత్తాం తెఱుకపడునంతలోఁ బౌరులను రప్పింపం బ్రయత్నించుచున్నవాఁడు. ఇప్పటి కంతయును జేరి యుండం జను. ఆకలకలరవంబ వీతెంచుచున్నయది.

రాజు. కరముసమోదంబుతో,,

అట్లయిన మనము త్వరితగతి నరిగి గౌతమానీతుం డగుపండితుని బహూకరింతము.

అనిలేచి,,

ఎవ్వతె యక్కడ ?

చేటిక ప్రవేశించి,,

మహారాజ! యిదె దాసిన వాజ్ఞాపింపుఁడు.

రాజు. ఓసీ మేము జామాతం దోడ్కొని వచ్చునంతలో నగ రంతయు మంగళాలంకారాలంకృతము గావింపవలయు. సర్వాంతఃపురసుందరీనికరంబులు సమస్తాభరణంబులలంకరించుకొని పరిణయకార్యంబులు సేయుచుండదగు. మదనసేనయు సర్వాభరణభూషితురాలై కన్యకాంతఃపురంబునం బ్రతీక్షించుచుండం జనును. మీ రెల్లను దేవ్యాజ్ఞానుసారిణులరై పరిణయకార్యంబులు దీర్పుఁడు. ఈవృత్తాంతంబు దేవితోఁ జెప్పి యెవ్వరి కెవ్వరి సేయుపనుల నియుక్తులం జేయునో వారు వారు తత్తత్కార్యంబులు సేయుఁడు.

చేటి. మహారాజాజ్ఞానుసారిణులమై ప్రవర్తించెదము.

అని నిష్క్రాంత యయ్యె.

రాజు. సూతపుత్ర! మనగౌతముఁడు మెచ్చి తెచ్చినవాఁ డెంతో మహాత్ముండైయుండకపోఁడు. అట్టివానికడకుం బాదచారులమై యేగుట లగ్గుగదా!

జయసేనుఁడు. మహారాజ! భవదభిమతం బెట్లో యట్లే ప్రవర్తింపుము.

రాజు. అట్లయినం బోదము రమ్ము.

అని పరిక్రమించుచున్నాఁడు.

మంత్రి. ప్రవేశించి,,

మహారాజ! అభిమతజామాతృసంప్రాప్తిచేత నతులామోదంబుం గాంచుము. ఏను జయసేనునివలన గౌతమసమానీతుం డయినజామాత యుపవనంబుననున్నాఁ డని విని యతండయ్యెడం దడయుట యుక్తంబు గా దని యెంచి నీతోఁ గదలిపోవుటకుఁ దడవగు నని సకలపౌరవృద్ధులను సేనాసముదయంబులను జేర్చుకొని జామాత విడిసి

యుండుచోటికిం జని యాతని మత్తదంతిసమారూఢునిం జేసికొని తోడ్తెచ్చినవాఁడను. జామాతయు నేనుఁగుం దిగి యిదె గౌతమసహితుండై వచ్చుచున్నవాఁడు. తత్సమావేశమహోత్సవసుఖం బనుభవింప సభాభవనంబునకువిచ్చేయుము.

రాజు. సంతసంబుతో,,

ఓమంత్రీ! నీవంటిమంత్రికుశలుండును గౌతమునివంటిపురోహితుండును భాగ్యవిశేషంబునఁ గాని లభింపరు.

మంత్రి. మహారాజ! అతిరూపగుణోపేతుం డగుజామాత దొరకుటంజేసి నీభాగ్యంబు సకలజనశ్లాఘనీయం బయ్యె. వైళంబ జామాతయు రాఁగలండు. సభాభవనంబునకువిచ్చేయవలయు.

రాజు. మంత్రీ! అట్లయగుంగాక.

అని మంత్రితోఁబరిక్రమించుచున్నాఁడు.

లంబభుజుండును గౌతముఁడును బ్రవేశించిరి.

గౌతముఁడు. లంబభుజునిం గాంచి,,

మహాభాగ! ఇటురమ్ము.

లంబభుజుఁడు. పరిక్రమించుచున్నాఁడు.

రాజు. లంబభుజునిం గాంచి. మహాశ్చర్యంబుతో. ఆత్మగతమున,,

ఉ. చందురుఁబోలుమోము నవసారసపత్రసమానభావముం,
జెందిననేత్రయుగ్మమును శ్రీరమణీయ మురస్స్థలంబు నిం,
దిందిరవారనీలరుచి దేరెడుముంగురులుం బ్రలంబ మా,
నందపుబాహుయుగ్మము మహాపురుషుం డితఁ డంచుఁ దెల్పెడిన్.

గౌతముఁడు. మహారాజ! నీకూఁతురు దగినమగని సంపాదించినాఁడ. ఇమ్మహానీయునిపాండిత్య మనన్యాదృశము. మాబోంట్లితనియెదుట నోరు దెఱచిన నుపయోగంబులేదు. సకలవిద్యావిచక్షణుఁడు. ఇతనివిద్యాపరిశ్రమము నాకెగాక యితరులకుం దెలియదు. విప్రకులకలశపయోరాశిపూర్ణచంద్రుండు. నాయొనర్చిననిర్బంధంబులన నీవిశుద్ధయశస్కుండు భవత్కన్యకాపాణిగ్రహణంబున కొడంబడి భవద్వంశంబు ననుగ్రహింప విచ్చేసియున్నవాఁడు.

రాజు. బ్రాహ్మణోత్తమా ! యీమహాత్ముని [illegible] సుజనశ్లాఘ్యశేముషీవిశేషభూషితునిగఁ జెప్పుచున్న [illegible] యట్లుండె నింక నితనిసౌభాగ్యాతిశేషం బడుగవలయునా ! ఈసాధుపవిత్రుని పాదపంకజములరజంబు సోకి నాయిల్లు పవిత్రంబయ్యె. ఏను కృతార్థుండ నైతి.

అని లంబభుజునికి నమస్కరించెను.

గౌతముఁడు. లంబభుజునిం గాంచి,,

ఓమహాత్మా ! యీభూకాంతుండె మీకు శ్వశురుండు గాఁ బొందితిని. ప్రఖ్యాతుండయినయితని నాశీర్వదింపుము.

లంబభుజుఁడు. ఆత్మగతముగ,,

కట్టా ! యీపాఱుండు నాకుం దొలుతఁ గఱపినది మఱచితిని. అది యిప్పుడు రాజు నమస్కరింపఁ గాఁ జెప్పవలసినదిసూవే !

అనితలంచుకొనుచునూరకుండెను.

గౌతముఁడు. ఆత్మగతమున,,

కట్టా! యీమూఢుఁడు తొలుతనేఁ గఱపి ; రాజు ప్రణతుండైనం జెప్పుమన్న దానిని మఱచిపోయినాఁడు. అది యితనికి స్మృతి కందంజేయవలయు.

ప్రకాశముగ,,

ఓమహాత్మా ! అశ్వపతికులంబునం జనించినవాఁ డీరాజు ?

లంబభుజుఁడు. స్మరణంబునకుందెచ్చుకొని,,

ఔనా ! సరే !

తలపంకించి,,

అశ్వని. పునర్వసు. రేవతి. కృత్తిక ;

అని చెప్పి యూరకుండెను.

రాజు. భ్రమింపడుచు. గౌతమునిముఖంబుఁ గాంచి,,

ఓబ్రాహ్మణోత్తమా ! యీమహానీయుఁడు నాల్గునక్షత్రములనామములు మాత్రము నుడువుటకును, అవియుఁ గ్రమంబు దప్పి యుండుటకును భావంబు స్ఫురింపకయున్నది. ఇది విశదీకరింపం గోరెదను.

గౌతముఁడు. ఆత్మగతమున,,

కట్టా ! వీని కే నశ్విన్యాదిక్రమంబుగ నిరువదేడునక్షత్రములనామములు రాజు నెదుటం బ్రథమదర్శనంబు గలుగునప్పుడు చెప్పు మంటిని. తత్క్రమానుగుణముగఁ

పద్యములు రచించి రాజునకు మనస్సమాధానంబుఁ గల్పింప నగు నని యుంటిని! ఈ వైశ్వేయుఁడు నానుడివినక్రమంబు మఱచి యిట్లు సెప్పినవాఁడు. అయినను ఎగ్గేమి యుం లేదు. నాబుద్ధిబలంబున సమర్థించెదను. ఇది యీమూర్ఖునియందుం గరము గౌరవము గలుగుటకుఁ గారణము గాఁగలదు.

ప్రకాశముగ,,

మహారాజా! యీపండితాగ్రేసరునిభావంబు మాఁబోటివారలమానసంబులకు సంయితము నిలుకడమీఁద గాని యెఱుంగ నవువడదు. అట్లుండ నితరు లెంతటివారు. ఈపద్యమ్మణివచనంబులభావంబు సాధారణులెఱుంగక దూషింత్రు. ఇతఁడు కరము మితభాషి. ఇప్పుడు అశ్వని. పునర్వసు. రేవతి. కృత్తిక. అని యీకవిపుంగవుండు సెప్పినందుకు భావంబు; సకలవిద్యాపరిశ్రమంబు గలవాఁడ నగుటం జేసి నా కింత సేపటి కెఱుకపడెను.

అతనిభావంబుఁ జెప్పెదను వినుము.

శ్లో. * అశ్వనీ భవతు తే తు మందురా మందిరే భవతు తే పునర్వసు,
రేవతీపతికనిష్ఠసేవయా కృత్తికాతనయవిక్రమో భవాన్.

అని యీకవి నిన్నాశీర్వదించినవాఁడు

రాజా. మహాశ్చర్యంబుతో,,

ఇట్టియతిగభీరహృదయుల భావం బెఱుంగ మే మేపాటివారము. ఈమహాత్ముండు పురుషమూర్తిఁ దాల్చినసరస్వతియే యన నొప్పును. ఇట్టిమహామతినిఁ బతింగాఁ బడయుఁ గలనాకూఁతురగు మదనసేనభాగ్యం బేమందు. అలంతులగు నెలంతల కీమహానీయునిం జెట్టపట్టం గలుగునే! ఇన్నినాళ్లు మన మనురూపజామాతృసంపాదనార్థంబు పడినకష్టంబు లెల్లనీవిద్వద్రత్నలాభంబుచే సుఖరూపంబు లయ్యె.

గౌతముఁడు. ఓమహీపతీ! ఇంకం బరిణయమునకు జాగు సేయం దగదు. మనమదనసేనయు నితనిం బరీక్షింపవలసియున్నది. ఈసభాభవనంబున నందఱును గూరుచుండి విదుషీరత్నంబుచేఁ బరీక్షితునిఁ జేసి యనంతరకార్యంబునకుం గడంగుదము.

---

* తే మందురాతు = నీగుఱ్ఱపుఁబాగా, అశ్వినీ = ఉత్తమాశ్వములచే నొప్పునది, భవతు=అగుఁగాక. అనఁగా నీసేనాంగంబులు కడు పెంపుఁ జెందుచుండఁ దగునటుల. తే మందిరేతు = నీగృహమునందు, పునః=మఱియు మఱియు, వసు=ధనము, భవతు = కలుగుఁగాక. రేవతీపతికనిష్ఠ = రేవతీదేవికిభర్త యగుబలరామునియొక్క తమ్ముఁ డగుకృష్ణుని, సేవయా = పరిచర్యచేత, భవాన్=నీవు, కృత్తికాతనయవిక్రమః= కార్తికేయుఁ డగుస్కందుని పరాక్రమమువంటిపరాక్రమము గలవాఁడ వగుదువుగాక.

రాజు. ఓబ్రాహ్మణోత్తమా ! నీమాట కద్దు గదా.

లంబభుజునితో,,

ఓమహాత్మా ! ఈరత్నపీఠం బలంకరింపుము.

లంబభుజుఁడు. ఉన్నతాసనంబునంగూరుచుండెను.

రాజు. ప్రతీహారీ ! నీవు కన్యకాంతఃపురంబునకుం జని మదనసేనను ; స్వయంవరసముచితాలంకారముతో నుండుమని నీయువతికాభ్యంతరంబునకుఁ దోడ్కొని రమ్ము.

ప్రతీహారి. మహారాజ యట్లయా.

అని నిష్క్రాంత యయ్యె.

రాజు. ఓగౌతమా ! బ్రాహ్మణోత్తమా ! ఈయభినవసరస్వతీవిగ్రహంబుతో నొకింత సంలాపము సేయుటకేని మాబోంట్లకు యోగ్యత లేదు. ఇట్టిమహనీయుని సంపాదించిననీకు నే నేమి ప్రత్యుపకారంబు సేయంగలవాఁడను. నాయందుఁ గరుణించి నాసేయునర్చనం బంగీకరించి నన్నుం గృతార్థునిం జేయుము.

అని మంత్రియందిచ్చుమణిగణపరిపూర్ణంబు లగుబంగరుపళ్లెరంబు లందుకొని గౌతమునిపాదములందు రత్నంబులుగుమ్మరించుచున్నాఁడు.

లంబభుజుఁడు. నలువంకలుచూచుచు. ఆత్మగతమున,,

ఈకాలువనఁ గోడలపైన నీవన్నెలగీఁత లేమిటివో !

స్మరణమభినయించి,,

చిత్తరువు లని చెప్పినను సూవె ! చిత్తరువునందు రామాయణపుఁగతలు వ్రాయంబడియుండును అని వింటి. అవెక్కడనున్నవో !

నిరూపించిచూచి. చింతించుచు,,

మనచనుపలోఁ గైతగాండ్రు కతలు సెప్పునప్పుడు ఏవ్వనికో పదితల లున్నవని రామాయణకతలంటు వినియున్నాఁడను. వానిపేరు సెప్పరాకున్నది.

సంతసంబుతో,,

ఆ ! తెలిసెనుదెలిసెను ! అయినను బాపనయ్య నడిగెద.

ప్రకాశముగ,,

ఓబాపనయ్యా ! వీఁడేనా రాభణుఁడు !

తక్కినవారందఱును సంశయాకులత్వంబుం గానిపించిరి.

రాజు. ఆత్మగతమున,,

ఈమహాత్ముని సర్వవిద్యాధికునిగ గౌతముండు నుడివె. ఇతండు దురూహంబుగ వచియించినవాఁడు. ఇప్పుడు రావణుఁ డనవలసినశబ్దమును రాభణుఁడని పల్కుచుండెడిని. ఇందు మానసంబు సందేహాకులంబై యున్నయది. గౌతముని నడిగి తెలిసికొనం జనును.

ప్రకాశముగ,,

ఓగౌతమా ! లౌకికప్రయోగసిద్ధంబు రావణశబ్దంబు గాని రాభణశబ్దంబు గాదు. ఈమతిమంతుండు రాభణుఁ డని యుచ్చరించుట కుపపత్తి యేదియో యెఱుంగను. ఇది తెలియం బల్కుము.

గౌతముడు. ఆత్మగతమున,,

కట్టా ! యీవైశ్యుని నోటి దెఱవకుండు మని చెప్పియున్నందు కది మఱచి సభాభవనవిలోకనసంతోషాక్షిప్తహృదయుండై తాను వాడుకొనువిధమున రాభణుఁ డని వక్కాణించె. దీనిని చతురముగ సమర్థింపకపోతి నేని కడు సంకటము వాటిల్లు.

ప్రకాశముగ,,

ఓమహీపతీ ! యితం డనేకవ్యాకరణంబులు చదివి యున్నవాఁడు. వబలకు భేదంబు లేనట్లు వభలకును భేదంబు లేదు. మఱియు నామక్రమంబునకు భంగము లేక యుండవలెనని యీపండితోత్తమునిభావము.

శ్లో. * కుంభకర్ణే భకారోస్తి భకారోస్తి విభీషణే.
అగ్రజశ్చ స్వయం రాజా రాభణో న చ రావణః.

ఇది యీతనిభావము.

మంత్రిప్రముఖులు. ఈయర్థంబు సమంజసంబు నతివిచిత్రంబునైయున్నది. ఇది వినమహామోదంబు గల్గినయది.

రాజు. ఆశ్చర్యపడుచు,,

---

* పులస్త్యమునికుమారులు మువ్వురు. అందు రెండవవాఁడగుకుంభకర్ణుని పేర భకారమున్నది. మూఁడవవాఁ డగువిభీషణుని పేరను భకారమున్నది. అట్లుండ, అట్టి భకారము ; రాక్షసకులశ్రేష్ఠుఁడును ప్రభువునగు పులస్త్యముని మొదటికుమారుని పేర లేకపోవుట క్రమభంగ మగును గాన రాభణుఁడని చెప్పుట తగును. రావణుడని చెప్పుట సరిగాదు. వబలకభేద ముండును గాన వభలకు నభేదమే. వకారముండుటచేఁ దోఁచునర్థము భకారముండినను దోఁచును. అనిభావము.

ఏమి యీమహాత్మునిజ్ఞానము! ఇది యెఱుంగ మాకంటెవారి కింపుకయేమి యుందరాకున్నది. అలోకసాధారణం బీతనిపాండిత్యము. ఇతఁడు చెప్పినయర్థంబు లోకవిరుద్ధంబయ్యు నెల్లరు మెచ్చుకొనం దగియున్నది.

క్షేమముతో,,

ఆ! మదనసేన యింతదనుక రాలేదు. నైశ్రంబ పరిణయమహోత్సవంబు వీక్షింపక కన్నులపండువుగాఁ జూడవలయు నని నామానసంబు త్వరాకులంబై యున్నది.

నేపథ్యంబున మంజీరధ్వని వినంబడుటయుఁ బ్రతీహారి ప్రవేశించి,,

మహారాజ! మదనసేన యవనికాభ్యంతరంబున శేతెంచియున్నది. మన్ముఖంబునం బండితోత్తమునికి నమస్కారం బెఱింగింపు మన్నది.

గౌతముఁడు. చేయిచాటునకు లంబభుజునిం బిలిచి,,

ఓరి! రాజపుత్రి నమస్కరించుచున్నది. త్రిపీడాకరిహారోస్తు, అని యాశీర్వదింపుము.

లంబభుజుఁడు. త్వరపడుచు,,

త్రిపీడాస్తు,, అనిచెప్పెను.

ఎల్లవారు నెవ్వెఱపడిరి.

గౌతముఁడు. ఆత్మగతమున,,

కట్టా! యీమూఢాత్ముండు త్రిపీడాకరిహారోస్తు అని చెప్పుమన్నం ద్రిపీడాస్తు అని యనెను. దీనికేమి సేయంగలను. ఇప్పు డిది సమర్థింపక పోయినం గార్యంబు చెడు. నాయభీష్టంబు నెఱవేఱదు.

ప్రకాశముగ,,

ఓ రాజపుత్రి! మదనసేనా! ఈవిద్యాస్వయంవరపతి నుడివిన త్రిపీడాస్తు అను దానికి భావం బెఱుంగవు గాఁబోలు! కావనే సంశయాకులవై యూరకుండెదవు. ఈ మహితచారిత్రునివచనములయందలిగభీరభావంబు వింతయుం గొంతప్రవేశంబుఁ గాంచియుండునాకుంగాక యితరుల కెఱుంగ శక్యంబు గాదు. త్రిపీడాస్తు అనుదానిభావంబు వివరించెదను వినుము.

శ్లో. * ఆసనే బాలపీడాచ శయనే పతిపీడతః,
భోజనే బంధుపీడాచ త్రిపీడాస్తు సదా తవ.

అని యీవిద్యానిధి నన్నాశీర్వదించినవాఁడు.

ఇతనివచనంబులభావంబు విచారించునంతఁదనుక మనంబునకు సమాధానంబు చూపట్టదు. నీ వేమని యితని బరీక్షింపఁ దలంచితి వేని వైళంబ యడుగుము.

పుష్పమాలాహస్తయై గుణమాలిని ప్రవేశించి,,

ఆర్య ! గౌతమ ! భర్తృదారిక యీమహాత్మునియందుం గలవైదుష్యవిశేషంబునకుం గర మామోదించి మత్కరంబున నిట్లు విన్నవించుచున్నది. శిష్యనగు నాయందుఁ గలవాత్సల్యవిశేషంబున మీరలు కడు పరిశ్రమంబుం బడి యిట్టిసరస్వతీస్వరూపుని సంపాదించి తెచ్చి యిచ్చినందుకుఁ బ్రత్యుపకృతి యేమి సేయంగలను ? ఇదె నీకంజలి యొనరించెదను. బృహస్పతితో సమానుండగునీమహాకవి నుడివినవచనంబులకె మాబోఁటివారి కర్థంబుఁ దెలిసికొనఁ జాలక యుండఁగా నితనిం బరీక్షించుట యన్నమాట లేటికి! ఇదె సర్వజనాభినందనీయముగ నీవిద్యానిధిని వరియించెదను. ఈపుష్పమాలిక మత్ప్రియసఖీకరంబువలన నితనియంసంబున నిడియెద.

---

* ఓకాంతాతిలకమా ! నీకుఁ గుమారులు గలిగి నీవు సుఖాసనంబునఁ గూరుచుండునప్పుడు ఆశిశువులు నీపయిం బడి యాడుకొనుచు నిన్ను నలయింతురుగాక. అనఁగా నిట్టియలయిక ప్రార్థనీయము గానఁ దత్కారణ మగుపుత్రసంపద కలుగుఁగాక యనిభావము. మఱియు నీ వింటిపనులు దీర్చుకొని శయనంబుకడకుం జేరునప్పుడు నీభర్త కడుఁ దమకమున ననేకవిధరతిబంధములకు నిన్నుం దార్చి యలయించి నఖదంతక్షతాదుల నతిసుకుమార మగునీదేహమునకు శ్రమ గలిగించి "సురతమృదితా బాలవనితా తనిమ్నా శోభంతే" యన్నట్లు చూడఁ జూడ నానందము జనించు తెఱంగు దోఁపింపఁ జేయు నది పీడనమయ్యు సుఖప్రదంబు గాన నాయతిశయము నీ కగుంగాత. అనఁగా నీభర్తకును నీకును నిరవద్యయౌవనం బుండి యాసుఖం బనుభవించుచుండ నగు నని భావము. బందుగులతోడ భోజనము సేయుట యుత్తమము గాన నట్టిసమయంబున వారల సమకూర్చికొని పోవుటవలన నగుశ్రమము నీకుఁ గలుగుఁగాక అనఁగా "ఎప్పుడు సంపద గలిగిన నప్పుడు బంధుగులు వత్తురు" అన్నట్లు బంధుసమావేశమునకు సంపద కారణ మగుటం బట్టి నిరతిశయసంపద నీ కుండం దగు నని భావము. ఈమూఁడు బాధలు నీ కెల్లప్పుడు నుండ నగు ననియాశీర్వదించుచున్నాఁడు.

ఉ. ఈమహితాత్మునైషధి యఁ దేరికి నైన నెఱుంగ శక్యమే,
భూమిని వాణి యీపురుషభూషణమై జనియించెఁ జూడ నీ.
శ్రీమహితాత్మ పాదసరసీరుహయుగ్మమునఁ గొల్వ నాకు నా,
శ్రీమహిళాప్రియుండు కృపచేసినవాఁ డధికప్రియంబుగన్

అని లంబభుజునియంసంబునం బుష్పమాలిక యిడెను. నేపథ్యంబునం దూర్యవాద్యధ్వానములును మంగళాశీర్వాదవిరావంబులు వినంబడియె.

రాజు. సంతసంబుతో,,

ఎన్నిదినంబులుగానో యిమ్మహోత్సవంబుఁ గనుంగొనం గోరియుంటిని. ఈదినము నాకోరికి సఫలం బయ్యె.

గౌతముఁడు. ఆత్మగతమున,,

నాపంతంబు నీడేరె. నన్ను పరిహసింపు మన్నమాటఁ ద్రోచిపుచ్చి నయీరాచకన్నియ గాడిదెలమేపువానితో నేమిసుఖంబుఁ గాంచం బోయెడినో చూతము.

ప్రకాశముగ,,

ఓమహారాజ. ఇఁక నగ్నిసాక్షికముగఁ బాణిగ్రహణంబు జరిపింపంజనును. తదర్థంబు వైళంబ ప్రవర్తింపం దగు. పరిణయమండపమునకు నీవభూపతులం దోడ్కొని పోవలయు. ఎల్లవారు నామహోత్సవంబుం గనుంగొన నర్యోదకు రండు.

లంబభుజునితో,,

ఓమహాత్మ ! పరిణయవేదికకడ కేగుదము. లెమ్ము.

ఎల్లవార లాసనంబులు విడిచి లేచిరి.

లంబభుజుఁడు. ఆత్మగతమున,,

ఈశాపనయ్య నాతో రాజుకూఁతురు గాడిదెకొదమవలె నందము గానుండు నన్నాఁడు. అవ్విధంబునం గానంబడదు. నామూపుపై నొకలంజ వేసిపోయినయిది య రాజుకూఁతు రేమొ ? ఇట్లైన నిది నాకెందుకు ?

అందఱునిష్క్రాంతులైరి.

ఇది కాళిదాసచరిత్రప్రకరణంబునందుఁ

దృతీయాంకము సంపూర్ణము.

శ్రీరాధాకృష్ణ పరబ్రహ్మణేనమః.

శ్రీరస్తు.



శ్రీ ర స్తు.

# కాళిదాసచరిత్రప్రకరణము.

## చతుర్థాంకము.

వీణావాహిని యై గుణమాలిని ప్రవేశించి. చింతయభినయించుచు,,

అక్కటా! మనభర్తృదారికను గౌతముఁడు వంచించె నని తోఁచుచున్నది. సర్వవిద్యావిచక్షణు లగు దేశాధీశకుమారుల రప్పించి విద్యాగర్వంబువలన వారి నవమానితులఁ జేసినందుకుఫలము చేసేత సమకూరినయది గాఁబోలు? ఈలంబభుజుఁడు గడు ననాగరికుండు. వీఁడు వచించునవి యెల్ల గ్రామ్యోక్తులు. గౌతముఁడు తనకుఁ గల విద్యానైపుణ్యంబున వాఁడు వచించిన యనాగరికోక్తులనతిచతురముగ సమర్థించిచెప్పి మదనసేనకును రాజునకును మతిభ్రమంబుఁ గల్పించి రాజపుత్రి తన్ను వరింపక యొప్పరికించె ననుసూడు తీర్చుకొన్నాఁ డనితోఁచెడిని! పండితవర్యుండు గాన నపండితులతో మాటలాడఁడని కపటంబు సల్పి యుండంబోలు. వీఁడు పండితుం డగు నేని పాండిత్యప్రకటనసమయంబునం దన కీడుగానివారలతోఁ బలుకక యుండు నంతియకాని తనకుం గావలసినపనులకుం బరిచారకజనంబును బనుపనైన నోరు దెఱవకయుండునా. ఈమందుండు పురుషాకృతి గలరాతిబొమ్మవిధంబున నూరకయ యుండెడిని. అదియునుంగాక.

ఉ. వీరభటాళిఁ గన్గొనిన వేమఱు లోఁ బెగడొంది కాంచుశృం,
గారవతీవతంసములఁ గన్పడఁ గా వెఱగంది చూచు భూ,
దారునిఁ బ్రోల భీతిలుచుఁ దా నిలుచు న్వెఱబొమ్మమాడ్కి నీ,
ధీరహితుండు గన్పడెడి దీనతతో వనచారికైవడిన్.

నగరవాసం బెఱుంగనిపండితుండై యుండంబోలు నని యనుకొనవచ్చునన్ననో? యట్టిపండితుం డయ్యె నేని గావ్యనాటకాలంకారంబు లెఱింగి శ్రుతవస్తుసందర్శనంబున నామోదంబుం జెందువాఁడై యుండవలదా? ఏమియుం గానఁబడదే! సర్వవిధముల నారసిచూడ గౌతముఁడు మదనసేన తనకు వశగత గానిసూడు మనంబున నుంచుకొని రాజపుత్రికిఁ గరము మూఢాత్ముని దెచ్చి మగనిం గావించినవాఁడని నిర్ణయింపం జను. నిర్ణయించితినిపో! యిప్పు డేమి నేయంగలదానను. కార్యం బతిక్రమించినయది.

ఎచటికి దృష్టులు నిగుడించి,,

ఏలకో! భర్తృదారిక కడ నుండంబనిచినధనమాలిని సత్వరముగఁ జనుదెంచుచున్నయది.

సత్వరయై ధనమాలిని ప్రవేశించి,,

ప్రియసఖి! గుణమాలిని! నీవు మనభర్తృదారికకేళీగృహంబున సంగీతోపకరణంబులునిచి భర్తృదారికాప్రాణనాథు సర్వోదయం దోడ్తెచ్చి వృత్తాంతంబు నివేదింప ననుజ్ఞాతవైనదానవు; వైళంబ జరుపవలసినయుత్కార్యంబునందు దురంతచింతాసమాక్రాంతస్వాంతవయినదానవువోలె నత్యాలస్యంబునం బ్రవర్తించుచున్నదాన వదేలా?

గుణమాలిని. ప్రియసఖి! యిందే జింతించి చేయంగల దేమున్నది? ఎవ్వరికింగాని పుట్టినప్పుడు బ్రహ్మ నొసట వ్రాసినవ్రాఁతం దప్పింపం దరంబగునే. అది యట్లుండనిమ్ము. నీ విప్పు డింతత్వరతో వచ్చుటకుం గతంబేమి?

ధనమాలిని. ప్రియసఖి! అట్లడుగుచున్నా వదేమే? మనభర్తృదారిక యనుభవించు నుత్కంఠార్తి యెఱుంగనిదానవువోలె నుడివెదవు! ఇప్పు డాయొప్పులకుప్పకుంగల వంకాక వీఁకమెయిం బెరిగి యింతింతనరాని యిడుముల కాకమునయనం బాల్పడుచున్నది. వినుము.

చం. నిరుపమతోద్యతప్రణయనిర్భరదుర్భరదీనభావయై,
యరుణగఁ జండభానుని సరోజినియు న్మృగలాంఛను న్సమా,
దరమున నాకుముద్వతియుఁ దద్దయుఁ గోరుచునుండుచాడ్పునన్,
దరుణియు నాథుకేళికిఁ గృతత్వర వేచుచుఁ దత్తరిల్లెడిన్.

అట్లు ధృతోత్కంఠయై యాకలకంఠి పడుచుండుపాట్లు వినుము.

చం. సొలయుఁ బరుండు లేచు మతి స్రుక్కును నెక్కొనుదైన్యసంగతిన్,
బొలయును ద్రెళ్లు లేచు వగఁపుంగొను నెవ్వెఱవోవు నొంటిమైఁ,
బలుకును గోపగించుకొను బాష్పము రాలుచు నూరకుండు న,
గ్గల మగుతాపభారమునఁ గ్రాఁగు బయల్గను మూర్ఛఁ గైకొనున్.

ఈయర్థంబు నీకెఱింగించి యుద్దిష్టకార్యంబు వైళంబ సాధించుటకు నిన్నంప నేగుదెంచితి.

గుణమాలిని. ప్రియసఖి! ధనమాలిని! నూతినీళ్లు వెల్లువఁ బోవు నని తమాలపడుచందంబున నున్నది. మనభర్తృదారిక యిట్లు సంభ్రమించుట యేలనే! ఆకలిఁ గొన్నవాఁడు రెండుచేతులం గుడువఁ గడంగునటే! రాజును రాణియుఁ బరిణయకార్యంబు తుదముట్టంగా నీదంపతులం జేర్పం ద్వరపడుచు మంచిముహూర్తంబు విచా

రించుచుఁ గార్తాంతికులవలన నీరాత్రి సముచితం బని యెఱింగి యల్లునిం గూఁతుం గేళీమందిరసమావిష్టులం జేయం గడంగి తదుచితకార్యంబుల నెఱవేర్ప మనకు ముదల యిడియున్నవారు. మనమును శుభవేళ సంప్రాప్తం బగునంతలోఁ బనుల నన్నిటిని బూర్వమున నిర్వర్తింపం దగు వానిని నిర్వర్తించుచుండెదము. ఇదె దినమణి యస్తంగతుం డగుడు భర్తృదారిక క్రీడాసౌధంబునం దననాయకునితోఁ గలయం బోయెడిని. ఇంతలో నిట్టిదుర్విషహవిరహవేదనా యాసవశీకృత యగుట కర మాశ్చర్యకరంబై తోఁచుచున్నది. ఎందు నతిప్రవర్తనము కష్టసంపాదకం బగును సుమా! ఈమదనసేన యిం గలిగియుండుమదనజ్వరార్తిం దలఁచి చూడ నీరాజపుత్రికకు మనోరథలాభం బున నడ్డంకి లేక యుండనగునే యని మానసంబు చింతాకులత్వంబు నందెడిని. ఇందు కేమి సేయంజాలుదును ?

ధనమాలిని. ప్రియసఖి ! నీస్వభావం బెల్లప్పుడు నెల్లయర్థంబులందు నస్థానశంకం దగిలి వగలం బొగులుచుండుట మే మెఱింగినదే! లేనిపోనిసందేహంబులు గల్పించుకొని యుత్తలంపడియెదవు. మదనసేన దనకుం దగినప్రాణవాయకుఁ డుపలబ్ధుం డగుడు సుచిరకాలంబునుండి యందుల కువ్విళులూరుచుండినయీయండజయాన యిప్పుడు త్వరితయగుటయరుదా ! అదియటుండఁగాక యీమదనసేనమగనిరూపరేఖావిలాసంబులు మానినులన్న వారలమానంబులఁ గొల్లబుచ్చకపోవునే !

ఉ. ఆనళినారిబింబరమ కాశ్రయ మౌనగుమోముగోము నా,
జానువిళంబిపీనఘనచారుసువృత్తము లైనబాహువుల్,
సానుమదింద్రశృంగసమసారమహోన్నత మంసయుగ్మముల్,
మానశరాసుఁగీడ్పఱుచుసుందరరూపము నాసఁ గొల్పదే.

వినుము. మఱియును.

ఉ. ఆనవమోహనుం గనిన దాదిగ నీపుటభేదనంబులో,
మానవతీమణుల్ మదనమార్గణవృష్టికిఁ జిక్కి స్రుక్కి స,
న్మానితరీతిఁ బైకొన మనంబున నువ్విళులూరుచుంద్రు సు,
మ్మానవమన్మథుం గలయ నాసజనింపనిచాన లే దిటన్.

అట్టియతిరమణీయరూపకళావిశేషంబుల నొప్పుమగనిం బడసి తత్సమాగమసుఖంబునకు మదనసేన త్వరపడుట యొకచింతనీయం బైనయర్థంబె ! సర్వకళాసారసర్వస్వవేదిని గదా యీమదవతీమణి !

గుణమాలిని. ప్రియసఖీ ! నీనుడివినవెల్ల సత్యంబులే!

గీ. కనకకుసుమంబునకురూపగరిమ యున్న । భ్రమరపాళికిమధువానఁ బాలుపడునె,
యసదృశామోదభరితమౌ కుసుమమునఁ । యుక్తిసుఖమబ్బు రతి గల్గు నాస మించు.

ధనమాలిని. ప్రియసఖి! నీనుడివినవచనంబులవలన నసమానరూపవైభవోపేతుం డయ్యు భర్తృదారికాకాంతుండు లజ్జావతుల జాతికళాచాతుర్యంబు లెఱింగి వారల నేలుకొనంజాలనియనాగరికుండై యున్నవాఁ డనుసత్యంబు దోఁచెడిని. అట్లుండినను.

గీ. సర్వవిధవిద్యలం దతిచతుర గాన । మదనసేనయ తననాథు మదనసదృశు,
రతికళానూనచాతురీగతులయందు। వానిఁ దాఁ దిద్ది యేల్గొన వలఁతి సుమ్ము.

గుణమాలిని. ప్రియసఖీ! నీ చెప్పినచొప్పు నొప్పిదం బైనదియ. అయినను మదీయమానసంబు శంకాతంకాకులత్వంబుం బాయక యున్నది.

ధనమాలిని. ప్రియసఖి! “ అతిస్నేహః పాపశంకి ” అని యుండ లేదా! మదనసేనయం దీ వతిప్రియం బునిచినదానవు గాన నీమానసం బాయతిపయిం దట్లు చింతం గూరుచున్నయది.

కం. ఎవ్వరి కెవ్వరు ప్రియులో । యవ్వారలు వారలందు ననిశ మశుభముల్,
నివ్వటిలునో యటంచుఁ । నెవ్వగలం బొగులుచుంద్రు నిరతప్రీతిన్.

ఇది లౌకికవ్యవహారసిద్ధంబు. ఇదియునుం గాక.

ఉ. ఇష్టజనంబు గష్టపడ నెయ్యది దోఁపక చింతఁ గూరుటల్,
నష్టవివేకులౌ ప్రజలనవ్వుచుండుదు రార్యు ; లద్ది సం,
తుష్టికరంబు గాదు ; తమకోయమువారు మహార్తిఁ గుందఁ గా,
నిష్టముఁ గూర్పఁగా గడఁగి యింపుఁ జనింపఁగఁజేయు టొప్పగున్.

కాన మనము మదనసేన కిష్టసఖీజనం బగుటం జేసి యిది వేగిరపడుకార్యంబున ననురూపప్రవర్తనంబునకుం గడంగుట మనకుం గర్తవ్యంబు. ఉద్యుక్తకార్యంబునకుం ద్వరపడుము.

గుణమాలిని. నిట్టూరుపువిడిచి,,

ప్రియసఖీ! నీ వెంతబోధించినను నామనంబు సమాధానపడకున్నయది. ఏమి సేయ నగును? నిరతిశయామోదంబున నానందశిఖరి సమారూఢనువోలె నాచేయవలసిన యీపనులయందు మదీయప్రయత్నంబునం గాని కరచరణాదులు ప్రవర్తింపక యున్నవి. చిత్తంబును గరుణాయత్తం బై యుత్తలంపడియెడిని. ఇందుకుం గారణంబు స్ఫురిం

పక యున్నది. ఓసి! ఎట్లున్నం దీయనే! దేవీనియోగం బనుష్ఠింపం జనునుగాదె! కాన నేను భర్తృదారికకేళీమందిరంబునకుం జని యావీణియ నయ్యెడ నునిచి మదనసేనమగని నందుం బ్రవేశపెట్టి భర్తృదారిక నాతనితోఁ జేర్చెదను. వైళంబ పనులం గావించెదను. భర్తృదారిక యొంటి నుండఁ బోలదు. దానికడకుఁ బొమ్ము ఇదె కేళీగృహంబునకుం జని మరలి వచ్చెదను.

అనినిష్క్రాంతలైరి.

## ప్రవేశకము.

---

అంతం గామయమానావస్థ యై మదనసేన ప్రవేశించె.

మదనసేన. కటకటా! ఏమి సేయంగలదానను!

ఉ. నిద్దుర రాదు కంటికిని నిన్నటినుండి కరంబు దీర్ఘమై?
ప్రొద్దును బోదు నెచ్చెలులపొందు మనంబునకుం బ్రియంబు గా,
దెద్దియుఁ దోఁచ దాత్మ కిపు డిక్షుశరాసనసాయకౌఘముల్,
తద్దయు నేఁచసాఁగె నింకఁ దాళఁగఁ జాల వియోగవేదనల్.

ఏలకో దురంతం బగుకంతుసంతాపంబు త్రుటికొక్కవిశేషంబుతోఁ బయిం బయి నెచ్చుచు వచ్చుచున్నయది. ఎవ్వారలకేని యింత వేగిరంబ యిట్టిదురవస్థావిశేషంబు సంప్రాప్తం బగునే! ఇప్పు డిట్టియవస్థంబు గల్గుటకుం గారణం బేమొకో! ఏమిది! మఱియొక కారణంబుఁ జింతింపవలెనా! ఎట్టి ధీర లయిన సారసవదనామణులును మదీయప్రియతమునిరూపరేఖావిలాసంబులకుం జంద్రకాంతమణిస్థలులు చంద్రకిరణంబులకుం బోలె కరంగి లతాంతాయుధనితాంతసంతాపంబులం బరవశలు గాక యుందురే! ఔరా! ఆసుకుమారాకారునిచక్కఁదనం బే మని పొగడం గలదానను.

చం. మదనుఁడు శాంబరీమహిమ మానవదేహముఁ దాల్చిపోల్చెనో,
విదితగతి న్వసంతుఁ డురువిభ్రమవైభవ మాసఁ జూప స,
మ్మదమున భూజనంబు ననుమానము మానఁగఁ గాన వచ్చెనో,
కద! యిటుగానిచోఁ బడయఁ గల్గునె యిట్టిసురూపసంపదల్.

మఱియుం బరిణయమంటపంబున నారూపసారనిర్మాణుని యభినవవికచశతపత్రలక్ష్మీమనోహరం బైయొప్పునగుమొగంబుం గాంచిన దాదిగ మించుచుండు మత్కాంతార్తిం దన్మయత్వంబుం జెంది డెందం బన్యంబుం దలంపక యున్నది. ఆ సౌభాగ్య మే మని వర్ణింపనగును?

చం. అభినవముగ్ధపంకజము నాస నెలంగఁగఁ గ్రమ్మఁ దేంట్లు నా,
సుభగతఁ గాంచుచుంగుములు సుందరమై కరిఁ గొంచుఁ గొంబస,
స్నిభ మయి యొప్పునెమ్మొగము సిందిపడంగనయి గ్రమ్ముచుండునా,
యభినవకామమూర్తిసొబగుం గనుఁగల్గుటకు న్పుణ్యం బగుఁగా.

తలంచిచూడ నంకురితదరహాసభాసురంబై యరుణాధరదళశోభాప్రభాసితంబగుచు నతినీలకుంచితకుంతలకలికోమలత్వంబుతో రామణీయకంబునకు నెలవై నా నొప్పునతని ముఖాంబుజంబు నాయెదుటఁ బొడసూపుచున్నది.

వైలక్ష్యంబుతో. వియోగవేదనాసహ్యత నభినయించుచు,,

ఇంతదనుక సహంబు గానఁ దహతహ యించుక యడఁగియుండె. ఓర్వఁ జాలియుంటిని. ఇప్పుడు గాళరాత్రివోలె రాత్రియు సంప్రాప్తం బయ్యెడిని. ఇంకం బడంబోవునిడుమలు కడుదుస్సహంబులై కాఁతియుంబెట్టక పోవు.

కన్నులనుండివెడలుబాష్పంబులతో,,

ఉ. కట్టా! మారుఁడు క్రూరుఁడై పెలుచ నన్గారింపఁగా సాఁగె. నిం,
కెట్టో! తోడ్పడరే పెలం గతని ; కింకెవ్వట్టు లెట్లోర్తుఁ! జా,
పట్టి నమ్మట్టడి వేసి తూయఁ దొడఁగె న్బల్మారు నీకోవెలల్,
జట్టుం బయ్యెర గ్రమ్మి ప్రాణముల నాశుప్రక్రియన్ దీసెడిన్.

అని మూర్ఛపోవుచున్నది.

ధనమాలిని. ప్రవేశించి. మదనసేనం గాంచి. ఉరంబునం గరం బిడుకొని,,

కట్టా! యీభర్తృదారిక యెట్టిదారుణదశావిపాకం బనుభవించెడిని!

త్వరితగమనంబున మదనసేన యుండుచోటికిం జని,,

ప్రియసఖి! భర్తృదారికా! ఊరడిల్లు మూరడిల్లుము!

నిరూపించి చూచి,,

కట్టా! ప్రియసఖికి మూర్ఛ కరము గాఢంబై వాటిల్లెడిని. ఏమి సేయుదుము! ఇంతతడ వయ్యుఁ దెలివిఁ దెచ్చుకొన నలవడకయున్నది. చంద్రాతప, మలయమారుత, కోకిలాలాపప్రముఖంబు లెల్ల రాత్రియగుకతంబునం గంతునికిఁ దోడ్పడి దురంతం బగుసంతాపంబుం గల్పించుచున్నవి. గుణమాలిని సమెదించి ప్రాణనాథుని కడకుం దోడ్కొని పోవునంతలో నీకాంతాతిలకం బగణితము లగుపగలం బొగలునని తోఁచెడిని. ఈకష్టంబుం గనుంగొనుచు నెట్లోర్తు! అహా! మారుండు కడుఁ

గ్రూరుండు. సుకుమారం బగుకులకుమారీజనంబునం దప్రియంబు గావించుటయ వాని పని. త్రిపురాంతకునంతటివానిపౌరుషం బద్ధంబు గావించిన త్రిభువనమోహనంబు లగు వానినిశాస్త్రంబులకు నీశిరీషకుసుమకోమలి యెట్లోర్చు? విధి యేమి సేయ నున్నాఁడో! ఒక్కయెడుగున నిట్టిదురవస్థ సంభవించుట కరముచింత్యంబై యున్నయది. ఏమి సేయం గలను. సఖీజనకల్పనీయం బగువిరహతాపోపశమనంబు సంపాదించు శీతోప చారంబులు గొన్ని సల్పెదను. ఇంతదనుకనే మనకు సాధ్యము.

అని నాట్యంబున శీతోపచారవిధులు సలుపుచున్నది.

మదనసేన. ఇంచుకయాశ్వాసంబుం జెంది,,

ఆ! ఈమందభాగ్యకు సకలసౌభాగ్యభాగ్యనవావతారుం డగు మనోహరునితోఁ గలయుసుఖంబు గల్గం బోదు! కాదేని వలవంత యింత దురంతంబై కాంతుని సమావేశంబగునంతలోని క్లాంతయుం గాఁజేయ పెట్టం బూనుకొనునే! మదీయంబు లగులావణ్యాదులు కాననంబునం గాయు వెన్నెలవలెఁ గాఁబోయెడినో! మత్కుల దేవతలయనుగ్రహంబు నాకుంగలిగినం గాని యీభాగ్యం బబ్బుననుట యెక్కడిమాట!

నిట్టూరుపుసిగుచ్చుచు,,

ఉ. ఎప్పటి కాత్మనాథు నిఁక నేల్కొనఁ గల్గనో మోద మారఁగా,
నెప్పటి కబ్బు నాసరసు నింపునఁగౌఁగిటఁ జేర్చు సౌఖ్యమిం,
కెప్పటి కానొకో రతుల నెక్కటి నైయె వగకానిఁ గూడ నిం,
కెప్పటి కానొకో దయితునిం పగువాతెర నొక్కి సొక్కఁ గన్.

ధనమాలిని. ఆత్మగతమున,,

సహజలజ్జావిభూషణం బగుకులకుమారీజనంబు సయితము శీలం బున్మూలితంబు నేసి యివ్విధిం బ్రలపించునట్టు లొనరించెడిని. ఈయనంగుననర్థకారిత్వంబు నేమని చెప్పంజనును.

ప్రకాశముగ,,

ప్రియసఖి! ప్రియసఖి! ఇంత వంతపడియెదవేల? త్వరిగతిం జని నీప్రియత మునిందోడ్తెచ్చి కేళీగృహంబున విడియించి యాలస్యంబు మాని నీకుం దెల్ప గుణమా లినింబనిచి వచ్చినదానను. అదియు నట్లప్రవర్తించు. ఇంచుక సేపూరడిలియుండుము.

మదనసేన. తిరిగిచూచి. లజ్జపడుచు. ఆత్మగతమున,,

అక్కటా! ఏను మోహపరవశనైసిగ్గుమాలి యుత్కంఠాార్తినుమృక్తకంఠంబుగఁ బల్కితిని. ఇంతకంటె నవినయంబు గలదే! కులకుమారీజనంబున కిది తగవే! ఏమి

యిట్టిచిత్తభ్రమంబు ? ప్రియసఖి యేతెంచినయర్థం బెఱుంగక యిట్లు గావించితివి. మించిన కార్యంబునకు వగచి యేమి సేయం గలదానను ?

అనియూరకుండెను.

ధనమాలిని. ప్రియసఖి! భర్తృదారికా ! నన్ను నీవు నీరెండపస్పృదయం బని యెంచి యుం డెదుదానవు. ప్రియజనసంవిభక్తం బగుదుఃఖవేగంబు సహ్యవేదనం బై యుండుంగనుక నాకుం దెల్పి యించుక యూప్యాయత వడయుము

మదనసేన. కరుణతో,,

ప్రియసఖి ! నీకు గోప్యంబు సేయునర్థంబేని నాకుం గలదె! వేయుమాట లేల? చెప్పెదను వినుము.

చం. విలయకృశానులీలఁ గడు వృద్ధి వహించి వియోగశోక మా,
కులపడఁ జేయ నా కిపు డకుంఠిత మై తమకంబు మీఱుటన్,
గలయును గల్పకోటిశతకాలముగాఁ గనుపట్టసాఁగె నె,
చ్చెలియును రాదు వేగఁ బతి జీరఁగ నేగిన దేమి సేయుదున్.

గుణమాలిని. ప్రవేశించి. వితర్కించుచు,,

కట్టా ! కఠోరచరితం బగుదైవంబు మదనసేన కెట్టిదుఃఖంబుఁ గల్పించె ? హా దైవమా ! యేమియు నెఱుంగనిగోల నెట్టియిడుమలు వడం జేయ సమకట్టితివిరా ! ఇందు నీ కగులాభం బేమియో యెఱుంగ ! సకలవిద్యాపారసర్వస్వం బెఱింగి యప రభారతి యనం బోలు నీలీలావతి కొక్కముక్కుడిమానిసిం దెచ్చి కూరిచితివి. ఈ పసిబాలయందు నీదుఃఖదాన నై పుణ్యంబుం జూపితివి. ఇం కేమి సేయంగలవు?

స్మరణ మభినయించి,,

ఔరా ! ఏ మనవచ్చు నామానవునిమూఢత్వంబు ? నే నావనచారిం దోడ్తె చ్చి చంద్రశాలయందుం బ్రవేశ పెట్టునప్పుడు,

ఉ. కేళిగృహంబుఁ గాంచి బలు కేకలు వేయుచు మ్రొక్కి నొక్కమై,
శాళిని గీలుబొమ్మలను భామిను లంచును బల్కరించుచున్,
వాలిడివోలెఁ దాను వలవంతల జూపెను హంసతూలికా,
లాలితతల్ప మెక్కను లులాయమురీతిని పొరలింపుచున్.

వీఁడు నాగరికజనంబులం గననిమూర్ఖాత్ముం డని విస్పష్టం బయ్యె. అంతియు గాక ! కడుదుష్కృతులలో మెలంగుచుండినవాఁ డనియుం దెలియఁబడుచున్నది.

శా. కేళింబొమ్మలఁ జూచి గాడిదెల సాఁగించుప్రకారంబునం,
దోలం బూని వితానమాలికలయందుం దాను బన్నుండె ను,
త్తాలశ్రీకరకేతుసంతతుల సందర్శించి లంఘించితా,
లీలం వస్త్రవిచిత్రపత్త్రముల మాళిం దాల్చె ఖండించుచున్.

కట్టా ! ఏమి సేయుదు. భర్తృదారిక లోకంబున సాటిలేని విద్యావిశేష విచక్షణుని గోర నందుకుం బ్రతిగ లోకంబున సాటి లేనిపరమమూర్ఖుండు సంప్రాప్తుం డయ్యె. ఈవృత్తాం తెఱింగె నేని యీమదనసేన యిప్పుడు ప్రాణంబులు వాయు. కాన నెఱింగింపం జనదు. తానె వానిమూర్ఖత్వంబు నెఱింగె నేని యప్పటి కేవిధంబున నైన దిద్దుకొనును. ఈపంకజేక్షణ సర్వకార్యంబుల నతివిచక్షణ గాదె ?

ఎదుటికి దృష్టులు నిగుడించి,,

ఇదె కన్యాంతఃపురంబున వివాహోపచారంబులు వడయుచు భర్తృదారిక యున్నది. దగ్గతిలి దీనితో దీనిమగనిని కేళీగృహంబున విడియించితి నని చెప్పెదను.

అనిపరిక్రమించి,,

భర్తృదారికా ! నీవల్లభుని కేళీగృహంబున విడియించి యిదె వచ్చితి. భవదాగమనమునకుం బ్రతీక్షించుచున్నవాఁడు. ఆలస్యం బగు నేని యతనికదు లెట్లగునో! లెమ్ము. పోదము రమ్ము.

మదనసేన. నిట్టూర్పునిగుడ్చుచు. లేచి,,

ప్రియసఖి ! గుణమాలిని ! ఏలకో యెఱుంగ ! పాతాళంబునం బడినదానం బోలె నేమియు నెఱుంగక యున్నదానను. ఏమి సేతు ?

గుణమాలిని. ఆత్మగతమున,,

ఓసి! దైవంబు నిన్నుఁ బాతాళంబునన ద్రోఁచినయది. ఇంకం జేయునదేమున్నది?

ప్రకాశముగ,,

ప్రియసఖి ! మోహాంధకారం బట్లు గ్రమ్మి నిన్నుం గాఱియపెట్టుచున్నది. ఇంక నదియు నివృత్తం బగును.

మదనసేన. లేచి నిలువంబడి. కలయ నవలోకించుచు,,

ప్రియసఖి! గుణమాలిని! శారదచంద్రికాపూరపూరితం బగుసీభువనాంతరాళంబు గంగాప్రవాహసహస్రసంప్లావితంబు వోలెఁ బొడసూపెడిని. చూడుము.

గీ. అమృతసాగరపూరవిభ్రమముఁ గ్రక్కుఁ జిందుమందంపు మించుజ్యోత్స్న చిందఁ బొడఁగ
పాండురద్వీపవరవాసభవ్యగరిమ। గాంచుచున్నది వోలె లోకంబు వెలఁగె.

గుణమాలిని. ఆత్మగతమున,,

కట్టా! ఇట్టియుదారకవితాచాతురీవిభూషిత యగుమానవలోకభారతి కొక్క యెడ్డెఁడు సంప్రాప్తుం డయ్యెఁగా! ఇట్టియసనురూపఘటనయందు విధి కేమి ఫలంబో? ఎఱుంగను.

మదనసేన. ప్రియసఖి! మద్విరచితం బగుచంద్రవర్ణనంబు నీమానసంబునకుం బోలినట్లు గనంబడదు. కాదేని పూర్వపుఁదెఱంగున నావచనార్థంబునం గలగుణాగుణంబు లనుడువవా!

గుణమాలిని. ప్రియసఖి! భర్తృదారికా! నీకుం గలయుత్కంఠావిశేషంబుం గాంచి నాహృదయంబు సుగుణదుర్గుణవివేకశూన్యం బయి యాకులపడుచున్నయది. కాన నీవచనంబునం గలయర్థంబును నిరూపింప సమర్థను గాక యుండెదను. ఆయర్థం బటుండనిమ్ము. అంగనాజనానుష్ఠేయం బగుచంద్రోదయార్ఘ్యదానంబు నిర్వర్తించి కేళీగృహంబునకుం బోఁగడంగుము.

ధనమాలినిం గాంచి,,

ప్రియసఖి! భర్తృదారికకుం జందనోదకంబు లందియిమ్ము.

ధనమాలిని. ప్రియసఖి భర్తృదారికా! ఇదె వికచకలారపరిమళసురభిళంబు లగు చందనోదకంబులు నిండియుండుకనకభృంగారంబు! దీనిం గైకొని కుముదబాంధవున కర్ఘ్యం బిడుము.

అని భృంగారం బందియిచ్చుచున్నది.

మదనసేన. భృంగారంబుఁ గైకొని. అర్ఘ్యం బిడంబోయి. శిథిలితాంగుళియై బంగరుగిండిని యిలాతలంబునం బడవేసి. ఉలిక్కిపడి,,

ఏమి యిది? ఈగిండినిసయితము పట్టుకొనం జాలక యున్నదాన. శిథిలితాంగుళినై పడవేసితిని.

గుణమాలిని. చింతపడుచు. ఆత్మగతమున,,

ఇది యు రాఁగలయనర్థంబునకు సూచకంబు.

ఘనమాలిని. ప్రియసఖి భర్తృదారికా! ఎంతయు నస్వస్థశరీరవై యుండెదవు. ఆగిండి పోయినం బోఁగాక. ఇదె యీవజ్రకరకం బందుకొని తదంతర్జలంబుల జలజవైరి కర్ఘ్యం బొసంగుము.

అనివజ్రకరకంబందియిచ్చెను.

మదనసేన. అందుకొని. చంద్రునింగాంచి,,

చం. నిరతను సాధుసంతతులు నెమ్మిఁ గ్రియ రచియించి మించఁ గా,
సరసిజబాంధవుం గలసి సమ్మదముం గలిగించుచుందు వీ,
వరుదుగ దేవత ల్పితరు లాదటఁ దృప్తి వహింపఁగా సుధా,
కరనికరంబు నల్లెదవు గైకొను మోశశి మత్కృతార్ఘ్యముల్.

అని చంద్రుని కర్ఘ్యం బిడి వజ్రకరకంబు ఘనమాలినిచేతి కందిచ్చినిలిచెను,,

గుణమాలిని. ప్రియసఖి! యింకం గదలుము. ప్రాణనాథునికడకుం బోదువుగాక.

మదనసేన. అడుగెత్తిపెట్టి. దక్షిణాక్షిస్పందనముఁ జూపి. ఆత్మగతమున దుఃఖంబుతో,,

ఆ! దైవం బిది యొకటి యపశకునంబుఁ గావించె. కట్టా! ఇది మహానర్థ సూచకము.

అని కూరుచుండెను.

గుణమాలిని. ఆత్మగతమున. చింతాకులత్వంబుతో,,

సర్వంబు ననర్థానురూపంబై ప్రవర్తిల్లెడిని. స్త్రీల కుద్దిష్టకార్యోద్యోగప్రవర్తనమున దక్షిణాక్షిస్పందనంబు కామితార్థసిద్ధివిఘటన సూచకంబు. మఱియు ననతిపాత్యానర్థసంప్రాప్తికిం గారణంబు నగును. దీనికి మూర్ధుఁ డగునాథుండు సంప్రాప్తుండై యుండుటతో మఱియు నేమియిడుము రాఁబోయెడినో! ఏదియయిన నేమి నేమం జాలుదును.

ఘనమాలిని. ప్రియసఖి! దక్షిణాక్షిస్పందనంబు గూడనిది యని యుపవిష్టః యితివో! ఇట్టివి యెల్ల ఫలియించుట కాకతాళీయ మని యెఱుంగుము.

కం. అనువాచికంబు స్వప్నం । బును గ్రహచరితంబు శకునపుంజము లివి యొ,
ల్లను యాదృచ్ఛికముగ ఫల । మును గల్పించునని తెల్పె ముని యాంగీరసుండున్.

కాన బ్రాజ్ఞ వగుని విందుకు భయంపడం జనునే! లెమ్ము. నాథుని చెంగటికిం బోదము రమ్ము. ఇంక నొకత్రుటి యే నాలసించితి నేని,

కం. అభినవశిరీషసుమమృదు । సుభగం బగునీదు మేను సుందరి దారు,
ణ్విభమదనబాణశిఖికిం । బ్రభచెడి దుస్సహప్రసిద్ధుమపాలై డిందున్.

త్వరితతరంబుగం జన కున్న నీయస్వస్థంబు గలుగక పోదు. కాన దయయుంచి వెడలుటయ కరం బుర వనియెదను.

గుణమాలిని. భర్తృదారికా ప్రియసఖీ! ధనమాలినివచనంబులు సంగతార్థంబుల యనం జనును. ఇటం దడసి చేయంగలకార్య మేమి? రా నున్నది రాకమానదు. లెమ్ము.

మదనసేన. లేచెను. ముప్పురును బరిక్రమించిరి.

గుణమాలిని. భర్తృదారికా! ప్రియసఖీ! ఇదె నీకేళికాగారంబుం దఱియం జొచ్చితిమి. చంద్రకాంతశిలానిర్మితంబగు నీయుపవనవర్తికృత్రిమగిరిసానువం బొడమి నిర్ఝరిణి భవదీయంబగు కేళికామందిరద్వారోపకంఠంబున నిదిగో! ప్రవహించుచున్నది. ఇం దుద్యానతరువాటీ సంచారసంక్రాంతం బగుపుప్పొడి వోవునట్లు పాదంబులు గడిగికొని లోనం బ్రవేశింపుము.

మదనసేన. నాట్యంబునం బదంబులు గడిగికొని. ఆలకించి,,

ఓసి! ప్రియసఖి! ఇ దేమి? ఇయ్యెడ నాగం బొక్కటి బుసలుకొట్టుచున్నది యుం బోలె భీతిప్రదం బగుధ్వని యొకటి వినంబడియెడిని.

గుణమాలిని. ఆత్మగతమున,,

ఆయెడ్డేడు గుఱువెట్టుచుండు వికృతధ్వని యిది. భర్తృదారిక యెన్నండు నిట్టి నులివు విన్నది గాదు గాన భయంపడియెడిని. ఇందుకు భయంపడినం దీరునా!

ప్రకాశముగ,,

ప్రియసఖీ! రాత్రివేళ యగుటం జేసి యెన్నియో భూతంబులు వికృతధ్వానములు సేయుచు నయ్యెయెడల మెలంగుచుండు. అందుల కీవు భయంపడవలసినది లేదు. మెల్లన సోపానంబు లెక్కి కేళీగృహంబుం బ్రవేశింపుము.

మదనసేన. నాట్యంబునం జొచ్చుచున్నది.

గుణమాలినీ, ధనమాలినులు. ప్రియసఖి! భర్తృదారికా! ఏము కన్యకాంతఃపురంబునందు సౌపవీయం బగుకస్తూరీమణిహారంబును గూరుచున్నయెడ మఱచి మఱచి లేచి వచ్చినారము. ఏకొండె నిదియుండెనాచోటు మఱచితిమి. ఇదె పోయి యన్వేషించి తెచ్చెదము. దాసినే కద! నీవు నీదయితునుదంతఫలకాలంకారంబు గావించి యాసాంద్రంబుఁ జూచి యానందింపఁ దలంపుఁ గొనియున్నదానవు.

మదనసేన. ఆత్మగతమున,,

ఈ చతురలు నన్నుం గాంతునంతికంబునకుం జేర్చి తాము వెడలి పోవనుపాయంబు గాన నీవ్యాజంబుఁ గల్పించుకొనిరి. వీరల నిప్పు డియ్యెడ నిలుపుకొనం జనదు.

అని యనుకొని యూరకున్నది.

గుణమాలినీ ధనమాలినులు నిష్క్రాంతలైరి

మదనసేన. చంద్రశాలాంతరంబుం బ్రవేశించి. ఆలకించి. సభయముగ,,

తొల్లింటి భయావహం బగు బలితంపుఁబులివు వెండియుం బొడముచున్నది. మానసంబునకుఁ గరంబు భయం బయ్యెడిని.

అంతటం గలయ నవలోకించి,,

ఇం దెం దేని యేసత్త్వంబేనిఁ గానంబడదు. ఇచటఁ దడయ ధైర్యంబు చాల కున్నది. ప్రాణనాథునిచెంగటికిం జనియెద.

అని త్వరితతరంబుగఁ జనుచు. నిలువంబడి,,

మదీయం బగుశయనమందిరంబునన యీపులివు వొడమునట్లు తోఁచెడిని. పరీక్షించెదను.

అని శయనాగారంబులోనికిం జనంబోయి. భయపడి. వెనుకంజయిడి,,

కట్టా! నాప్రాణనాథుండె యిట్లు గుఱువెట్టుచున్నవాఁడు. ఈయర్థం బతివిచిత్రంబు. ఈయుత్తమపురుషలక్షణోపేతం బగునతిమానుషరూపసారోదారం బైనవిగ్రహసౌష్ఠవం బెక్కడ? కరము దుర్భగుల కుండందగునీగుఱువెట్టునవలక్షణగుణం బెక్కడ? ఇతని కిది చంద్రునికిం గళంకంబువోలెఁ గానంబడియెడిని. “నవసంత్యేకత్ర సర్వేగుణాః” అని పెద్దలు నుడువియుండ లేదా! ఇదియును గాఢనిద్రయును దూరప్రయాణాయాసంబు వలనను గలుగుట గలదు. బహుదూరదేశమునుండి చనుదెంచుటంజేసియు నిన్నిదినంబులు పరిణయమంగళకార్యాతిపాతంబున నిదురగూరనయితిగామింజేసియు నధిక పరిశ్రాంతిం జెంది యీయతిసుకుమారాకారుం డిట్లు లుండెడిఁ గాఁబోలు! సమీపమునకుం జని మేల్కొలిపెదను.

అని పరిక్రమించుచున్నది.

శయనంబున మోకాళులు కడుపులోనికి ముడుచుకొని పరుండి లంబభుజుండు ప్రవేశించెను.

లంబభుజుఁడు. నిద్రించుచును గుఱు పెట్టుచున్నాఁడు.

మదనసేన. ఆత్మగతముగ,,

ఆ! నాప్రాణనాయకుండు పాదంబులు ముడుచుకొని వక్షస్థలంబు బాహ్యకాయంబునం బ్రవేశింప బరుండుటం జూడ నితఁడు యోగనిద్రాగరిష్ఠుండని తోఁచుచున్నది. ఇది కరము జుగుప్సావహం బయ్యును దేహపోషణకొఱకు జనులు. తొల్లి ఋశ్యశృంగాది మహాత్ములు నిట్లున్నవారల యాని యితిహాసంబులు చెప్పవే! గాఢనిద్రఁ గూరుకువారల మేల్కొలుపం గూడదందురు. ఇంచుక సేపు వీణాగానంబు సేయ మేల్కొనకపోఁడు.

అని వీణె వాయించి,,

కట్టా! యితఁ డింతకును మేల్కొనఁడు. మోహతాపంబు దేహంబును దహించుచున్నది. ఇతని మోమున మోమిడి ముద్దిడుకొనియెదను.

అని ముద్దిడుకొనుచున్నది.

లంబభుజుఁడు. ఇసీ! తొలఁగించి యొందుచోటఁ గట్టుము రా! మొగంబు పయిఁ జతికిలంబడుచున్నది.

అని చేతులం బట్టి త్రోసివేసెను.

మదనసేన. కట్టా! యితనివచనంబులు పశుపాలకులపలుకులం బోలి యున్నవి. ఇట్లగుటకుఁ గతం బేమొకో! పరికించిచూతము. ఇతఁడు కలవరించి నోటు బెదుచుకొని పరుండి యుండెడిని. మృగమదఘనసారప్రముఖపరిమళసువాసితం బగు వీడెము మిసెదఁగాక. అంతట నైనను మేల్కొనఁడా!

అని తమ్ముల మాతనినోట నుమిసెను,,

లంబభుజుఁడు. తమ్ములమును తుపక్కున నుమిసి,,

ఓరీ! యీ పెంటిగాడిదె పెంటికలు వేయుచున్నది. పెంటకట్టునకుం దీయరోరి పోలిగో!

అని కూయుచులేచెను,,

మదనసేన. ఆశ్చర్యపడుచు. కొంతతడవు నెవ్వెఱపడి నిలిచి. సశోకముగ,,

కట్టా! యీతండు గాడిదెలం గాయుచుండుమూఢమనుష్యుండని తెలిసె. హా! దైవమా! నన్నీక్లేశంబునకా! వంచించితివి. సర్వవిద్యాపారంగతుం డగువానిం బతిఁ గాఁ బడయం గోరియుండు నాగర్వం బణంగ గాడిదెలమేపువానిం దెచ్చి కూరిచితివే! ఇఁక నాజన్మమేల! హా! అయ్యా! హా! తల్లీ! మీరు నాకై కరము ప్రయాసపడి యఖిలరాజచక్రవిరోధంబును సంపాదించుకొని మనంబున మనముద్దులపట్టి మదనసేన సద్వరసమాగమ సుఖంబున నానందింపం గాంచి సంతసింత మని తలంపుం గొని యుంటిరి. ఆమనోరథంబు వమ్మయ్యె. అసమానవైదుష్యభూషితు లగురాజకుమారుల ననాదరించి తుదకు మదనసేన యొకమూఢునిం గాడిదెలమేపువానిం జేపట్టె నన్న యాడికె వీనులం బడిన మీర లెట్టివగలం బొగలం బోయెదరో! అది వినునంతదనుక నాజన్మంబుండవలెనా! ఆ! దైవమా! కరము కఠోరుఁడవై యింతపని యొనరించితివి. ఇంకనైన నీ వనాథ; నశరణ; నతిదీన; నదృష్టవిరహిత; ననుకంపనీయ; ననుగ్రహించి మరణం బిచ్చియైనఁ గావుము.

అని మూర్ఛపోయి యిలపయిం బడి కొంతతడవున కొడలుదెలిసి,,

అయ్యయో! నాప్రియసఖులు నన్నుఁ బాసి పోయిరి. ఈమూర్ఛ యైన నింకంగొంతకాల ముండక నివర్తించినయది. ఇఁక మరణంబు గాని శరణంబు లేదు. అదియు నీమందభాగ్యకు లబ్ధం బగుట యరుదు. రజ్జువిషాగ్నిజలంబులం బ్రాణంబులు వాయుచు నన్ను నాత్మహత్య యొనరించుకొనువారల కంధతామిస్రంబు లనులోకంబులు సతతవాస్తవ్యంబు లగుదురు గాదె! ఇఁక నేమి సేయుదును? ఏగతిఁ బ్రవర్తింతును? ఎవ్వనిం జేరుదును? ఎవ్వరితోఁ బల్కుదును? ఎవ్వరితోఁ జెప్పుకొందును? ఏది గతి? ఇట్టియపరిమితైశ్వర్యసంపన్నం బగుజన్మంబు వడసి యాఁడుపుట్టువై పుట్టి యపరిమితవైదుషీవిశేషంబున నందఱ మెప్పించి మించిననా కిదియా ప్రయోజనం బయ్యె! ఇట్టి దౌర్భాగ్యశాలిని నేఁ దెలవారఁగా నెట్లు ప్రియసఖులమొగంబులు గాంతు. కన్యకాంతఃపురంబు వెడలునప్పుడు నాకైనదుర్నిమిత్తంబు లిట్లగుటకు సూచకంబై గదా పొడమె. ఇది యెఱింగియె కాఁబోలు గుణమాలిని నాకుం బ్రాణనిర్విశేష యగుసఖి యుత్సాహంబుమాని యనుపదము చింతం గూరుచుండినయది. అది యెఱుంగకయ ప్రవర్తించుచుంటి.

విచారంబుతో,,

ఔరా! యే నెంతయవిమృశ్యకారిణిని. లోకంబునం బ్రాయికంబుగ నెల్లవారును స్వప్నంబున నైనరణారణకంబున నసంభావితార్థంబులు వచించుటయుఁ గలదు. అట్టులుండం బోలదా! కొంతదనుక వారసి చూచినం గాని నిక్కంబు దెలియదు.

అని సమీపమునకుం జనుచున్నది,,

లంబభుజుండు.

శయనంబున హూంకరించుకొని కూర్చుండి. రాజపుత్రింజూచి. బెదరుచు.

ఆత్మగతంబున,,

అయ్యలూ ! ఏమి యిదేను గద్దె ?

ప్రకాశముగ,,

అసాధు ! బలుటక్కరిదయ్యమురా యిది ! ఓరి ! పోలిగాండూ ! ఓరి ! మారిగాండూ ! ఈదయ్యమును మన మెప్పుడుగాని చూచియుండలేదురో ! ఓ నన్నా ! యిది మిణుగురుంబురువులదయ్యమురా ! ఓరి బాలిగాండూ ! యిది యొంటం దళతళలాడుమిణుగురుంబురువుల నతికించుకొనివచ్చినదిరో.

నలువలంకులు చూచుచు,, ముందుం దాం గొనితెచ్చిపెట్టుకొన్నచిత్రవస్త్రంబులు శయనంబున నయ్యెయ్యెడల నుండువానిని బ్రోగుచేసి దగ్గఱ నుంచుకొని. రాజపుత్రింజూచి,,

ఓసి దయ్యమా ! బలునొయ్యారంబునోం జయింబడం గడంగెదవే ! ఓసీ ! యిదె చూడు. ఈబట్ట లన్నియుం గట్టి యొకపెట్టున నీమీఁద బడుదు ! గొప్పైదను. చూడునాయేటు ?

అని బట్టలు దిండుగాఁ జుట్టుకొనుచున్నాఁడు,,

మదనసేన. ఆత్మగతమున,,

కట్టా ! మనంబున కొకతీరున నాశ్వాసంబుఁ గల్పించుకొంటిని. అదియు నివృత్తం బయ్యె. ఈతనిపలుకులవలన నితఁడు దయ్యాలతోడను గాడిదెలతోడను వసించు వనచారి యగుమోటుమానిసి యని నిర్ధారితం బయ్యెను. ఆ ! యింకనేమి సేయంగలదానను.

చింత నభినయించుచు,,

ఇతండు దూరదేశప్రయాణాయాసపరిశ్రాంతుండై గాఢనిద్రాపరవశకంబు వీస కతాఁ జూచినవస్తువుల నిప్పుడు తడవుచున్నాఁడని యూహింపవచ్చు. ఏదియైనను వీనిం జేయి పట్టుకొనిగాని యడిగి తెలిసికొనం బోలదు. వీఁడు లేచి యూఁపనిబాడం గడంగెడిని.

అని సరసకుం జేరుచున్నది.

లంబభుజుండు. బెదరుచూపులం జూచుచు,,

ఓసీ కోఱిబూచీ! మోహమున దగ్గఱకుం జేరి పట్టుకొనం బోయెదవో! నీజిత్తు లే నెఱుంగనా! ఈ రెండుక నాలంతిగ నీకు దొరకు ననుకొంటివో!

అని నయ్యాళింబు దిగి బట్టలదిండును చేతం బట్టుకొని తిరిగితిరిగి చూచుచు నొదుగువాటునను జనుచున్నాఁడు.

మదనసేన సశోకముగ. ఆత్మగతమున,,

ఇది యితనికి నిద్రావేగజనితం బయినవరణకరణకంబు గాదు. స్వాభావికంబు. వీనిమాటలవలన వీఁ డెఱుక యని తెలిసె. అక్కటా! యీమదనసేనజన్మంబు ఎంతటి దీనదశావిశేషవిదూషితం బయ్యె! అత్యుత్తము లగురాజసత్తములవంశంబునం జనించి యొకకిరాతునికిం గొంగు వేయ వలసివచ్చెఁగదా! చాలుంజాలు! మదనసేనజన్మంబును దాసిజననీజనకులవంశంబును గడతేరినయదియ. ఇట్టి యతినీచకులునికిం గంతంబు సూపవలసి వచ్చినమదీయదుర్భగకాయంబు కఠోర మగుదావవహ్నియందుం గ్రాచక శుద్ధిం బొరయదు. ఇప్పుడు ప్రియసఖులు సమీపమున నుండి పెనుసాదం బేర్చిన నంసం దుమికి యీహృదయతాపంబు వాపికొనంగలను. నావిధివైపరీత్యంబు వారల దవ్వులకుం గొంపోయె. ఏమి సేయుదును? ఎల్లి యెవ్వరిమొగంబుగాని యెట్లుగాంతును.

వితర్కంబుతో,,

ఇతనియనవద్యం బగురూపంబుంగన నుత్తమవంశసంజాతుండని యెఱింగించుచున్నది. సత్తమము లగుజాతిరత్నంబులు కృత్రిమరత్నంబులతోఁ గలసికొని యుండుటయుం గలదు. ఆ క్లేశహేతువుననే యితఁడు కిరాతులతోఁ జేరియుండు నోకో! ఇది యారయంజనును. ఉత్తమవంశజాతుం డయ్యెనేని మజ్జనకకులంబు దోషాస్పదంబు గాక యుండుఁగా! కాదేని నావలన నీరాజవంశంబు యశోవిదూరం బయ్యె నని యనుకొనం జనును.

అని పెండియు నాలంబభుజునిసరసకుం జేరం బోయెను.

లంబభుజుఁడు. చూచి. భయంపడుచు. వెనుకంజయిడుచు,,

ఇసీ! యీదయ్యము నన్నుం దినం బూనియున్నది. వదలదు కాఁబోలు? ఏమి సేయుదును? కానీ! దగ్గఱకు రానిచ్చి యీబట్టలదిండుతోఁ గొట్టెద. ఈదయ్యమును మనచనవులకుం దవ్వుల నెప్పుడుగాని కనుగొన్నది లేదు. మఱి యనేకవిధంబు లగు దయ్యంబులప్పుడప్పుడు గానంబడుచున్నవి. ఇది వదలి పోక వెంబడించుటం జూచిన నలంతిగం బోని పెనుమాయలది యని తోఁచెడిని.

అనివస్త్రములమూఁట చేతికెత్తుకొనుచున్నాఁడు.

మదనసేన. ఆత్మగతమున,,

ఇతఁడు కరము మూఢుం డనుటయందు సందియం బొకింతయును లేదు. నరుఁడు వచనంబుల నమ్మతిం గైకొనిగాని చెంగటి కేగం జనఁడు. వాస్తవాంశంబుఁ దెల్పి నన్ను దయ్యమనుకొనియుండు నితని భ్రమంబు వాపెదను.

ప్రకాశముగ,,

ఓసత్తమా! నేను దయ్యమును గాను. భయంపడవలదు. ఇదియుం జనప గాదు. ఈయుద్యానవనంబునందలి కేళీగృహము. నామేనం గల యివి మగరాలసొమ్ములు. మిణుఁగుఱుం బురువులు గావు.

లంబభుజుఁడు. సస్మరణముగ,,

ఔనౌను! బాపనయ్య నన్నుం దోడ్తెచ్చెఁగా! అది మఱచితిని. ఇది రాజునగ రని తెలిసికొంటిని. అట్లయిన నీ వెవ్వతెవు?

మదనసేన. ఓసత్తమా! నేను రాజపుత్త్రిని.

లంబభుజుఁడు. ఇసీ! యింతవఱకును నీయంటి రాజపుత్త్రికలు పెక్కండ్రు నన్నుం బలసికొని కాళ్లు పట్టి యీడిచియుం జేతులు పట్టి పిలిచియు మెడగను పట్టి వ్రేలాడియు నిట్లు పలుతెఱంగుల నన్నుం గాఱియపెట్టి తుదకుఁ దాళంజాలక నే విఱుగ నడచిన నిదె పడియున్నవారు. కనుంగొనుము. వారు నాతో మాటాడక పోయిరి. నీవు మాటలాడెదవు.

అని భగ్నము సేయంబడియుండు కీలుంబొమ్మలఁ జూపుచున్నాఁడు.

మదనసేన. కనుంగొని,, ఆత్మగతమున,,

ఔరా! యితండు రాఁగానే యితనికిం బరిచర్య సేయంబనిచిన కీలుంబొమ్మలు తన్నుం బలసికొన నితండు జంత్రపుంబొమ్మ లని యెఱుంగక వానిం గలయఁ గమకించియుండు. కావునే యివి యను వెఱింగి నడపం దెలియమిచేత నితనిఁ గాఱియపెట్టి యితనిచేఁ గొట్టువడి యిట్లయిం బడియున్నవి.

ప్రకాశముగ,,

ఓసత్తమా! యివి జంత్రపుంబొమ్మలు. రాజపుత్త్రికలు గారు.

లంబభుజుఁడు. సరి! సరి! ఈవిధానసే యొక్కొక్క రొక్కొక్కటి చెప్పుచుందురు కాఁబోలు! తొలుత నే వచ్చినప్పు డొకలంజె పూలుగ్రుచ్చినత్రాటి నొకదాని

నాయనతోఁ బదఁడ్రేయి నదియు రాజకూఁతు రనఁగొంటిని. ఆబాపనయ్య నాకు జెప్పునప్పుడు రాజకూఁతురు బలితంపుకంపుగలిగి మెత్తనై యుండు నని నాకుం జెప్పె. అంతనది గాకపోయె. నీవు మాత్రము రాజకూఁతుర వని నమ్మం గారణ మేమి?

మదనసేన. ఆత్మగతమున,,

ఇతఁడు చెప్పునట్టిబాపనయ్య ఎవ్వఁడో! క్రమంబుగ నెఱుంగవలయు.

ప్రకాశముగ,,

ఓసత్తమా! ఏను రాజపుత్రిక నగుటకు నాకుం గలసౌందర్యాదిగుణంబు లట్లుండ సకలవిద్యలయందును సామర్థ్యము సంపాదించి యున్నదాన నగుటయుం దార్కాణయగు.

లంబభుజుఁడు. సోత్ప్రాసముగ,,

ఓసీ! ఎన్నిచదువు లెఱుంగుదు నను చున్నావుగదా! గడ యెక్కి దొమ్మరియా టయాడఁగలవా! ఎగిచి యెగిచి పులుఁగులం బట్టం బోదువా! కొండలపేటుల కెక్కి మెండుగఁ బెఱలు గొట్టి తేనియలు పట్టంగలవా! ఈఁతపేళ్లు చీల్చి గంప లల్లంగలవా! గాడిదెలను మేపుకొని రాఁగలవా!

మదనసేన. ఆత్మగతమున,

ఔరా! యిఁకయా విద్యలు? అరణ్యకు లగునెఱుకల కుఱవైనవి యీవిద్యలు!

ప్రకాశముగ,,

ఓసత్తమా! నీవుడిగినవి నాగరికు లభ్యసించునవి గావు.

లంబభుజుఁడు. ఆ! అలాగా! ఆనాగరికవిద్య లెట్లుండునో చూపెదవా.

మదనసేన. సత్తమా! అట్లే తెలిపెదను. ఆనాగరికవిద్యలలో నుత్తమంబు గానము. అందు వీణావాదనంబు కడుమనోజ్ఞము. అదివినుము.

వీణియుం గైకొని స్వరసంయోజనము నేయం దంత్రులు సవరించుచున్నది.

లంబభుజుఁడు. ఆత్మగతమున,,

ఈనాలిమాలినబేల యీసన్నంపువానిం ద్రెంపలేక యిడుమ గుడుచు చున్నది. ఇకియు కాఁబోలు నాగరికవిద్య యన్నది. ఇది యేమెఱుంగనా!

ప్రకాశముగ,,

ఓసీ యీవిద్య నాకుఁ జూపింపవే! అని యుప్పొంగియుండును.

అని చేతులు సాచెను,,

మదనసేన. ఆత్మగతమున,,

ఎల్లవిద్యలెఱింగియు నిక్కాలంబోలెఁ దోఁచుచున్నాఁడేమి యితండు? కాదేని వీణె వాయించు సామర్థ్యం బుండునే! అది గలదేని సంతసంబు సాగదు చూతము.

వీణియ నందిచ్చుచున్నది,,

లంబభుజుఁడు. చేకొని. క్రిందం బెట్టుకొని,,

ఇదీ! యింత తేలిక యగుదీని త్రాళ్లు దెంచుట యొక ప్రసిద్ధిచేయుపనియా! ఇదె చూడుము. ఈపని యొకఁడు సేయం జాలఁడు.

అని వీణెతంతెలు తెగదీసి,,

ఓసీ చూచితివా! నే నొకచిటికవేయునంతలోఁ జేసినాఁడను. ఈపనికై కాఁబోలు! నీవు కష్టములు పడుచుంటివి.

మదనసేన. ఆత్మగతమున,,

ఆ! ఏమి వీనిమౌర్ఖ్యము? ఈమూఢునికి కేక నేమి చెప్పఁగాఁ దెలియంగలదు.

ప్రకాశముగ,,

ఓసత్తమా! నీ వభ్యసించినవిద్య కరము గొనియాడందగినదియ. మీవిద్యలతో మా నాగరికవిద్యలు సరిపోలవు!

లంబభుజుఁడు. ఓసీ! యది యట్లుండనిమ్ము. రాజపుత్రి నాకుం బెండ్లామయ్యె నని బాపనయ్య యనియెనే! నీవేనా యాపెండ్లాము?

మదనసేన. ఔను. నేనె నీప్రాణవల్లభను.

లంబభుజుఁడు. భయంపడుచు. వెనుకంజయిడుచు,,

ఓసీ! తెలిసె! తెలిసె! నాప్రాణంబులకు నీ వేలిక నంటివి గనుక నీవు దయ్యమవే! నాప్రాణంబులు గొన వచ్చియున్నదానవు? చిక్కుము. ఇదె చూడుము, నేను నీకుం జిక్కుదునా!

అని చంద్రశాలోర్ధ్వభాగంబున కెక్కి కూరుచుండెను,,

మదనసేన. చింతాకులత్వంబుఁ గాన్పించుచు. ఆత్మగతమున,,

ఇతనిమూర్ఖభావంబుం గనిన నితని నే మేను వాయుట లగ్గనితోఁచుచున్నది. ఇతనిసౌందర్యంబుం జూచిన మించినయనురాగంబుచే నట్లు సేయ మనంబు రాదు. ఇతనిని శక్తికొలఁది దిద్ది చూచిన యనంతరముగాని యెది సేయుటకును నిశ్చయింపం జనదు. అనున్యమెయి నితని నామాటకు వశంవదుండై ప్రవర్తించునట్లు చేసికొనందగును.

ప్రకాశముగ,,

ఓసత్తమా! నేను దయ్యమును గాను. నీ పెండ్లామనే! నీయిచ్ఛానుగుణముగ నే మనము ప్రవర్తింతము. దిగి రమ్ము.

లంబభుజుఁడు. భయపడుచు దిగివచ్చి. వీఁపుమీఁది పుట్టముఁ దీసికొని మరలిచూపి,,

ఆ బాపనయ్యయు నతనికి బండిఁదోలుకొనివచ్చినవాఁడును నన్ను గుజ్జుపుంజలు కుతోఁ గొట్టిన దెబ్బలదద్దులు గాంచితివా! నాకోరినకోరిక దెల్పం గూడ దని వారు నన్నుం గొట్టిరి. అట్లుండ నే నెట్లు సెప్పుదును?

మదనసేన. లంబభుజునివీఁపునదద్దులు గనుంగొని దుఃఖించుచు,,

ఆ! కడు నిర్దయులై వార లీకుసుమసుకుమారాకారు నిట్లు గొట్టిరి. ఔరా! మనుజునికేముండియు బుద్ధి వికలంబయ్యేనేని యేయుపయోగంబు నుండదు గదా! కట్టా యీయుత్తముఁ డిట్టికఠోరప్రహారంబుల కర్హుండె?

ప్రకాశముగ,,

ఓసత్తమా! గతించినకార్యంబునకుం జింతింప నేల! నాసదనముం జేరితివి గాన నీకవారలవలనిభయంబు మానుము. నీయిష్టంబు నుడువుము. అవశ్యముగ నెఱవేర్చెదను.

లంబభుజుఁడు. ఓసి యట్లయేని నాచేతఁ జేయివేసి పతినఁ గావించెదవా!

అని చేయి చాచెను,,

మదనసేన. ఓసత్తమా! అట్ల యగుఁ గాక.

అనియతనిచాచినయిందుకరంబుఁ గాంచి. ఆశ్చర్యంబుతో. ఆత్మగతమున,,

చం. హలకులిశాదిచిహ్నయుతమై యరుణాంబుజరాగలీలలన్,
వెలయుచు సర్వభూతలము వార్ధిపరీతము నేలఁజాలును,
జ్వలమగుభాగ్యరేఖయును సర్వమహీపతిమాననీయమౌ,
లలితకవిత్వవైఖరి సెలంగుసుకీర్తిఁ గరంబు దెల్పెడిన్.

కాన నీయుత్తముండుత్తమకులసంజాతుండనుటయందు సందియంబులేదు.

అని యతనిహస్తంబునందు హస్తంబిడి,,

ఓసత్తమా! నీయభీష్టంబు నెఱవేఱుతుఁ జాలుఁగాము.

లంబభుజుఁడు. ఓసి! నేను మాచనుపకుం బోయి మాయమ్మం జూడవలె!

మఱియు నా కొకగాడిదెకొదమ గలదు. దానికిం గాలు విఱిగియున్నది. అది కుదిరినదా లేదా తెలిసికొనవలయు.

మదనసేన. ఓసత్తమా! మీచనుప యెయ్యెడ నున్నది! మీయమ్మ పేరేమి? మీయయ్య యెవ్వఁడు? వచింపుము. వారలకడకుం దోడ్కొనిపోయెదను.

లంబభుజుఁడు. ఓసీ మాయయ్య యెఱుకలతేఁడు; వికటఘోటుం డనువాఁడు. మాయమ్మ నెలబాల యనునది. ఈ యూరికిం దెంకట నుండునడవిలో మాచనుప యున్నది.

మదనసేన. ఓసత్తమా! నీవు వారలకుం బుట్టినపట్టివా!

లంబభుజుఁడు. ఓసి! కాను.

మదనసేన. కడుసంతసంబుతో ఆత్మగతమున,,

నే నితఁడుత్తమవంశసంభూతుండై యుండనోపు నని తలంచినతలంపు నపరమార్థంబగునేమో? ఎఱుకలకుం బుట్టినవాఁడు గా నని యితఁడు వల్కుటచేఁ బావకజ్వాలాదూయమాన మగుచుండుపాదపము జలభరితం బగుజలదంబునుఱుమునం బోలె సంతసిలుచున్నదానను. కలతెఱం గెఱుంగం జనును.

ప్రకాశముగ,,

ఓసత్తమా! కానంటివే! అప్పటి కీవు కిరాతులతోఁ గలసినవాఁడవే గదా! ఎవ్వనికిం జనించితివి? ఎట్లు బోయలలోఁ గలసితివి?

లంబభుజంగుడు. ఓసీ! అది యెల్ల నామనంబునకుం దోఁచవు. ఇందు మాపాఁగె ప్రవాహలోంచోము లాడుకొనెడి యేటు విన్నాఁడ. అది యిప్పుడు బుద్దికిం దోఁచెను. చెప్పెదను తెలిసికొందువా!

మదనసేన. ఓక్కటిమా! తెల్పుము.

లంబభుజంగుడు. ఓసీ! వినుము. ఒకనాఁడు మాయమ్మకడ కొకరొకఁడు కవిత వచ్చి నమ్మం జూచుచు వీఁడు వివాహమైయుం జేసినాటినుండి మీలగ్నము లెట్లున్నవి? యని యడిగిన మాయమ్మ యిట్లనియె. ఓసిరి! ఈబ్రేలుంజేతులాఁడు మాలోఁ గలసినవాడిగ మాసంపద యొన్నటంగను పెంపు వహియించున్నది. మాతోటకులు లెక్కలెక్క వయయ్యె జేవారమున నూడిననొమ్ము పెలుచనైనవి. వీఁడు గాలయుచుండుగాడిదె లన్ననో తండతండంబులై మెందుకొనుచుండెడిని. ఇంతకంటె మనకుం గావలసిన దేమి? వీఁ డింకఁ గాలిడినవేళ యెట్టిదో కాని యొకముసలిగోద యైనం జచ్చినది గాదు. అట్లుండ మా కేమి తక్కువ? అనఁగా నాకొరవంజి యోసెలబాలా వీఁడు కవలేని సిరిగలగొప్పవంగడంపుంబిడ్డం డని యెంచం బోలు? వీఁ డుండినచోటు లెల్లనిట్టు లుండునుపో! మోకాళులదనుక బ్రేలుకాడుచేతులు గలవాఁ డుండుచోటుల సిరి వరంబు పెంపు వడయుచుండు. మఱియు నొక విసుమానము గల దది వినుము. ఏనొక విలాతికిం బోయి యుండి యయ్యెడ నాబ్రోలి మన్నిమంతిరికుమరుం డెఱుకల లోఁగలసినవాఁ డని విని యతనిరూపుంగల తెఱంగునం దెలిసికొని వచ్చినదాన. ఆచిన్నవానియందం బెల్ల నీచిన్నవానియం గన్నయది. ఇతం డామంతిరికొమరుండై యుండం బోలుసుమీ! అనఁగా మాయమ్మ యేగుఱ్ఱెవ రెఱుంగుదు రనఁగా నాయెఱుకలసాని మాయమ్మతోనో సెలబాలా! ఆకొమరుండు మీబిడారమునం జేరుకొన్నవాఁ డని యాయావిలాతులవార లాడుకొనుమాటలు నే వినియున్నదానను. కానుడివితిని. అని చెప్పి తనయిచ్చం జనియె.

మదనసేన. కడుసంతసంబుతో, ఆత్మగతమున,,

ఒకమహనీయవంశంబునం బుట్టినినాఁ డితని కిట్టిసురూపసంపద గలుగుట యెట్లుకి నాతర్కం బభ్యుదయోదర్కంబయ్యె. నాసామర్థ్యంబున నితని నఖిలవిద్యాపారంగతునిం గావించి యితనితో సుఖించెదను.

ప్రకాశముగ,,

ఓసీ! ఆచమనమును తొల్లి యెప్పుడో నేఁ జేయుచుండినట్లు తలంపునకు వచ్చు చున్నది. ప్రడిసిటం బోసికొని నీళులు త్రాగుట గదా! అది. అది నేయునప్పుడు గొణుఁగుకొనవలసినవి పల్కు లేవో కొన్ని గలవు సుమా! నా కవి మఱచిపోయె.

మదనసేన. ఆత్మగతమున సంతసించుచు,,

ఇతఁ డుపనయనాదిసంస్కారంబులును వడసి యేదేని యొకమహానిగ్రహం బున వికలచిత్తుం డయ్యెనని విస్పష్టం బయ్యెడిని.

ప్రకాశముగ,,

ఓసత్తమా! ఆగొణుఁగుకొనవలసినపల్కుల నే నుడివెదను. పాదంబులు గడిగి కొని ప్రడిసిట నీళులు పట్టుకొనుము.

అని యతని క్షాళితచరణునిం గావించి సమంత్రకంబుగఁ దీర్థోదకంబుల నాచ మింపం జేసెను.

లంబభుజుఁడు. ఓసీ! యిది కొంతకాలమునకు ముందు మావారు నేయించినదే! ఇఁకఁ బయన మయ్యెదము లెమ్ము.

మదనసేన. ఆత్మగతమున,,

ఆ! ఏను జింతించినది నిక్కువంబయ్యె! ఇతం డుపనయనాదిసంస్కా రంబులంబడయనివాఁ డగునేని యాచమించి యిది మావారు పూర్వము నేయించినదే యనియనఁడు. మే లయ్యెను.

ప్రకాశముగ,,

ఓసత్తమా! ఇదె పయిన మగుదము. మఱియు నాపల్కొక్కటి వినుము.

లంబభుజుఁడు. ఓసీ! నీవు మంచిదానవు. నీమాటలు నాకు బాగున్నవి. విని యెదను. ఏమి చెప్పెదవు?

అని చెవి యొగ్గుచున్నాఁడు.

మదనసేన. ఆత్మగతమున,,

ఓ భగవతీ! నా పెనిమిటి కిపుడు భవన్మంత్రం బుపదేశింపవలసినది విధియయ్యె. దీన నగుపాపంబు నా కేమాత్రము దగులుకొనకుండం జనును.

అని కాళి కంజలి యొనర్చె. కాళికామంత్రంబు లంబభుజానిచెవిలో చదువు చున్నది.

లంబభుజుండు. కాళికామంత్రంబు విని. మదనసేనం జూచి,,

ఓ ప్రాణవల్లభా! నీవలన నేను మహోగ్రఘనసముద్రంబుం దాటితిని. చండ కరకిరణప్రసరణంబున నంధతమసంబువోలె నామోహంబు విముక్తం బయినయది. ఏత న్మంత్రశ్రవణప్రభావంబునం జేసి మదీయం బగుపూర్వవృత్తంబు విస్మృతంబయియుండు నది వెండియు స్మృతిసమారూఢం బయ్యె. ఓ సుందరీతిలకమా! గౌతమునికపటంబున నైన మహాసంకటంబువలన నీవు కడము దుఃఖించెదవు. ఆ వంత మానుము.

ఏను కరూశదేశాధీశుని మహామాత్యుం డగు మిత్రమాధవుని కుమారుండను. కళాచంద్రుం డనువాఁడను. యుక్తవయస్కున మదీయజనకునిచే నుపనీతుండనై వేదశి రుండనుపరివ్రాజకునికడ సమస్తశాస్త్రంబులును వేదంబులును వేదాంగంబులును బురాణం బులు నభ్యసించుచుంటిని. ఏదేవతానుగ్రహంబువలననో నిఖిలశాస్త్రార్థంబులు నిత రుల కవిదితములగునవి సాకల్యముగ మదీయబుద్ధికి నిరూఢప్రక్రియ నిస్ఫురితంబు లగు చుండె. మఱియు సకలరసికజనశ్లాఘనీయాలలితపదరచనాచమత్కారసారం బయి యొప్పు కవితయు నుద్భవిల్లె. ఆభూసురుం డుపన్యసించు శాస్త్రార్థంబులకును మదీయ బుద్ధికిం దోఁచునాయర్థంబులకును భేదంబు వొడసూపుచు వచ్చుటం జేసి సంశయాకు లుండనై తద్విచారంబులందు నాతనితోఁ బ్రవాదంబు సలుపవలసి యట్లు గావించుచుంటి. అందు నాకుం దోఁచినయువియ ప్రమాణసహంబు లగుచువచ్చె. ఇట్లు జరుగుచుండ నొక నాఁడు నేనడిగినప్రశ్నముల కుత్తరం బొసంగంజాలక కడుఁ గుపితుండై యాభూసుర వరుండు గనలుచు నన్నుం గాంచి ఓరీ! నీ వలంతిగఁ జనవినవాఁడ వయ్యు వలంతివి వోలె నన్నాక్షేపించెదవు! గురుతిరస్కారపాపంబునం జేసి నీవు నీకుం గలసర్వ కళాకౌశలగర్వం బడంగి కడు మూఢమానవుండవై వర్తింతువుగాత. అనిశపియించి వెండియుం గినుకఁ బూని యోరీ నీ. వపరిమితైశ్వర్యసంపన్నుండ ననియు నాగరికుండ ననియు రసజ్ఞశిఖామణి ననియుం గడము గర్వించి యితరుల నడకసేయుదువు. ఇట్టి యహంకారం బడంగ నీదినంబుండొట్టి నీచవృత్తు లగుకిరాతులతో సహవాసంబును ఆ యనాగరికజనంబు సయితి మవహసింపం దగుబుద్ధిదౌర్బల్యంబును గలిగి యతినీచవృ త్తివై మెలంగుచుండుదువుగాత. అనియుం దిట్టిన నేను నప్రశాపంబునకుభయంపడి యాతనికివందనంబు లాచరించి వేడుకొనఁగాఁ బ్రసన్నుండై యాతండు నాయందుఁ గర మనుతపించుచుం జేయునది లేక సమాధిని నెలకొని దివ్యజ్ఞానంబునం గాంచి యోరీ

వత్స కళాచంద్ర! నీకు నే నొసంగినశాపంబు నిరతిశయాభ్యుదయంబునకు మూలం బగు. భారతీసమాన యగునరనాథసూతిం జేపట్టి మహాభాగ్యంబనుభవింపం బోయెదవు. ఆ రాజతనూజవలన నీకుఁ గాళికామంత్రంబు సంప్రాప్తంబగు. ఆమంత్రప్రభావంబునంజేసి శాపదోషంబు నివృత్తంబై పూర్వస్మృతిం జెందెదవు. అప్పుడు నీకపరిమేయ వైదుష్యవిశేషంబు గల్గం బోయెడిని. నీవు మూఢత్వంబున నుండునప్పుడు భవదీయం బగుపూర్వస్థితి యెఱుకపడక యుండును గాన నీచకృత్యంబులు సేయ నేవగించుకొనక యుండంగలవు అని నుడికిన నేనును శాపోపహతుండనై స్మృతిచెడి వికటఘాంటడను నెఱుపల తేలిచినుపంశేరితిని. తన్మూలకముగ నెట్టిమహారాజకుమారులకు సంవరాని భవదీయపాణిగ్రహణమంగళంబుం గంటిని. భవదుక్తం బగుకాళికామంత్రంబును బురశ్చరణంబు చేసి సకలకవికులతిలక సంస్తవనీయం బగువైదుష్యంబు సంపాదించి నీమనోరథంబును బూర్ణము గావించెదను. ఏను గాళికాలయంబునకుఁ జనియెద.

మదనసేన, మహామదంబుతో. బాష్పంబులు విడుచుచు,,

ప్రాణనాథ! నీరూపరేఖావిలాసవిశేషంబులు గాంచిన దాదిగ నిన్ను మహాకుల ప్రసూతుండ వని తలంచుకొని యుండెదను.

ఇప్పుడు భవద్వచనసుధాధారలవలన నామానసతాపం బుపశాంతిం బెందినయది. మహానందగిరిశిఖరసమారూఢ నైతిని. నేను నాకంటె రసజ్ఞుఁ డగుసర్వవిద్యావిచక్షణుని బరిణయంబు చేసికొనం దలంచి యనేకరాజపుత్రుల విద్యావివాదంబునకు రప్పించి యోడించుచుండునప్పుడు నాసఖీజనంబు; లితరదేశాగతులవలన మదనసేనవిద్యావిశేషంబునకును రూపరేఖాతిశయంబునకుం దగినవాఁడు కళాచంద్రుండు గాని యితరుఁడు గాఁ డనునుడువులు విని వచ్చి నా కప్పుడప్పుడు చెప్పుచుండువారు. నాకును నిన్నుం గనుంగొన నాస జనియించియుండె. నాకులదేవతలయనుగ్రహంబున నాకు నీవు లభించితివి. ఇఁక నిన్నుం బాసియొకనిమిషంబేని యోర్వం జాల. ఏఁ జేసియుండుమంత్రపురశ్చర్యాఫలంబు నీ కొసంగెదను. అది నిర్హేతుకముగఁ జేయంబడినది గాన ననంతఫలప్రదంబై యొసంగునది; యిప్పుడు సహేతుకత్వప్రతీతి వొడమకతంబునఁ గడునైశ్యంబ ఫలంబుంగూర్చు. దీనంజేసి నీవు దేవిదయావిశేషంబు వడసి నన్నానందవారిధిం దేల్పంగలవు.

అని తనమంత్రపురశ్చర్యాఫలంబు ధారవోసెను.

మహాకాళి, ప్రవేశించి, కళాచంద్రునిం గాంచి,,

ఓవత్సా! కళాచంద్ర నీప్రియురా లగుమదనసేన బహుకాలమునుండి నన్నుం గొలుచుచు సర్వవిద్యాధికుం డగుపతిఁ బడయం గోరి భక్తి సలుపుచున్నది. ఇక్కన్య యింతకుంబూర్వ మనుభవించుచుండిన మహాదుఃఖంబుం గాంచి కరుణాయత్తచిత్తనై

దీని మనోరథంబు సంపాదింపం దలంపుఁ గొని మదీయమంత్రపురశ్చర్యా ఫలంబును ఫలనిక నేతావృత్తింజేసినదగుటచేత దేవతానుగ్రహంబుం గడుఁబైకొంచ గణించుకాని నీరాజపుత్రి నీ కొంసంగుడు నీకు నే సాక్షాత్కరించితిని. ఏను నీ సాధితమంత్రదేవతను గాళిని. నీకుం గోరినవరంబులీఁ జనుదెంచితి. మదనుగ్రహంబునఁ జతుర్విద్యలు నీ కవగతంబు లగు.

మదనసేనయుఁ గళాచంద్రుఁడును, ఆశ్చర్యపడుచు, సర్వాంగీణభూతలంబుగఁ బ్రణమిల్లిరి.

కళాచంద్రుఁడు భక్తిప్రశ్రయంబులతో సంజలిబంధంబుఁ గావించుకొని,,

## * శ్యామలాదండకము.

---

*శ్యామలాదండకము అనఁగా=మాతంగీదేవతను వర్ణించుదండకము అని యర్థము. శ్యామలాదేవతయే మాతంగీదేవత. మంత్రరత్నాకరగ్రంథమున బాలాలఘుశ్యామలామంత్రకథనతరంగమందు.

శ్లో. న్యాసా నేవంవిధా న్కృత్వా మాతంగీ మానసే స్మరేత్,
సుధార్ణవాంతరీపస్థ రత్నమందిరమధ్యగే.

ధ్యానం. మాణిక్యాభరణాన్వితాం స్మితముఖీం నీలోత్పలాభాంబరాం,
రమ్యాలక్తకలిప్తపాదకమలాం నేత్రత్రయోల్లాసినీం,
వీణావాదనతత్పరాం సురనుతాం కీరచ్ఛదశ్యామలాం,
మాతంగీం శశిశేఖరా మనుభజే తాంబూలపూర్ణాననాం.
లక్షం జపే న్మధూకోత్థైః జుహుయా దయుతం శుభైః,
మాతంగీప్రోదితే పీఠే లఘుశ్యామాం ప్రపూజయేత్.

అనుచోట్లఁ జిలుకఱెక్కలరంగువంటి దేహచ్ఛాయగలుగుటంబట్టి శ్యామల యనియు శ్యామార్థమే శ్యామ యనుపదము దెల్పుచున్న దనియు నేర్పడుటయే గాక మాతంగీప్రోదితమయినపీఠంబున శ్యామలనుబూజింపనగు ననుటచే మాతంగీశ్యామలల కేకత్వము సువ్యక్త మయ్యెడి. మఱియుః శ్లో॥ వాణీ శుకప్రియా జేంతా విద్మహే మీనకేతనః। కామేశ్వరీ ధీమహీతి తన్నశ్శ్యామా ప్రచోదయాత్ ॥ అను మాతంగీగాయత్రియందు శ్యామలాపదమునే మాతంగీపదమునకుఁ బర్యాయముగఁ బ్రయోగించియుండుటవలనను దానిమీఁదట శ్లో॥ ఏషోదితా తు మాతంగీగాయత్రీ సర్వసిద్ధిదా,, అనుశ్లోకమున శ్యామాఘటిత మగు దానిని మాతంగీగాయత్రి యని చెప్పుటచేతను మాతంగియు శ్యామలయు నొక్కతెయే యని సిద్ధించుచున్నది.

## స్తోత్రము.

1. మాణిక్యవీణా ముపలాలయంతీం మదాలసాం మంజులవాగ్విలాసాం,
మహేంద్రనీలద్యుతికోమలాంగీం మాతంగకన్యాం మనసా స్మరామి.

2. చతుర్భుజే చంద్రకళావతంసే కుచోన్నతే కుంకుమరాగశోణే,
పుండ్రేక్షుపాశాంకుశపుష్పబాణహస్తే నమస్తే జగదేకమాతః

3 మాతా మరకతశ్యామా మాతంగీ మధుశాలినీ,
కుర్యాత్కటాక్షం కల్యాణి కదంబవనవాసినీ.

---

1. మాణిక్యవీణాం=మణులు చెక్కిన వీణెయును, ఉపలాలయంతీం=వాయించునదియును, మదాలసాం=యౌవనమదముచే సొక్కుచుండునదియును, మంజులవాగ్విలాసాం=మనోజ్ఞమగు వాగ్వైఖరిగలదియును, మహేంద్రనీలద్యుతికోమలాంగీం=ఇంద్రనీలమణులకాంతివంటి కాంతి చేనందమైయొప్పు సంగంబులుగలదియును, నైన; మాతంగకన్యాం=మతంగమునికన్యకను, మనసా=మానసంబున, స్మరామి=చింతించెదను.

మతంగస్యమునేరపత్యం స్త్రీ మాతంగి, యని శబ్దార్థకల్పతరువునఁ జెప్పఁబడియున్నది. కాన మతంగుఁడనుమునికిం గూఁతురని యొప్పుచున్నది. మతంగశబ్దమే మాతంగ అనియగును. కాన మాతంగుఁడనఁగా మతంగుఁడే. అతని కన్యయని యర్థము

మాతంగి మతంగమునికన్యక యనుటకును ఈమెయే శ్యామల యనుటకును ప్రమాణము.

సౌభాగ్యలక్ష్మీకల్పమునందు స్కందేశ్వరసంవాదమున దశమపటలమునందు,,
శ్లో. ఛందో నుష్టుప్ తథా ప్రోక్తం దేవతా శ్యామలాంబికా। అంగన్యాసం కరన్యాసం కుర్యాత్తారత్రయేణతు। జననీంజగతాం ధ్యాయే న్మతంగమునికన్యకాం,, అని.

2. చతుర్భుజే = నాలుగుభుజములుగలదానా! చంద్రకళావతంసే=చంద్రరేఖను శిరోభూషణముగఁ దాల్చియుండుదానా! కుచోన్నతే = గొప్పబిగువుగుబ్బలుగలదానా! కుంకుమరాగశోణే=కాశ్మీరంపురక్తకాంతిచే నెఱుపుమీఱినదానా! పుండ్రేక్షు, పాశాం, కుశ, పుష్ప, బాణ, హస్తే=తెల్లదామర, చెఱకు, పాశము, అంకుశము, పుష్పములు, బాణములు హస్తముల ధరించుకొన్నదానా! జగదేకమాతః=జగములకు మొదటితల్లీ! తే=నీకు. నమః=నమస్కారము.

3 మరకతశ్యామా=మరకతమణివలె నల్లనిదియును, మధుశాలినీ=మదిరాఘూర్ణితయును, కదంబవనవాసినీ=కడిమిచెట్లతోఁటయందు వసించునదియును, కల్యాణీ=మంగళమొసఁగునదియును, నైః మాతా=తల్లియైయొప్పు. మాతంగీ = మాతంగి, కటాక్షం కుర్యాత్=కటాక్షముంచుఁగాత.

4. జయ మాతంగతనయే జయ నీలోత్పలద్యుతే,
జయ సంగీతరసికే జయ లీలాశుకప్రియే.

దండకము.

1. జయజనని 2. సుధాసముద్రాంతరుద్యన్మణిద్వీపసంరూఢబిల్వాటవీమధ్యకల్పద్రుమాకల్పకాదంబకాంతారవాసప్రియే 3. కృత్తివాసఃప్రియే 4. సాదరారబ్ధసంగీతసంభావనాసంభ్రమాలోలనీపస్రగాబద్ధచూలీసనాథత్రికే 5. సానుమత్పుత్రికే 6. శేఖరీభూతశీతాంశురేఖామయూఖావలీనద్ధసుస్నిగ్ధనీలాలకశ్రేణిశృంగారితే 7. లోకసంభా

4 మాతంగతనయే=మాతంగునికూతురా! జయ=ఒప్పుము. నీలోత్పలద్యుతే=నల్లకలువలవంటి కాంతిగలదానా! జయ=వర్ధిల్లుము. సంగీతరసికే=గానరసమెఱింగినదానా! జయ= ఎసంగుము. లీలాశుకప్రియే=క్రీడాశుకమునందుఁ బ్రియముగలదానా! జయ=జయమునొందుము.

1. జనని=ఓతల్లీ! జయ=జయంబు నొందుదువుగాత. ఈజయ అనుపదము ప్రీతిశక్త్యాద్యర్థసంతేనచానందితే, యను సంబోధనముదనుక నమవర్తించుకొనఁదగినది.

2. సుధా . . . ప్రియే:—సుధాసముద్రాంతరుద్యన్మణిద్వీప=అమృతసముద్రమునడుమఁ బొడమెడుమణిద్వీపమునందు సంరూఢ=మొలచిన, బిల్వాటవీ=బిల్వకాననపు, మధ్య=నడుమనుండెడు, కల్పద్రుమ=కల్పకవృక్షములు, ఆకల్ప=అలంకారముగాఁగల, కాదంబకాంతార=కదంబవనమున, వాస=వసించుటకు, ప్రియే=ప్రియముగలదానా! జయ. ఇక్లైమీఁదటను.

3 కృత్తివాసః ప్రియే=శివునికిఁబ్రియురాలా!

4. సాద. . త్రికే :—సాదర = ఆదరముతో, ఆరబ్ధ = ఉపక్రమింపంబడిన, సంగీత= గానమును, సంభావనా=శ్లాఘించుటవలన, లోల=కదలునట్టి, నీపస్రక్=కదంబపుష్పమాలికచే, ఆబద్ధ=చుట్టంబడిన, చూళీ=కీల్జడతో,సనాథ=కూడిన, త్రికే=నితంబోపరిదేశముగలదానా!

5. సానుమత్పుత్రికే=పర్వతమునకుఁగూఁతురైనదానా !

6 శేఖ...రితే:— శేఖరీభూత = శిరోభూషణమై యుండు, శీతాంశురేఖా= చంద్రరేఖయొక్క, మయూఖావలీ=కాంతిపుంజముచే,నద్ధ=ప్రాప్తములయిన,సుస్నిగ్ధ= కరమునునుపుమీఱిన, నీలాలకశ్రేణి = నల్లనిముంగురులగుంపులచే, శృంగారితే=అలంకరింపంబడినదానా !

7. లోకసంభావితే=జనులచేతఁగొనియాడంబడినదానా!

...తే 8. కామలీలాధనుస్సన్నిభభ్రూలతాపుష్పసందేహకృచ్చారుగోరోచనాపంకకేళీలలామాభిరామే 9. సురామే 10. రమే 11 ప్రోల్లసద్వాలికామౌక్తికశ్రేణికాచంద్రికామండలోద్భాసిగండస్థలన్యస్తకస్తూరికాపత్రరేఖాసముద్భూతసౌరభ్యసంభ్రాంతభృంగాంగనాగీతసాంద్రీభవన్మంత్రతంత్రీస్వరే 12 భాస్వరే 13. వల్లకీవాదనప్రక్రియాలోలతాళీదళాబద్ధతాటంకభూషావిశేషాన్వితే 14 సిద్ధసమ్మానితే. 15. దివ్యహాలామదో

---

8. కామ . . . రామే :—కామలీలాధనుస్సన్నిభభ్రూలతాపుష్ప సందేహకృత్=మన్మథునియొక్క లీలాచాపమునకుసమానము లగుకనుబొమ లనెడితీవెలకుం బొడమినపుష్పమో యనుసందేహమును గలిగించునట్టి, చారుగోరోచనాపంక కేళీలలామ = సుందరమగుగోరోచనాపంకమున నుంచఁబడినవిలాసంపునొసటిబొట్టుచే, అభిరామే = మనోజ్ఞురాలా!

9. సురామే=ఉత్తమురాలైనకాంతా !

10. రమే=లక్ష్మీరూపిణీ!

11. ప్రోల్ల. . .స్వరే:—ప్రోల్లసద్వాలికామౌక్తికశ్రేణికాచంద్రికామండల= కరముకులుకు లొలుకు బావిలీల ముత్తియంబులగుంపుల తెల్లనికాంతులచేఁబొలుచు, గండస్థల=చెక్కిళులయందు, న్యస్త=వ్రాయఁబడిన, కస్తూరికాపత్రరేఖా=కస్తూరిచే వ్రాయఁబడినమకరికాపత్రములనుండి సముద్భూత=పొడమిన, సౌరభ్య=పరిమళమునకు,సంభ్రాంత=తత్తఱపడునట్టి, భృంగాంగనా=ఆఁడుతుమ్మెదల, గీత=గానముచే, సాంద్రీభవత్=అధికమగుచున్న, మంత్రతంత్రీస్వరే=మంత్రవీణియయొక్క స్వరముగలదానా !

12. భాస్వరే=ప్రకాశమానురాలా !

13. వల్ల. . .న్వితే :—వల్లకీవాదనప్రక్రియాలోల = వీణవాయించుతెఱంగునం గదలునట్టిదియు, తాళీదళాబద్ధ = తాటాకుచేఁజేయంబడినదియునగు, తాటంకభూషావిశేష=కమ్మ లనుసొమ్ముతో, అన్వితే=కూడినదానా !

14. సిద్ధసమ్మానితే=సిద్ధులచే సమ్మానింపఁబడినదానా !

15. దివ్య. . . . . .త్పలే :—దివ్య=దేవతాయోగ్యమగు, హాలా=మదిరవలనఁ గలిగిన, మద = మత్తుచే బొడమెడు, ఉద్వేల = మేరమీఱిన, హేలా=విలాసములచే, లసత్=వెలుంగునట్టి, చక్షుః=కన్నులయొక్క, ఆందోళనశ్రీ=కూరుకుపాటుతోఁగలసిన తిరుగుడుపడుసొంపుచే, సమాక్షిప్త=చెదరిన, కర్ణైకనీలోత్పలే=ఒంటి చెవిమీఁది నల్లకలువగలదానా ! మదిరామదమున ఘూర్ణితమగులోచనపుంగాంతిచేత నొకచెవిమీఁది కలువపూవునకుకాంతి యాక్షిప్తమగుచున్నదని భావము.

ద్వేలహేలాలసచ్చక్షురాందోళనశ్రీసమాక్షిప్తకర్ణైకనీలోత్పలే 16. పూరితాశేష లోకాభివాంఛాఫలే 17. స్వేదబిందూల్లసత్ఫాలలావణ్యనిష్యందసందోహసందేహకృన్నాసికామౌక్తికే 18. సర్వమంత్రాత్మికే 19. కుందమందస్మితోదారవక్త్రస్ఫురత్పూగ కర్పూరతాంబూలఖండోత్కరే 20. శ్రీకరే 21. కుందపుష్పద్యుతిస్నిగ్ధ దంతావళీ నిర్మలాలోల కల్లోలసమ్మేళన స్మేరశోణాధరే 22. చారువీణాధరే. 23. సులలితనవ

---

16. పూరి ...... ఫలే :— పూరిత = సమగ్రముగానీఁబడిన, అశేషలోక వాంఛాఫలే=ఎల్లజనులకోరికలపంటలు గలదానా !

17. స్వేద...... క్తికే :— స్వేదబిందు=చిఱుచెమట బొట్లతో, ఉల్లసత్ = ఒప్పుమిగులు, ఫాల=నొసటి, లావణ్యనిష్యంద=లావణ్యపుంజాలల, సందోహ=కుప్పలనియెడు, సందేహకృత్=సందియమును గలిగించునట్టి, చారు=మనోహరమగు, నాసికా మౌక్తికే=ముక్కుముత్తియము గలదానా ! ముక్కుముత్తియము చిఱుచెమటబొట్లతోఁ గరఁగి జాఱుఫాలలావణ్యబిందుసందోహమో యనఁ దనరుచున్నదియని భావము.

18. సర్వమంత్రాత్మికే=సమస్తమంత్రమయురాలా !

19. కుంద......త్కరే :— కుందమందస్మితోదార = మొల్లలకాంతిం గొల్లలాడుచిఱునగవు దేఱుటం జేసి కరము మనోహరంబైయొప్పు, వక్త్ర = మొగమున, స్ఫురత్=అమరునట్టి, పూగకర్పూరతాంబూలఖండ=పోఁకపలుకులయు కర్పూరఖండంబులయు తమలంపుమడుపులయు, ఉత్కరే=తెగలుగలదానా!

20. శ్రీకరే=సంపత్కరురాలా !

21. కుంద......ణాధరే :— కుందపుష్పద్యుతిస్నిగ్ధ=మొల్లమొగ్గల యాకారముతో నునుపుమీఱు, దంతావళీ=పలువరుసల, నిర్మలాలోలకల్లోల=నిద్దంపువన్నెలం జెన్నుమిగులుచుంగదలు కాంతితరంగంబులయొక్క, సమ్మేళన = చేరికగల, స్మేర = చిఱునగవుతో నొప్పు, శోణాధరే=ఎఱ్ఱని పెదవిగలదానా ! మొల్లమొగ్గలవంటి పలువరుస యించుక వెలికిందేలి యున్నట్టు లగుతిలేనగవు నవ్వఁగా నా నగవుయొక్క కాంతులు కొంచెము వలించుచు నెఱ్ఱని మోవిపయి నోలలాడుచున్నవి యని భావము.

22. చారువీణాధరే=మనోహర మగు వీణియను దాల్చియుండుదానా !

23. సుల...ధరే :— సులలితనవయౌవనారంభ=కడు మనోజ్ఞమగు నభినవతారుణ్యారంభమనియెడు, చంద్రోదయ = చంద్రోదయముచేత, ఉద్వేల = మేరమీఱు, లావణ్యదుగ్ధార్ణవ = లావణ్యమనియెడి పాలమున్నీటినుండి, ఆవిర్భవత్ = పొడముచున్నట్టి, కంబు=శంఖమునకుంగల, బిబ్బోక=విలాసములను, హృత్=అపహరించెడు, కంధరే =

యౌవనారంభచంద్రోదయోద్వేలలావణ్యామృతార్ణవాంతఃకంబు బింబోకవ్యాస్తంథరే 24. మంథరే 25. బంధురచ్ఛన్నవీరాదిభూషాసముద్యోతమానానవద్యాంగశోభే 26. శుభే 27. రత్నకేయూరరశ్మిచ్ఛటాపల్లవప్రోల్లసద్దోర్లతా రాజితే 28. యోగిభిః పూజితే 29. విశ్వదిఙ్మండలవ్యాప్తమాణిక్య తేజస్స్ఫురత్కంకణాలంకృతే 30. సాధుభిస్సత్కృతే 31. వాసరారంభవేళాసముజ్జృంభమాణారవింద ప్రతిచ్ఛన్నపాణిద్వయే 32. సంతతోద్యద్దయే 33. దివ్యరత్నోర్మికా దీధితిస్తోమసంధ్యాయమానాంగులీ పల్లవో

---

కంఠముగలదానా! కంఠము; సారెనారెకుఁదోఁచునభినవతారుణ్యోదయ మను చంద్రోదయమువలన నీమెయొక్కలావణ్య మనియెడిసుధాసముద్ర ముప్పొంగఁగా నందుం బొడమెడు శంఖమో యనునట్లు వెలుంగుచున్నదని భావము.

24 మంథరే=యౌవనమదమున నలస యయినదానా!

25. బంధు...శోభే:—బంధురచ్ఛన్నవీరాదిభూషా=సొంపులుగుల్కు నంగళ్ళమొదలగుసొమ్ములచే, సముద్యోతమాన=కడుఁ బ్రకాశించు, అనవద్య = దోషము లేని, అంగశోభే=అవయవములకాంతిగలదానా!

26. శుభే=మంగళమయురాలా!

27. రత్న......రాజితే:—రత్నకేయూరరశ్మిచ్ఛటా = రతనంపు బాహుపురులమెఱుంగుల గుము లను, పల్లవ=చిగుళ్లచే, ప్రోల్లసత్=కడుసొంపు సంపాదించు, దోర్లతా=బాహులతలచేత, రాజితే=ప్రకాశించుదానా! బాహువు లను తీవెలకుఁ గేయూరమణికాంతిరేఖలు పల్లవములభాతిం దోఁచుచున్నవని భావము.

28 యోగిభిః పూజితే=యోగనిష్ఠులచేత నర్చింపంబడుదానా!

29 విశ్వ......కృతే:—విశ్వదిఙ్మండల = సమస్త మగుదిశాసమూహము నందును, వ్యాప్త=కలయంబఱవిన, మాణిక్య తేజః=మణులతేజంబుచే, స్ఫురత్=వెలుంగునట్టి, కంకణ=చేతికడియములచే, అలంకృతే=అలంకరింపంబడినదానా!

30. సాధుభిః=సాధువులచే, సత్కృతే=పూజింపఁబడినదానా!

31. వాస.. ... ...ద్వయే:—వాసరారంభవేళా = దినోదయకాలమునందు, సముజ్జృంభమాణ = వికసించునట్టి, అరవింద = ఎఱ్ఱతామరపువ్వులతో, ప్రతిచ్ఛన్న= సాటియగు, పాణిద్వయే=చేదోయిగలదానా!

32. సంతతోద్యద్దయే=ఎల్లప్పుడునావిర్భవించుచుండుదెల్రపాయముగలదానా!

33. దివ్య...వలే:—దివ్యరత్నోర్మికాదీధితిస్తోమ=దేవతార్హము లగుమణులు చెక్కిన ముద్దుటుంగరపుఁగాంతిపుంజముచే,సంధ్యాయమాన=సంజయైతోఁచెడు, అంగుళీ

ద్యన్నఖేందుప్రభామండలే 34. ప్రోల్లసత్కుండలే 35. తారకారాజినీకాశహారా
వలిస్మేరచారుస్తనాభోగభారానమన్మధ్యవల్లీ వలిచ్ఛేదవీచీసముల్లాససందర్శితాకార
సౌందర్యరత్నాకరే 36. శ్రీకరే 37. హేమకుంభోపమోత్తుంగవక్షోజభారావనమ్రే 38.
త్రిలోకావనమ్రే 39. లసద్వృత్తగంభీర నాభీసరిత్తీరశైవాలశంకాకరశ్యామరోమావళీ

---

పల్లవ = చిగుళ్లకొప్పైనచేతివ్రేళులవలన, ఉద్యత్ = పొడమునట్టి, నఖేందు ప్రభా మండలే = నఖచంద్రఘృణిభాపుంజముగలదానా! ముద్దుటుంగరములం జెక్కంబడియుండు రత్నములకాంతులు వర్వినయెఱ్ఱనివ్రేళులు సంధ్యారాగములవలెఁదోఁప నందునఖకాంతి మండలముచంద్రోదయమయినట్టులొప్పుచున్నదని భావము

34. ప్రోల్లసత్కుండలే = కడునొప్పిదంబుగల కుండలములుగలదానా !

35. తార . . . కరే:—తారకారాజినీకాశ = నక్షత్రములవరుసతోసరిపోలు, హారావళి = ముత్తియంపుసరులగుములయొక్క, స్మేర = వికాసముచేత, చారు = మనోహరమగు, స్తనాభోగ = గుబ్బలనిబ్బరమునైన, భార = వ్రేఁగుచేత, ఆనమత్ = ఇంచుకవంగిన, మధ్యవల్లీ = కౌనుదీవియ యందలి, వలిచ్ఛేద = కడుపుమీఁదిముడుతల విభాగములయొక్క, సముల్లాస = నిక్కుచేత, సందర్శిత = కాన్పింపఁబడిన, సౌందర్య = సౌందర్యమనియెడి, రత్నాకరే = సముద్రముగలదానా ! నక్షత్రపఙ్క్తికిసమానమగు ముత్యాలపేరులుదాల్చికొనియుండుటంబట్టి సొంపుమీఱుచున్నవి గుబ్బలు. అట్టి గుబ్బలనిబ్బరంపువ్రేఁగున వలియంబాఱుచు నించుక వంగునట్టికౌనుదీవియను నిక్కించుకొనునప్పుడు కడుపుమీఁదిముడుతలు వెలువడుచున్నవి. ఆముడుతలు సౌందర్యసముద్రమునకు తరంగములు అట్టియా తరంగములు గాన వచ్చుటంజేసి సౌందర్యరత్నాకరము పొంగివచ్చునట్లున్నదని భావము.

36. శ్రీకరే = సంపత్కారిణీ !

37. హేమ.. నమ్రే: —హేమకుంభోపమ=బంగరుకుండలకెనయయి, ఉత్తుంగ=పొడవుమీఱిన, వక్షోజభార = కుచభారముచే, అవనమ్రే=కొంచెమువంగినదానా!

38. త్రిలోకావనమ్రే = ముల్లోకములవారిచే సేవింపంబడుదానా !

39. లస . . . షణే:—లసద్వృత్తగంభీర = పొలుపుమిగిలిబటువైలోఁతుగలదియగు, నాభీ = పొక్కిలియనెడి, సరిత్ = హ్రదముయొక్క, తీర = గట్టునమొలిచిన, శైవాల = తీఁగెప్రాఁచియోయను, శంకాకర = సందియముంగలిగించు, శ్యామ = నల్లని, రోమావళీ = నారు, భూషణే = అలంకారముగాఁగలదానా ! అందముమీఱి గుండ్రనయిలోఁతుగలిగియుండుపొక్కిలియే హ్రదము. నారు దానిగట్టున నుండునాఁచుతీవియవలె నొప్పుచున్నది యని భావము.

భాషణే 40. మంజుసంభాషణే 41 చారుశింజత్కటీసూత్రనిర్భర్త్సితానంగలీలాధను శ్శింజినీడంబరే 42 దివ్య రత్నాంబరే 43 పద్మరాగోల్లసన్మేఖలాభాస్వరశ్రోణి శోభాజితస్వర్ణభూభృత్తలే 44 చంద్రికాశీతలే 45 వికసితనవకింశుకాతామ్రది వ్యాంశుకచ్ఛన్నచారూరుశోభాపరాభూతసిందూరశోణాయమానేంద్ర మాతంగహస్తా ర్గళే 46. శ్యామళే 47. కోమలస్నిగ్ధనీలోత్పలాపాదితానంగతూణీరశంకాకరోద్దా

---

40. మంజుసంభాషణే = మనోజ్ఞముగ మాటలాడుదానా.

41. చారు..బరే:—చారుశింజత్ =మనోహరముగ శబ్దించునట్టి, కటీసూత్ర= మొలనూలిచేత, నిర్భర్త్సిత = బెదరుపెట్టఁబడినదగు, అనంగలీలాధనుశ్శింజినీ = మన్మథునిలీలాచాపగుణముయొక్క, డంబరే = ఆడంబరముగలదానా ! కటీతటంబునం దాలిచియుండు రశనాదామముయొక్క నులివు మన్మథునిలీలాధనుర్గుణధ్వానమును మీఱియున్నదని భావము.

42. దివ్యరత్నాంబరే = దేవతాస్వామగురతనంపువలువదాల్చినదానా !

43 పద్మ...త్తలే:—పద్మరాగ = పద్మరాగమణులచే, ఉల్లసత్ = ప్రకాశించెడు, మేఖలా = ఎనిమిదిపేటలుగల మొలనూలిచే, భాస్వర = అందముమీఱు, శ్రోణీ = నితంబముల, శోభా = ఒప్పిదముచే, జిత = కీడ్పఱచఁబడిన, స్వర్ణభూభృత్తలే = బంగరుకొండసెత్తములుగలదానా ! పద్మరాగమణులు సెక్కినయెనిమిదిపేటల మొలనూలునుపైనధరించియుండు నితంబబింబములు బంగరుకొండసెత్తములవోలెంగా న్పించుచున్నవని భావము.

44. చంద్రికాశీతలే = వెన్నెలవలెఁ గన్నులకుఁ జల్లనైనదానా !

45. వికసితనవకింశుక = వికసించిన క్రొత్తమోదుగువలె ఆతామ్ర = అంతట యెఱుపుమీఱు, దివ్యాంశుక = ఉత్తమమగు వలువచే, ఛన్న=ఆవృతములయిన, చారూరుశోభా = అందపుఁదొడలమెఱుంగులచే, పరాభూత = అవమానింపంబడిన, సిందూర శోణాయమానేంద్రమాతంగహస్తార్గళే = సిందూరమలంకుటంజేసియెఱుపుగలయయుఁ గడి యమ్రానునకుందీటగుచుండునైరావతపుఁదొండముగలదానా ! అప్పుడువికసించినమోదుగుపూలవలె నొప్పునెఱ్ఱని దివ్యవస్త్రముచే నావృతములగుటంజేసి తొడలు సిందూరమలందియుండు ; నింద్రునిమాతంగముయొక్క యర్గళములవంటి తొండములకు దీటై యున్నవియని భావము.

46 శ్యామళే = చిలుకఱెక్కలరంగువంటిదేహచ్ఛాయగలదానా !

47. కోమ...లతే:—కోమలస్నిగ్ధ = అందంపునునుపుగల, నీలోత్పల = నల్లకలువలచే, ఆపాదిత = కలిగింపంబడిన, అనంగతూణీరశంకాకర = మన్మథుని యంబుల

మజంఘాలతే 48. చారులీలాగతే 49. నమ్రదిక్పాలసీమంతినీకుంతళస్నిగ్ధనీలప్రభాపుంజసంజాతదూర్వాంకురాశంక సారంగసంయోగరింఖన్నఖేందూజ్జ్వలే 50 ప్రోజ్జ్వలే. 51 దేవ దేవేశ, దైత్యేశ, యక్షేశ, భూతేశ, వాగీశ, కోణేశ, వాయ్వగ్నికోటీరమాణిక్యసంఘృష్టబాలాతపోద్దామలాక్షారసారుణ్యలక్ష్మీగృహీతాంఘ్రిపద్మద్వయే. 52.అద్వయే 53 సురుచిర నవరత్న పీఠస్థితే 54. సుస్థితే 55 శంఖపద్మద్వయోపాశ్రితే

---

పాదులోయను సందియంబుగలిగించెడు, ఉద్దామ=గొప్పవియగు, జంఘాలతే=తీవియలవంటి పిక్కలు గలదానా! జంఘాలతికలు మన్మథుని కందంపునల్లకలు వలచేఁ జేయఁబడిన తూణీరములో యన్నట్టు లున్నవనుట భావము,

48. చారులీలాగతే=మనోజ్ఞమగు లీలాగమనంబుగలదానా!

49 నమ్ర..జ్వలే :—నమ్రదిక్పాలసీమంతినీ = నమస్కరించునట్టి దిక్పాలకాంతలయొక్క, కుంతళ=ముంగురులయొక్క, స్నిగ్ధ=నునుపుమీఱిన, నీలప్రభా=నల్లనికాంతుల, పుంజ=గుంపులవలన, సంజాత=కలిగిన, దూర్వాంకురాశంక=గఱికపోఁచలనియెడు సందియము నొందిన, సారంగ = (చందురునిలోనుండు) జింకయొక్క, సంయోగ=కూడికచేత, రింఖత్=ఒప్పుమిగులు, నఖేందు=నఖచంద్రునిచే, ఉజ్జ్వలే=ప్రకాశించుదానా! దిక్పాలకకామినులు ప్రణామము సేయునప్పుడు వారికుంతలముల కాంతిపుంజము దేవిచరణంబులపైఁబర్వఁగా నదిగాంచి లీలా సారంగము పచ్చనిగఱికపోఁచలని శంకించి చరణముల నాకుటకు రాఁగా నా సారంగము చంద్రునిలోని సారంగమనియు నదిరాఁగా దానితోఁ గదలివచ్చినచందరునిం బోలె నఖంబులొప్పుచున్నవనియు భావము.

50. ప్రోజ్వలే=కడునందమగు కాంతిగలదానా!

51. దేవ.....ద్వయే :—దేవ = దేవతలయు, దేవేశ = దేవపతులయు, దైత్యేశ=దైత్యనాథులయు, యక్షేశ=యక్షనాథులయు, భూతేశ=భూతపతులయు, వాగీశ=సరస్వతీనాథునియు, కోణేశ = మూలలకధిపతు లయినవారలయు, వాయు=మారుతునియు, అగ్ని=అగ్నిదేవునియు, కోటీర=కిరీటములందలి, మాణిక్య=మణులచే, సంఘృష్ట=ఒరయఁబడినదియై, బాలాతపోద్దామ = రేపటియెండవలె మించునట్టి, లాక్షారస=లత్తుకయొక్క, ఆరుణ్యలక్ష్మీ=ఎఱుపుం బెల్లిదంబున, గృహీత=కమ్మకొనంబడిన, అంఘ్రిపద్మద్వయే=అడుగుందమ్ములదోయిగలదానా!

52 అద్వయే=సాటిలేనిదానా!

53. సురుచిరనవరత్నపీఠస్థితే=అందమగు నవరత్నసింహాసనంబునను౦డెడుదానా!

54. సుస్థితే=చక్కనిదానా! [దానా!

55. శంఖపద్మద్వయోపాశ్రితే=శంఖనిధిపద్మనిధులజంటచే నాశ్రయింపఁబడిన

56. ఆశ్రితే 57. దేవీదుర్గావటక్షేత్రపాలైర్యుతే 58. మత్తమాతంగకన్యాసమూహాన్వితే 59. భైరవైరష్టభిర్వేష్టితే 60. దేవీవామాదిభిస్సంశ్రితే 61. లక్ష్మ్యాదిశక్త్యష్టకాసేవితే 62 భైరవీ సంవృతే 63. పంచబాణేన రత్యాచ సంభావితే. 64. ప్రీతశక్త్యా వసంతేనచా నందితే 65. భక్తిభాజాం పరంశ్రేయసే కల్పసే 66. ఛందసా మోజసే భ్రాజసే 67. యోగి

---

56, ఆశ్రితే=భక్తులాశ్రయించియుండుదానా!

57. దేవీదుర్గావటక్షేత్రపాలైః=దుర్గాదేవితో, వటవృక్షముతో, క్షేత్రపాలకులతో, యుతే=కూడినదానా !

58. మత్తమాతంగకన్యాసమూహాన్వితే=యౌవనమదమునం బొదలుమతంగముని కన్యకలగుంపులు బలసికొని యుండుదానా!

59. అష్టభిః భైరవైః = ఎనమండ్రు భైరవులచే, వేష్టితే = పరివేష్టింపఁబడిన దానా !

ఉన్మత్తుఁడు, కపాలుఁడు, భీషణుఁడు, డమరుభాస్కరుఁడు, రవిభక్షకుఁడు, కాలుఁడు, చండుఁడు, మహోన్మథానుఁడు, అనువారు భైరవు లెనమండ్రుగురు.

60. దేవీవామాదిభిః=వామాదేవిప్రముఖులచే,సంశ్రితే=ఆశ్రయింపంబడినదానా!

61. లక్ష్మ్య . . . . . . . వితే=లక్ష్మ్యాది = లక్ష్మీప్రముఖులగు, శక్త్యష్టక= ఎనమండ్రుగురుశక్తులచేత=ఆసేవితే = సేవింపబడుచుండుదానా ! లక్ష్మి, చాముండి, బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, మాహేంద్రి అనువారు ఎనమండ్రుగురు శక్తులు.

62. భైరవీసంవృతే=భైరవీదేవతలచేఁ జుట్టుకొనంబడినదానా,

63. పంచబాణేన=మన్మథునిచేతను, రత్యాచ=రతీదేవిచేతను, సంభావితే=గౌరవింపంబడినదానా !

64. ప్రీతశక్త్యా = ఇష్టపడినశక్తిగలవాఁడగు, వసంతేనచ=వసంతునిచేత, ఆనందితే=సంతసింపబడినదానా !

65. భక్తిభాజాం=భక్తిగలవారలకు, పరం=మిగుల, శ్రేయసే = మేలుకొఱకు, కల్పసే=వలంతివయ్యెదవు.

66. ఛందసాం=వేదముల, ఓజసే=ప్రకాశమునకు, భ్రాజసే=ప్రకాశించెదవు.

67. యోగినాం=తపస్వులయొక్క, మానసే=మానసమందు, ధ్యాయసే=ధ్యానింపంబడియెదవు.

నాంమానసే ధ్యాయసే 68. గీతవిద్యామయో గాఢతృష్ణేన కృష్ణేన సంపూజ్యసే 69 విశ్వ
హృద్యేన గద్యేన పద్యేన విద్యాధరైర్గీయసే. 70. యక్షగంధర్వసిద్ధాంగనామండలైర్మండితే
71 సర్వసౌభాగ్యవాంఛావతీభి ర్వధూభి స్సురాణాం సమారాధ్యసే 72 సర్వవిద్యా
విశేషాన్వితంచాటుగాథాసముచ్చారణాకంఠ ముల్లోలసద్వర్ణరేఖాన్వితం కోమలంశ్యా
మలోదారపక్షద్వయం తుండశోభాతిదూరీభవత్కింశుకాభం శుకంలాలయంతీమివ క్రీ
డసే 73 పాణిపద్మద్వయేనాపరేణాక్షమాలాగుణం స్ఫాటికం జ్ఞానసారాత్మకం పుస్త

---

68. గీతవిద్యామయో గాఢతృష్ణేన=గానవిద్యానుబంధమునందు దనివిచెందని, కృష్ణేన=కృష్ణునిచేత, సంపూజ్యసే=బాగుగఁ బూజింపంబడియెదవు.

69. విద్యాధరైః = విద్యాధరులచేత, విశ్వహృద్యేన=ప్రపంచమునకు మనోజ్ఞమగు, గద్యేన=గద్యముచేతను, పద్యేన=శ్లోకముచేతను, గీయసే=గానము సేయంబడియెదవు.

70 యక్షగంధర్వసిద్ధాంగనామండలైః= యక్షులయు గంధర్వులయు సిద్ధులయు ముగుదలగుంపులచే, మండితే = అలంకరింపబడినదానా !

71 సర్వసౌభాగ్య వాంఛావతీభిః=సర్వవిధసౌభాగ్యంబులుంగోరెడు, సురాణాం వధూభిః=దేవకామినులచే, సమారాధ్యసే=పూజింపంబడియెదవు,

72. సర్వవిద్యావిశేషాన్వితం=ఎల్లవిద్యావిశేషములతోఁగూడినదియు, చాటుగాథాసముచ్చారణాకంఠం = చమత్కారపద్యములుచ్చరించుకంఠంబుగలదియు, ఉల్లోలసద్వర్ణరేఖాన్వితం=విశేషించినమంచిరంగులు దేఱు రేఖలతో నొప్పునదియు. కోమలం=అందమయినదియు, శ్యామలోదారపక్షద్వయం = శ్యామలవర్ణముగలగొప్ప ఱెక్కలజంటగలదియు, తుండశోభాతిదూరీభవత్=ముక్కుయొక్క మెఱుంగునకు దూరంబగుచున్న, కింశుకాభం=మోదుగుమొగ్గలనిగ్గు గలదియు నగు, శుకం=చిలుకను, లాలయంతీమివ=బుజ్జగించునదివోలె, క్రీడసే=విహరించెదవు.

73. అపరేణ=మఱియొక, పాణిపద్మద్వయేన=కేలుందమ్మిదోయిట, స్ఫాటికం=స్ఫటికమణి నిర్మితమయిన, అక్షమాలాగుణం=జపమాలికసరమును, జ్ఞానసారాత్మకం=జ్ఞానసారమయమగు, పుస్తకం=పుస్తకమును, బిభ్రతీ=తాల్చియున్నదిగా యేన=ఎవ్వనిచే, సంచింత్యసే = చక్కగఁజింతింపంబడియెదవో ! తస్య=అట్లుధ్యానము సేయువానియొక్క, వక్త్రాంతరాత్=వదనమునుండి, గద్యపద్యాత్మికా=గద్యపద్యస్వరూపిణియగు, భారతీ=సరస్వతి, నిస్సరేత్=వెడలును. వీణెయు నొకకేలను శుకంబు నొకకేలను మఱియొకకేలుందోయిట స్ఫటికాక్షమాలయుఁ బుస్తకంబును దాల్చియుండునట్లు భావించినవాఁడు మహాకవియగు నని భావము,

కం విప్రతీయేన సంచింత్య నే తస్యపక్త్రాంతరా ద్గద్యపద్యాత్మికా భారతీనిస్సరే 74, త్వ్వం నవాశ్వ్వంసనాథాఒకృతిర్భావ్య సేసోపి లక్ష్మీసహస్రైః పరిక్రీడతే. 75. కింనసిద్ధ్యేద్వపు శ్శ్యామలంకోమలం చారుచంద్రావచూడాన్వితం ధ్యాయత 76 స్తస్యలీలాసరో వారిధి 77 స్తస్య కేళీవనం నందనం 78 తస్య భద్రాసనం భూతలం 79 తస్యగీర్దేవతాకింకరీ. 80 తస్యవాచాకరీశ్రీస్స్వయం. 81, సర్వయంత్రాత్మికే 82. సర్వమంత్రాత్మికే 83. సర్వ ముద్రాత్మికే 84 సర్వశక్త్యాత్మికే 85. సర్వవర్ణాత్మికే 86. సర్వరూపే 87. జగన్మాతృకే

---

74 త్వం=నీవు, యేనవా=ఎవ్వరిచేనేని, సనాథాకృతిః = పెనిమిటితోఁ గూడినయాకారముగలదానవుగా, భావ్యసే=చింతింపంబడియెదవో! సోపి=అట్లుధ్యానించువాఁడు, లక్ష్మీసహస్రైః=వేనవేలలక్ష్మీదేవీజనముతో, క్రీడతే=క్రీడించును. పెనిమిటితోఁగూడిన యాదేవిని భావించినవాఁడు విష్ణుపదవిని బొందునని భావము.

75. శ్యామలం=చిలుకవంటి పచ్చవన్నెగలదియు, కోమలం=మనోహరమును, చారుచంద్రావచూడాన్వితం=మనోహరుఁడగు చందమామను శిరోభూషణముగఁదాల్చినదియునగు, వపుః=ఆకారమును, ధ్యాయతః=ధ్యానమొనరించువానికి, కింనసిద్ధ్యేత్= ఏది సిద్ధింపదు.

76. తస్య=అట్లుధ్యానించెడువానికి, వారిధిః=సముద్రము, లీలాసరః=క్రీడా సరస్సగును.

77. తస్య=అతనికి, నందనం=నందనవనము, కేళీవనం = క్రీడోద్యానమగును.

78. తస్య=అతనికి, భూతలం=భూస్థలి, భద్రాసనం=భద్రపీఠమగును.

79. తస్య=అతనికి, గీర్దేవతా=సరస్వతి, కింకరీ=దాసురాలగును.

80. తస్య=అతనికి, శ్రీః=లక్ష్మి, స్వయం=తానె, వాచాకరీ=పలుకుబంటగును.

81. సర్వయంత్రాత్మికే=సకలయంత్రస్వరూపిణీ !

82 సర్వమంత్రాత్మికే=సకలమంత్రస్వరూపిణీ !

83. సర్వముద్రాత్మికే=సకలముద్రాస్వరూపిణీ !

84. సర్వశక్త్యాత్మికే=సమస్తశక్తిస్వరూపిణీ !

85. సర్వవర్ణాత్మికే=సమస్తవర్ణస్వరూపిణీ !

86 సర్వరూపే=సకలస్వరూపిణీ !

87. జగన్మాతృకే=లోకములకుండల్లియగుదానా !

88. హేజగన్మాతృకే 89. పాహిమాం 90. పాహిమాం 91. పాహిమాం 92 పాహి.

అని స్తుతించి భక్త్యవనతుండై నిలువంబడియెను.

కాళి. కడుసంతసంబుతో,,

వత్స కళాచంద్ర! నీయొనర్చినసంస్తవంబున కతులామోదంబొం దెందితిఁ భవదీయ కవితారసవిశేషంబునకు మానసంబున నలరి మహాకవి యను బిరుదనామంబు బొసంగితిని. మదనుగ్రహంబున నిట్టివిశేషంబు నీ కబ్బినందుకు నిదర్శకంబుగ నే నిది పుత కాళిదాసుండనునామంబు వహింపుము. నీవు కావ్యనాటకాలంకారాదుల నుద్ధరింప భూమియందవతరించినభారతీదేవివి గాని సామాన్యమనుష్యమాత్రుండవు గావు. ధారావతి యగుభోజభూపతి భవదీయకవితాసారసర్వస్వం బెఱింగి యపరిమితధనంబు లొసంగుచు నిన్నుం గారవించు. మఱియు భవదీయసుకవితాచాతురికి మెచ్చి పెక్కండ్రు దేశాధిపతు లగణితంబు లగుధనసంచయంబులు సమర్పింపంగలరు. కాన నిర్విచారుండవై రాజ్యతంత్రంబు నొప్పరికించి యిప్పుడు కలికాలంబున నష్టం బయిపోవున్న గీర్వాణభాష నుద్ధరింపుము. సుకవితా యద్యస్తి రాజ్యేన కిం,, అన్నట్లు సుకవితాని ర్వృత్తిజీవనోపాయంబుకన్న షష్ఠాంశవృత్తికి బాసటయై యుండుట సుఖావహంబు గామి నీ వందులకు నియ్యకొనకుము. నీవు జాతిస్మరుండవై [illegible] లగు పెక్కులు కార్యంబులు జరుపం బోయెదవు ఇంకను నీయపేక్షితం బెయ్యది? నీ వడిగిన వెల్ల నొసంగం గడంగియున్నదానను. మదనుగ్రహంబు వడసినవానికి సర్వంబు సిద్ధించు.

కాళిదాసుఁడు. ఓలోకైకజనని! ఇంతకంటె నాకుం గావలసిన దే మున్నది? అయిన నొక్కటి యడిగెద.

చం. అనుకల మీవు నన్ను సదయాత్మతఁ జూచుచు వైరిసంఘముల్,
పనుపడి చేయు నెగ్గులను భవ్యగతిం దొలఁగించి కాచుచున్,
నిను మది నెంచునప్పు డతినిర్భరసత్కరుణాత్మమూర్తివై,
కనఁబడుచు న్సమస్తనరకాంతనతాంఘ్రినిఁ జేయుచుండుమీ !

---

88. హేజగన్మాతృకే=సర్వప్రపంచోత్పత్తికిం గారణరూపమగుప్రకృతిస్వరూపిణీ

89. మాం=నన్ను, పాహి=కాపుము.

90. ,, ,,

91. ,, ,,

92. పాహి=కాపుము.

కాళి. వత్స! కాళిదాస నీప్రార్థనంబు నంగీకరించితిని. భవదభీష్టార్థంబు సమకూర్చ నప్పుడప్పుడు నీకుం గన్పడుచుందును. భక్తజనాపేక్షితప్రదానంబుకన్న నాకుం బ్రియంబు లేదు. సుఖంబున నుండుము.

అని యంతర్హిత యగునట్లు నిష్క్రాంత యయ్యె.

మదనసేన. కరముసంతసించుచు,,

ప్రాణనాథ! ఈదేవికి నీయందుఁ గలకరుణాతిరేకంబు కడు సంస్తవనీయంబు. ఇట్టి నిన్నుం బతిగాఁ బడసిననాయదృష్టంబె పొగడికొనం దగి యున్నది.

చం. అభినవమన్మథుం డనుచు నంగన లెల్లను మెచ్చురూపముక్,
విభవసముజ్జ్వలం బయినవిశ్రుతి యుం దగునాభిజాత్యముక్,
సుభగతమీయువై నుషి యు శుద్ధయశోవిభవంబు నింద్రస,
న్నిభ మగుసంపద ల్వెలయ నిన్ను నలంతుల కాని పొందఁగక్.

ఏను నాతొలిపుట్టువునం జేసినపున్నియం బెట్టిదియో! ఇట్టిసుకవికులావతంసుం జేపట్టఁ గలిగితిని. మఱియు నీవు సరస్వతీనవావతారుండ వగుటకు సందియంబు లేదు. కావేని మంత్రోపదేశమాత్రంబునన దేవి సాక్షాత్కరించి వరంబు లొసంగునే! అదియునుం గాక యిట్టిరసాస్పదం బగుసుకుమారార్థపదబంధురం బయినవచనరచనాచాతురి మనుష్యమాత్రుల కుండునే!

చం. అరుణకరప్రసారవికచాంబుజషండనికామనిర్గళ,
ద్వరమకరందబిందుఝురవైఖరిచారుపదావళీమనో,
హర మయి యొప్పునీకవిత నాస వినంగ సుధాఽబ్ధివీచికల్,
వరుసగఁ బైఁబయిం బరవి వచ్చువిధంబునఁ దోఁచె నాత్మకుక్.

ప్రాణనాథ! చిరకాలసంప్రార్థితం బగుచున్నమన్మనోరథంబు నాయర్చించుచుండిన కులదేవతయనుగ్రహంబున నిప్పుడు ఫలియించె.

కాళిదాసుండు, మహోత్సాహంబుతో,,

ఓచంచలలోచనాతిలకమా! వినుము.

చం. సురగరుడోరగప్రముఖశోభనగాత్ర లకందరానియా,
నిరుపమరూపసంపదల నివ్వటిలంగలనిన్ను మన్ననక్,
నరభువనాంబుజాలయను నర్మిలిఁ బెండిలియైతి నింక న,
చ్చెరు వగుజన్మభవ్యఫలసిద్ధి లభించెను నాకు నెచ్చెలీ.

నేపథ్యంబునవైతాళికుండు,,

చం. చెలువపుఁదీవి యామదనసేనను బెండిలియై మహోన్నతిన్,
వెలుఁగుచుఁ గాళికావరముచేత మహాకవి నైతి నింక నీ,
కులము పవిత్ర మయ్యె నతికోరికి యాస్ఫలియించె నిప్పుడీ,
జలజసఖుండు దోఁచుతఱి చయ్యనఁ దగ్గెను మేలుకోఁ గదే !

పెండియు నేపథ్యంబున నొండు వైతాళికుండు,,

చం. అమలిన మైననీయాకృతు దంతటఁ బవ్వఁగఁ జూచి నెవ్వడై,
యనుకలము న్గ్రహించు చిరు తాంబుజవైరియుఁ గ్రుంకుచున్నవాఁ,
డమరవధూపతంగసుమమాలుచున్నతి గాత్రిఁ గూడుచు,
భళిమ మిపు డొప్పదయ్యె ! ఘటభానుఁడు గొల్వఁగ మేలుకోఁగదే !

కాళిదాసుండు. ఓ ప్రాణేశ్వరీ ! దేవిసాక్షాత్కారాదిశుభపరంపరలఁ గాలంబు గడచుట యెఱుంగమైతిమి. ఇప్పుడు వేకువ యయ్యె. నీవు నాపోషకాంతుండనైయుం డునప్పుడు కర్మానుష్ఠానంబు సేయక మానుకొన్నందుకు ప్రాయశ్చిత్తంబు చేసికొని విశుద్ధిం బొరయవలసియున్నది. ఈనగరోపకంఠంబునం గలపుణ్యనదికిం జని యచట స్నానంబు సల్పి ప్రాచితంబుచేసికొని సూర్యోపస్థానాదులు దీర్చి వైళంబ వచ్చెద. మద్విరహంబున నీవు ఖిన్నతం బొందకుము.

మదనసేన. కాళిదాసుని గౌఁగిలించుకొని,,

చం. నిను నెడబాసి యొక్కత్రుటి నీరజనాయకమార్గణాళికిన్,
మనమున నోర్వఁ జాల నిఁక మానవలోకసుధామయాకృతీ,
న్ననుఁగొనకుంటి నేనిఁ త్రుటికాలము కల్పశతంబు గాఁ దగున్,
ఘనశుభకీర్తి రమ్ము వెస కాల్యసుకృత్యము దీర్చి యాపలోన్.

మఱియు నిప్పుడు,,

చం. నిను నెడఁబాయఁ బోవఁ గడు నిష్ఠుర మైనవియోగవేదనన్,
మనము మహాంధకారమున మగ్నతఁ జెందినరీతిఁ గాంచ ను,
త్తను విడె గ్రాఁగ నాగె నొకకష్టము దుర్భర మైన దిప్పుడే,
మునుకొని కల్గఁ బోవు నని మున్మను దోఁచుచునున్న దాత్మకున్.

అదియునుం గాక మన్మానసం బనిష్టాశంకి యై యుత్తలంపడియెడిని. కావున నీ వొంటి నేగకుము. ఈభవనంబునకుం గావలియుండురక్షకభటవర్గంబును వెంట బెట్టుకొని పొమ్ము. వేగ రమ్ము. నాయందుం గరుణ యుంచి యిందు బుద్ధియుంచి నిజ శోభామనోహరం బగునీనగుమొగంబు వైళంబ చూపి యాస్వాదింపఁజేయుము.

సుకేశిని. అనుకూలతవఁబడ రథముకడకుఁ ద్వరితగతిం బోవుచు నిష్క్రాంతయయ్యె.

గౌతముఁడు. వెనువెంటంజనుచు,,

ఓసీ యవన! నావచనంబున నీసుందరి రథారూఢ యయ్యె. ఏను నిది రథం బారోహించెదను. నీ వతివేగంబున నరదం బెక్కి రథ్యంబుల నడుపుము.

యవనభటుఁడు. ఓబాపనయ్యా! అట్లె యొనర్చెద.

గౌతముఁడు. సంతసంబుతో,,

ఉ. అంబుజపాణి నాకును స్వహస్తధనం బయి పొల్చె నిప్పుడే,
బింబఫలాధరిం గొనుచు భీతిల కెయ్యెడ కైనఁ బోయి యీ,
యంబుదవేణిఁ గూడుచు సుఖాంబుధిఁ దేలుదు. మధ్యమార్గమం,
గం బరిపంథి యడ్డమయి తోఁచకయుండిన మేలె యయ్యెడిన్.
అని యిరువురతో నిష్క్రాంతుండయ్యె.

ఇది కాళిదాసచరిత్రప్రకరణమునందుం

చతుర్థాంకము సంపూర్ణము.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణే నమః.

శ్రీరస్తు.

---

శ్రీరస్తు.

# కాళిదాసచరితప్రకరణము.

---

## పంచమాంకము.

వీర్యగుప్తుండు ప్రవేశించుచున్నాఁడు.

వీర్యగుప్తుఁడు. ఔర! మదనసేనయం గలసౌందర్యంబు [illegible] సందేహ
వ్యాజోక్తుల కెవ్వారలకేని యొండొ దని యనుకొనియెదను.

ఉ. ఆవనజాక్షి ముద్దుమొగ మక్షిపథంబునఁ దోఁచుటాదిగా,
భావిత మైనశీతకరపార్వణబింబము నింపు గాదు. నా,
భావము దానిచంచలతరాంచలలోచనము ల్గనంగ ని,
చ్చాధిఁ గాంచ దుత్పలనిసర్గవిలాసము లాత్మ మెచ్చఁగన్.

మఱియును.

ఉ. దానిబొమ ల్గనుంగొనిన దర్పకచాప మ దెంత కాను పో,
దానికుచ ల్పయోదములతండముల న్నిరసింపఁ జాలు న,
ద్దానియొడల్ కఠోరశిఖితప్తసువర్ణమనోజ్ఞ రేఖయే,
దానికి నీడుగారు వెఱతామరసాయతనేత్ర లిద్ధరన్.

అదియునుంగాక ;

చం. రతి సౌందర్యవిలాససంపదల నారాజీవపత్రాక్షి భా,
రతి విద్యానిచయంబులందు సుషమారంభంబున న్జూడ శ్రీ,
సతి యైశ్వర్యకలావిశేషమున నాచంద్రాస్య తా నాశచీ,
సతి యౌ దానిని జూడకున్న నిఁక నాజన్మం బధన్యం బగున్.

ఇసీ! ఏమిది! ఏను దానితో విద్యావివాదంబున నోడినాఁడను. మఱియు న య్యిందువదన వెరవానిం బెండిలియయ్యో. ఏ నీవిధి నందరానిపండ్ల కఱ్ఱుసాచుచు న్నాఁడ. ఇఁక నాకాకన్యారత్నము లభించుననుట ఎక్కడిమాట. కార్తాంతికుండగు విప్రుండు ధనలోభంబున నాకుం బ్రియవచనంబులు చెప్పి యీనిశీథినియందు నన్నల యింపం జేసెడినో! దానియందుం గలయుత్కంఠాతివిశేషంబునం జేసి యాబాపనయ్య చెప్పినవచనంబుల నమ్మి యీచిమ్మచీఁకటులం బడి కడు నలయుచుఁ గనఁగలితం బయిన

రతనంబు నన్వేషించుచాడ్పున వీధులవెంట వెదకుచున్నాఁడను. ఆకన్యకారత్నం బిమ్మోడ దొరకునాయని మఱికి నెవ్వాఁడును బోడమక యున్నది. విధి యనుకూలం బగు నేని యభిమతార్థంబు నన్యద్వీపమునుండి యైనను గొనితెచ్చి కాకతాళీయంబుగతిం జేర్పకపోదు. ఇట్టులేకదా! తొలుత నీరాజపుత్రితో విద్యావివాదంబు సేయం గోరి యాయావారికిం జనుదెంచి పురబాహ్యోపవనంబున విడిసియుండి మదనసేనాసందర్శనం బున నిచ్చ వొడమి యున్నవాఁడ నగుటం జేసి యుత్కంఠితం బయినచిత్తంబునకు విం చుక వినోదంబు గల్పించుకొన నొంటరినై యా యారామసీమం జెలువారుచారుతరత రుపికరంబుల నిరీక్షించుచు నందుఁ గడుదవ్వులకుం జనినాకు చెలికత్తెలతో నయ్యెడకు యదృచ్ఛాసమాగత యయినయారామణీయకనిధిదర్శనంబు నయనంబులకలిమికి ఫలంబుగ సమకూరినయది. ఇమ్మహోత్సవంబు లభించినకతంబున మఱియు నిట్టివి జన్మఫలంబులు సంప్రాప్యంబులు గలుగంబోలును. ప్రాయికంబుగఁ బ్రాహ్మణులపల్కులు కల్లలు గావు. ఎందఱో రాజకుమారులీరాజపుత్రికం గోరి వచ్చినవారలు దానితో వివాదం బున నోటువడి యవమానంబున గొర్చి తమపురంబులకుం జనిరి. ఎవ్విధినైన నీమదన సేనం దొడ్డొక్కని గాని మదీయపురంబుత్రోవం బట్టుం జన దని యీవిశ్వవసిష్టుండల నా కుం గలుగుటయుఁ దదనుగుణముగ నీనక్షత్రశాస్త్రివేది సెప్పుటయుంజూడ నభిమతా ర్థసిద్ధి గావచ్చు ననియుం దోఁచుచున్నది.

ససారథికంబగురథంబున నారూఢులై గౌతముఁడును మదనసేనయుం బ్రవేశించిరి.

గౌతముఁడు. ఓ ప్రాణవల్లభా! ఏల నీవీయరదంబున నొకవంక సంకుచితాంగివై నిలువంబడి యుండెదవు? వేడ్కమెయి నాయంకతలంబునం గూరుచుండుము.

చం. సరసిజపాణి నీబిగువుఁజన్నులు న న్ననురాగపూరభా,
సురగతిఁ జేర్చి పైకొనవె సుందరి నీనును మోవిపానకం,
బరుదుగఁ గ్రోలకున్న నిఁక నంగము నిల్వదు మన్మథాగ్నిని,
ర్భరతరకీలల న్దగిలి భస్మముగాఁగల దాదరింపుమా.

మదనసేన. శోకంబుతో,,

గురువరా! ఈబుద్ధి మీ కుండం జనదు. ఏను మీకు సుతాసమానను. శిష్యను. మఱియు మీయింట దాస్యంబు సేయంగలకింకరిని. అట్టికార్యంబుల నియోగించి న న్నుంబావనతరపదవీపరిచ్యుతం గాకయుండునట్లు సేయుఁడు. ఇట్టి తుచ్ఛసుఖంబులు మీపాలపైతేనియ లని మీర లెఱుంగరా! దయ యుంచి నన్ను విడిచిపుచ్చుఁడు.

వీర్యగుప్తుఁడు. చెవియొగ్గి విని,,

నావేఁడుకొనిన దీనాలాపంబు లాలకించి యీపాంచాలీమానరక్షకుండు వీరల నిరసింప నేతెంచెనో.

సకరుణముగ,,

ఓదయాసిద్ధీ! యీ బ్రహ్మబంధువును బ్రాణంబులు దీయకుము.

వీర్యగుప్తుఁడు. ఆశ్చర్యపడుచు,,

ఓకనకాంగీ! నీ కింతవిప్రియంబు గావించినవాఁ డయ్యును వీనిం జంపవల దంటివి. నీదయారసంబునకు మెచ్చుకొంటిని. నీకొకవరంబీఁదలంచినాఁడ. ఇట్టిసుగుణ సంపత్తిగలనీయందు నీగర్భగుం డిట్లు కష్టుఁడివై ప్రవర్తించెం గాన వీనిం బట్టి శిక్షించెదను.

అని కుప్పించి గౌతమునిసిగం బట్టి ధనుర్జ్యాగుణంబుచేఁ బెడకెక్కు లుఱిచికట్టి,,

ఓగౌతమా! పూర్వము నే నీరాజకన్యకతో విద్యావివాదంబు సేయంగడంగి నప్పుడు నిక్కృతిమెయి నన్నవమానించి నాకుం బాణిగృహీత గావలసినదీనిం దప్పించి తివిగదా! ఇప్పు డేమి సేయంగలవో చూచెద. ఇది వాగ్వివాదంబు గాదు. వీర్య పారవివాదంబు. నీ వందుం జేయఁగలపని యేమి? ఇందు నిన్ను వధింపవలయు నన్నది భావ్యం బయ్యును బ్రాహ్మణుండ వని యీవనజాక్షి కనికరించి యట్లు గావింపకు మని ప్రార్థించియుండు కతంబున నాదారుణవ్యవసాయంబువలన నివృత్తుండ నైతి. ఇదె నిన్ను బంధించితి. ఇఁక నీకు విమోక్షణంబెప్పటికో!

అనిగుడ్లుఱుముచున్నాఁడు.

గౌతముఁడు. ఆత్మగతమున,,

కష్టా! నేఁజేసిననిక్కృతికిం జేసేత ఫలం బబ్బినయది. అట్టి కాళికానుగ్రహ పాత్రుని కళత్రంబును దొంగిలి తెచ్చుట యూరక పోవునే! వీనికి నే నేమియుఁ బ్రతివచనం బొసంగఁజాల.

అనియూరకున్నాఁడు,,

వీర్యగుప్తుఁడు. మదనసేనం గాంచి,,

ఉ. చంచలనేత్రి నీవికచసారసపత్త్రవిశాలలోలనే,
త్రాంచలలీలఁ గాంచ మది నాస జనించినవాఁడ నుగ్మలీ,
కుంచితనీలముగ్ధశుభ కుంతలసంతతిసుందరంబుగా,
నంచితరీతిఁ గాంచు భవదాస్యసరోరుహ మెత్తి యీసతోఁ.

మదనసేన. సాతంకంబుగ, ఆత్మగతమున.

వీఁడు నన్ను రక్షింపం జనుదెంచెనని యనుకొన్నంతనె [illegible] శత్రు వయ్యె. గౌతముఁడు బ్రాహ్మణుఁడు గాన మదీయధనుర్విద్యా [illegible] గుణంబులను భయంపడుచునతిక్రమింపం జాలక యూరకుండినవాఁడు. ఇతండు నాకు ప్రియుండను వాఁడు గాఁడు. ఏమి సేయుదును.

ఆశ్వాసంబుతో,,

నామనస్సున కొకసమాధానంబు గలదు ; వీఁడు మిత్రుని పుత్రిమయుండు గాన నన్ను బుద్ధిమయి కుత్సితంపుంబనులకుం జొరఁడు. గంభీరుండై ప్రవర్తించును. ఎట్లైన [illegible] దప్పించుకొనవచ్చు నని తోఁచెడిని. ఇప్పటికి సమయోచితముగ బొంకినయితఁడు నన్నుఁ దాఁకకుండంజేసికొనియెద. మానభంగంబు [illegible] కొనుటకు బొంకులాడుట దోషావహంబు గాదని ప్రామాణికవచనంబు [illegible]. మఱియు నితఁడు నావచనంబులు వినకపోఁడు. ఎట్లనిన !

కం. వనజాక్షులయం దాసలు। గనినక్షత్రియ [illegible] లా,
వనజాక్షులవచనంబుల। కును జవదాఁటరు తడియుదురు. [illegible].

మఱియు,,

కం. రసభావజ్ఞులు మదిలో। సరసృత మగుప్రీతి యొనర్న [illegible],
ప్రసవంబులు సౌరభగతు। లొసఁగక [illegible].

ప్రకాశముగ,,

ఓవీర్యధుర్యా! నన్నుం జౌర్యమున నపహరించి తోడ్కొనిపోవుచున్నయీవి ప్రునిశిక్షించితివి. ఇఁక నేను నీధనమను గాని యితరునిసొత్తు గాను. నాతినిన్ని [illegible] బోననుభయంబుం గూర నావశ్యకంబు లేదు గదా. ఈ [illegible] ధర్మశాస్త్రజ్ఞులు తారు సెప్పినమాట మరల్పరు. కాన నిప్పుడు నాయందు సంతసించి కోరిన వరం బొసంగెద నన్నవచనంబు యథార్థంబు గా నావేఁడినయర్థం బంగీకరింపుఁడు. అది యెద్ది యంటిరేని. తడవులంబట్టి యే నొక్క వ్రతంబు సేయం బూనుకొనియున్న దానను. అది యొకవత్సరమునకు సమాప్తిం జెందు. అంతదనుక నాయందు [illegible] లూరం జనదు. ఇదినాకు మీరు కరుణించి యీఁదగువరంబు. ఇది యొకటి ప్రతి సమాప్త్యనంతరము భవదభీష్టార్థంబు నెఱవేర్పఁగోరెదను.

విద్యగుప్తుఁడు. సంతసంబుతో,,

ఓ సుందరీవతంసమా! అట్లయగుంగాత. రాజకన్యకం దోడ్తెచ్చినాఁడ ననుయ శంబు నాకుఁ జాలును.

కం. ఇంతికిని లక్ష్మియై నా। కంటికి దా నమృతవర్తికయుఁ బోలెను పె,
న్నింట ముదంబుఁ దేఁగ। గంటికి ఫల మనుచు, నిన్నుఁ గనుఁగొనుచుంగ౯.

ఓసుందరీ ! ఏను మదీయం బగుకరూశదేశమునకు రథముదోలుచున్నాఁడను.

అని యరదముఁ దోలుకొనుచు నిష్క్రాంతుండయ్యె.

ఇది కాళిదాసచరిత్రప్రకరణమునందుం

పంచమాంకముసమాప్తము.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణేనమః.

శ్రీరస్తు.

---

శ్రీ రాధాకృష్ణపరబ్రహ్మణే నమః.

కాళిదాసచరిత్రప్రకరణము.

షష్ఠాంకము.

---

గుణమాలినియు ధనమాలినియు సంభ్రమంబుతోఁ బ్రవేశించిరి.

గుణమాలిని. ప్రియసఖి ధనమాలిని! ఏమే యీవింత! మనభర్తృదారిక యగుమదనకేళీగృహంబున నిశీథసమయంబునందు వైతాళికులు నిద్రమేల్కొలుపు నట్లున్నది. గాఢనిద్రాభియోగహతమతులై యించుక మేల్కాంచి యావైతాళికులు తఱి యెఱుంగక యిట్లు గావించిరి గాఁబోలు? పూర్వదినంబునం బరిణయకార్యవ్యాపృతులై యుండుటంజేసి యిట్లు జరిగియుండవచ్చును. ఎట్లయినను మనము వెళ్లంబ రాజపుత్రికకడకుం జనవలసినవారము గాదే! భర్తృదారిక యస్మదాగమనంబునకుం బ్రతీక్షించుచుండు. మనకును గతయామినియందు నిద్రలేమింజేసి వేకువ యయ్యు నిశీథమని తోఁచుచున్నదియో! ఎందుకుఁగాని వెళ్లంబ చనవలయు.

అని ద్రుతతరంబుగఁ జనుచున్నారు.

ధనమాలిని. శ్రమం బభినయించుచు,,

ప్రియసఖి! గుణమాలినీ! మన మెంతపరువెత్తిన నుద్యానమునందలిభర్తృదారికయుండుకేళీగృహపుమార్గంబు ముగియకున్నది. మనము భర్తృదారికను బాసి యింటికిం జనినకార్యం బుచితంబు గాదు. ఇప్పుడ యింటం దలవాల్చితిమి. అప్పుడ లేచి పరుగెత్తవలసివచ్చె.

గుణమాలిని. ప్రియసఖి! యిట్లు వచ్చునని యెవ్వతెకుఁ దెలియునే!

ముందుకు దృష్టులు నిగుడించి. భయంపడుచు నిలిచి,,

ఓసి! అదె కనుంగొనుము. యమభటుండువోలె నతిభయంకరాకారుం డెవ్వఁడో మరణవేదనకుం బాల్పడి యూర్పులు విడుచుచుఁ గాలుసేతుల నిలకుం దాఁచుచుం బొరలుచున్నాఁడు. సమీపమునకుం జన భయం బగుచున్నది. ఈసంకటపథ్యయందుఁ బోయినంగాని వెళ్లంబ భర్తృదారికకేళీగృహంబునకుం జేరలేము. ఏమిసేయనగును?

ధనమాలిని. ప్రియసఖి! భయంపడినం దీఱునా! భర్తృదారిక మనరాక కెంత తహతహపడుచుండునో! ఏమైనను గానిమ్ము. పోదము రమ్ము! భర్తృదారికకేళీగృహంబుం బాసిపోవుటంజేసి మన మపరాధులమయి యున్నారము. ఇయ్యెడ నేదేని యొక యప్రియంబు జరిగిన నూరక మాట రాదుసే!

గుణమాలిని. ఓసీ ! నీ వేమిచెప్పినను నామనంబునకు ధైర్యంబు గల్గలేదు.

అని మెల్లన నడుగులిడుచు ముందు కొదలువచ్చి నిరూపించి చూచి.

ఓసీ ! వీఁడు మనభర్తృదారికయం దత్యంతహితుండై యుండు గౌతముఁడు నిద్రాభరంబున నిరీక్షణం దగునట్టున పడియుండెను. రథ్యాప్రదీపశిఖాప్రకాశంబువలన బాగుగఁ దెలియఁబడియెడిని. వీనిం గాంచి యీనగరంబునం గలకాంచనాంగు లెల్ల భయంపడుచుండిరి. వీఁడొకసమ్మెట సంతోషావహం బయ్యె వీఁడిట్టెయ్యెడఁ గఠోరప్రహారంబున నిలువఁ బ్రజ్వలించియుండుటంబట్టి గౌతముఁడు నిర్వృతిమెయి భర్తృదారిక కహితంబుఁ గావించి మర్త్యమార్గంబునఁ దననేస్తకానిం గోలుపోయి సంకటపడి యున్నవాఁ డను నర్థంబు దోఁచుచున్నది. దీన మనభర్తృదారిక కేదియో యిడుమ సంప్రాప్తం బయ్యె ననుట సిద్ధాంతం బయ్యె. వైళంబ పోయి ప్రియసఖిం జూతము రమ్ము.

అని త్వరితతరంబుగఁ బరిక్రమించుచున్నారు.

గుణమాలిని. పురోభాగంబునకు దృష్టులు వఱపి. నెవ్వెఱపడుచు. త్వరతో,,

ఓసీ చూచితే ! మనతలంచుకొన్నయి విస్తృతంబు లగు నుద్యానద్వారకవాటంబుల చేత నిర్ధారితం బగుచున్నది.

ధనమాలిని. ఓసీ యంతియ గాదు. కేళీమందిరరక్షకభటు లెవ్వరును గనంబడరు. దాని కవాటంబులును దెఱవంబడియున్నవి. మఱియు నీమందిరంబు విజనం బయిన విధంబునం దోఁచెడిని. ఏమే ! యీకష్టము !

ఉరంబున మోఁదుకొనుచు.

గుణమాలిని. ప్రియసఖి ! నీనుడువుపల్కులు వినినంతన నాయంగంబులు విశ్లేథంబు లయినయట్లు కార్యాక్షమంబులై ప్రసరింపకున్నవి. ఏమి సేయఁగలనే !

ధనమాలిని. ఎట్లున్నను బోయి చూడవలయుఁగదా! ఇంటం బ్రవేశించిచూతము రా! ఇరువురును మందిరాభ్యంతరంబుం బ్రవేశించుచున్నారు.

గుణమాలిని. కలయ నవలోకించి,,

అయ్యయో ! మనభర్తృదారిక గనంబడదే ! కట్టా ! మదనసేనకు; సర్వవిద్యావిశారదకు; శారదాదేవీసమానకు; సకలైశ్వర్యసంపన్నురాలికి; మనప్రియసఖికి ట్టిగతియా పట్టెను?

ఆకాశము లక్ష్యముచేసి,,

ఓప్రియసఖీ భర్తృదారికా! ఓప్రియసఖీ మదనసేనా! ఓప్రియసఖీ యాభీరమానవలోకరాజా ! ఆ ! ఎంతకుఁ బిలిచినను బలుకవేమె ?

ఆలోకించి,,

ఓసీ ! నేనిం కేమి సేయంగలనే ! హా ప్రియసఖి ! నిన్నే రీతిఁ బెంచు గాలి యాం వెన్నైనో! ఏక్రూరకన్యరిచేతం జిక్కుకొంటివో ! అక్కటా ! నీ కేగతి పట్టితివో! అహా నీకే యిడుములఁ బడితివో ! ఎవ్వారంబునం జెప్పలేదవో ! ఏరీతి నోర్చుకొంగవో! ఎవ్వరి నెవ్వరిం జీరెదవో ! ఏపని కలకించెదవో ! ప్రియసఖి ! నిన్నెక్రూరదశావిశేషం బనుభవించెదవో ! ప్రియసఖీ! భర్తృదారికా . ఏము నీవం గట్టిను సంప్రాప్తమగుకాల మునకు నిష్ఫలముల మై యుండబాలిపోతిమిగదే ! ఓముగుదా ! మమ్మెం ప్రియసఖు లనిసమ్మి యుంటివే ! ఏము కఠినాత్ముల మై యిట్టిసమయంబున లేకపోతిమిగదే ! నీతండ్రి ని న్నొకదినమునకై నను జూడక యుండ లేఁడే! ఎట్టియాపదయందైన నెవ్వరి మొగంబును గాం చం బోను దేవి మమ్ముం గాంచి మదనసేనసుఖం బడిగె నేని యేమని నుడువంగలవార మే ! ప్రియసఖి ! ప్రియసఖి జగం బంతయు జీర్ణారణ్యం బయ్యెనే ! ప్రియసఖీ ! ని న్నిట్టు లచింతితపోవనత మయిన యిడుమలం బాలుచేసి యీగుణమాలిని భూమియందు దిక్కె జీవింపవలయునా ! ఓదైవమా ! కుటిల ! యీతపస్వినికి మూర్ఖుండం బతిఁగాఁజేసిన కొంత యాగ్రహుండ విప్పుడు మొదటికే మోసము దెచ్చితివి . హా ! యీ కాళరాత్రి నాకు వేగంబోదు సుమా! వేదనపాహో! నే నెవ్వరి మొగం బెట్లు గాంతు. ఓగుణమాలినీ ! నీకు భర్తృదారిక ప్రాణనిర్విశేష యనియందురే! ఈమాట కల్ల యయ్యెఁగదా! నీవు వాసి పోయినను ప్రాణంబులు వోకున్నయవి.

ప్రియసఖి ! మదనసేనా !

హా ! యింకేలనే గుణమాలిని బ్రతుకవలె! హా ! నీనాయకునిగతి యెట్లయ్యెనో గదే!

అని మూర్ఛపోయి యుండియుంబడియె

భటుండు ప్రవేశించి,,

ఓసి ధనమాలిని! మనభర్తృదారిక యగుమదనసేనదయితుండైనకళాచంద్రుండు తనప్రాణదయితకుం జెప్పు మని నా కాజ్ఞాపించి పంపినయర్థంబు విని యది రాజపుత్రి కకుం దెల్పుము.

ఉ. ముద్దులగుమ్మ నిన్నుఁ గడు మోహముచే నెడబాయలేక నేఁ,
బద్దయుఁ గుందుచు న్నదికిఁ దక్షణ వచ్చితిఁ దీర్థమాడ నీ,
ప్రొద్దును దీర్ఘమై యెసఁగె పొర్తిగో వెండియు వత్తు నన్ననో,
కొద్దిగ రేయి యుండు నని కోమలి నిల్చితిఁ దాన మాఁడఁగన్.

కం. మానిని నే లే కనుచున్,
మానసమున ముదముఁ దక్కి మఱిచితము పదం,
బూనుకొనఁ బోకుమీ యను,
మానింపక వేగ వచ్చి మన్నింతుఁ జెలీ. అని.

ఘనమాలిని. సఖి ! సఖి ! యూరటం జెందుము. మనమదనసేనకు భర్త యయినవాఁడు కళాచంద్రుఁడఁట. అతఁడు నదీస్నానార్థంబు సని ప్రొద్దు గల దని యరిగ్యె వన తడిసి యుండుకుం దనప్రాణపయిత యుత్తలంపడకుండఁ బ్రణయసందేశంబుం బంపి యున్నవాఁడు. దీనివలనం గళాచంద్రుండు మాధవేషమున వచ్చి తనరూపంబు బయల్పఱిచి వైతాళికులవచనంబుల మోసపోయి తనప్రాణవల్లభ యింట నున్న దని యాసందేశ మంపినయర్థంబు సుస్పష్టం బయ్యె. అట్టికళాచంద్రునిం బతిఁ గాఁ బడసి యాసుకుమారాకారునితో సౌఖ్యంబుఁ గూడుటకు లేక యీరాజపుత్రిక యెంత దీనదశం జెందిన యది. కట్టా ! యీతపస్విని కెట్టిచెట్ట యుట్టిపడెనే !

గుణమాలిని. ఆశ్వాసంబుఁగల్పించుకొని.

సఖి! మనప్రియసఖికిం గళాచంద్రుండు బతి యయ్యె నన్నది విన్న నిత్తఱి దరిలేని దుఃఖసాగరంబున మానసంబు మునుంగకున్నె ! ఆకళాచంద్రుండు కడుసమర్థుం డనియుఁ గరూశదేశాధీశునిమంత్రికుమారుం డనియు విందును. మనము వైశంబ చని మదనసేన యిర్వ్యాడం గానంబడనివృత్తాంతంబు నతనికి నివేదింతము.

అని ఘనమాలినితో లేచి. భటునింజూచి,,

ఆర్య ! కళాచంద్రుం డుండుచోటికి మమ్ముం గ్రక్కునఁ దోడ్కొని పొమ్ము. రాజకన్యకావృత్తాంతం బతని కెఱింగింపవలయును.

భటుఁడు. ఓసి గుణమాలినీ ఘనమాలినులార ! రండు పోద మతని కడకు !

అనివారలం దోడ్కొని నిష్క్రాంతుం డయ్యె.

## ప్రవేశకము.

---

కళాచంద్రుండు ప్రవేశించి. శోకంబుతో,

ఉ. మానవతీమణిం దలఁచి మానస ముత్కటదుఃఖసాగరా,
నూనమహత్త్వపూరమున నోలి మునుంగుచునున్న దక్కటా,
యానలినాయతాక్షి కుటిలాలకలాలితమందహాసల,
క్ష్మీనవకాంత మామొగము మేలిమితో నికఁ జూఁడ గల్గునే !

ఇది యింక నీమందభాగ్యుని కందరానిదియ యనితలంచెదను. నియతముగ నియతి యీకళాచంద్రుని గష్టములు వెట్టం బూనుకొని యున్నాఁడు.

ఉ. కోరుచునుంటి నేఁ దొలుతఁ గోమలగాత్రిను బెండ్లియాడుటకుం,
గూరిచి నామనోరథము గూఢముగా విధి యిచ్చె దైత్యులన్,
ఘోరవియోగతాప భర గుంఫితవేదన పాలుచేసె. న,
న్నీరహి సేయ నీనియతి కేమి యొనర్చితినో విరోధముల్.

హా ! దైవంబు తనకుంగలకష్టదానమై పుణ్యాయి నాయందుం గాన్పించినవాఁడే.

ఉ. ఆనవమోహనాంగిఁ గనినంతన కౌఁగిటఁ జేర్ప లేకనే,
మానసిమూఢభావమున మ్రాన్పడియుంటి నొకింతకాల మా,
మానిని నాకు మూఢదశ మానిచి యేలొ, నఁ బూనకుండెనో
చానను నన్నుఁ బాపె విధి సహ్యమె యేరికి నైన నీవ్యథల్.

ఇఁక నీకళాచంద్రుని కీలోకయాత్ర యెవ్విధిఁ జరుగఁ బోవునో!

ఉ. కంటికి నిద్ర రాదు నృపకన్యకఁ బాసిననాటినుండి నా,
యింటికిఁ బోవఁ గా హృదయ మెల్లవిధంబుల సమ్మతింపదు,
త్కంటకితత్వముం గనుచుఁ గాయము దాపముఁ దాళలేదు న,
న్నొంటరిఁ జేసెనే విధి పయోరుహలోచనఁ బాపి క్రూరతన్.

ఇంక నీకళాచంద్రుండు భూతలంబునకు భారభూతుండు గాని మానితజీవుండు గాఁడు.

ఉ. పాపపునాభవం బిపుడు ప్రాప్తఫలంబును గోలుపోయె నం,
తాపపరీతమై తనువు దగ్ధతఁ గాంచుచు నున్న దింతిఁ గానకన్,
జేపడుజాడ లెవ్వియును జిత్తమునన్ స్ఫురియించ వేమొకో,

ఆశ్వాసంబుఁ జేసికొని ,,

శ్రీపతిసద్దయామహిమచేత శుభంబులె కల్గు నన్నియున్.

మదనసేనప్రియసఖులు గుణమాలినియుఁ ధనమాలినియును నాకడకుం జనుదెంచి రాజకన్యక గానంబడ దని నాకుం దెలిపిన దాదిగ.

కం. పాతాళగుహను బడిన । ట్లాతతగాఢాంధతమస మలమినరీతిన్,
భూతోపహతము మాడ్కిన్ । చేతోగతి స్రుక్కెఁ గరము చింతాకులమై.

ఏను నేచేయఁగలకార్యంబు దోఁచక మదనసేన జననీజనకులం జూడ నొల్లక నా తలిదండ్రులకడకుం బోనిచ్చగింపక యచ్చపలాక్షీమణిని దలంచుచు ననేకదేశంబులు దిరిగి ధారానగరంబుఁ జేరితిని. ఈనగరాధిపతి భోజుండను కవికులంబుల కవ్వారిగ ధనంబు లొసంగుచున్నవాఁడు. ఇతనిసభాస్థలంబునకుం జేరితి నేని సర్వకాలము కవులతో విద్యావినోదంబునం గాలయాపనము చేయుచుండవచ్చు. అట్లయినం బ్రియావిరహవిక్లబం బగుమానసంబునకు వ్యాపారాంతరప్రవణతాబలంబునం గొంత యాప్యాయత గల్గంబోలు.

ఎదుటికి దృష్టులు నిగుడించి. ఆశ్చర్యపడుచు,,

ఔరా ! యీయెదుటం బొడసూపు బాలికావతంసంబు పురహరనయనాగ్ని దగ్ధుండగుమన్మథునికిం గల్పించినసంజీవనౌషధివిశేషనవాంకురంబునాఁ దోఁతెంచు చున్నయది. ఔరా యీకుందరదనయందం బేమందును ?

చం. నును పవడంపు దీవియనునుంగునిగారపుఁగావిమోవి,
కుందనపుఁజొకాటపుంగొమరు తళ్కులకాలు మెఱుంగమేను శో,
ఘనవనీలనీరజనిభం బగువాల్గనుదోయి యొప్ప నీ,
యనుపమరూప బాలిక భవాంబుధి కిందిర నాఁగఁ బొల్చెడిన్.

ఈనితంబవతీకులాభరణంబుం గాంచినంతన నిది నాకన్నులకమృతవర్తికయుం బోలె నతులానందంబు సమకూరుచున్నది.

మఱియును.

ఉ. చానను బాసి దుఃఖభరసాగరమందు మునుంగుచుండు నా,
మానస మీసుమాస్త్రసమానజయేందిర బాలికామణిన్,
జానుపడంగ నాత్మకును సంతరణం బనియెంచి మించి యీ,
మానవతీలలామపయి మక్కువఁ జొక్కుచునున్న దెంతయున్.

కాళిదాసుఁడు. కాంచనమాలకు దస్సతి,,

* శ్లో. కా త్వం బాలే,,

వేశ్యాకన్య. వినయంబుతో,,

† శ్లో. కాంచనమాలా !

కాళిదాసుఁడు. ఆత్మగతమున,,

ఔర! యిది దీనికిం దగినపేరు. దీని నిరవద్యం బగు సౌందర్యంబునకు శోభావహంబుగ విద్యయు నుండుట బంగారమున కామోదం బుంకుటయు.

ప్రకాశముగ,,

‡ శ్లో. కస్యాః పుత్రీ !

కాంచనమాల. ప్రణయంబుతో,,

§ శ్లో. కంచుకవత్యాః,,

కాళిదాసుఁడు. ఆత్మగతమున,,

కంచుకవతి భోజభూపతి రాణి యగులీలాదేవికిం బ్రధానసైరంధ్రిపదంబున నుండునది యనియు నసమానరూపగుణగణోపేత యనియు విని యున్నాఁడ. దీనివిన యవివేకాదులు దానియాత్మజాత యనుటకుం దార్కాణ యయియున్నది.

ప్రకాశముగ,,

¶ శ్లో. కిం తే హస్తే,,

కాంచనమాల ముఖవికాసంబుతో,,

§§ శ్లో. తాళీపత్రం,,

కాళిదాసుఁడు. ఆత్మగతమున,,

ఔర! దీనిప్రత్యుక్తిమాధుర్యంబు కరమభినందనీయంబై యొప్పుచున్నది.

ప్రకాశముగ,,

---

* టీ. బాలే = ఓపడుచా! త్వం = నీవు, కా = ఎవ్వతెవు?

† టీ. కాంచనమాలా = కాంచనమాలయనుదానను.

‡ టీ. కస్యాః = ఎవ్వతెకు, పుత్రీ = కూఁతురవు.

§ టీ. కంచుకవత్యాః = కంచుకవతియనుదానికూఁతురను.

¶ టీ. తే = నీయొక్క, హస్తే = చేతియందుండునది, కిం = ఏమి?

§§ టీ. తాళీపత్రం = నాచేతనుండునది తాటాకు.

* శ్లో. కా వా రేఖా.

కాంచనమాల సందహాసముతో,,

† శ్లో. కా ఖా గా ఘా.

కాళిదాసుండు. శ్లాఘించుచు,,

ఓహో! అతివిస్మయనీయం బగునీబాలభావంబె యిట్టు శిలోభనీయంబై యుండిన దీని నభినవతారుణ్యవిలాసం బింతకంటె నెంతో మనోహరంబై యుండునో!

ఉ. బంగరుతీవె యందు నవపల్లవ ముగ్ధపుమాట చిత్రమా,
సంగతిఁ బొంచి దైవ మదియు సారసుధారస మొల్కఁ బల్కుచున్,
బుం గలిగింపను న్నయిఁకఁ బుష్పసముజ్జ్వలకాల మయ్యెనే,
నిం గలుగంగఁ బోవుఫలనిర్వృతి యెట్టిదొ తోఁచ దాత్మకున్.

అని కాంచనమాలం గాంచి నవ్వుచు,,

ఓకులుకులాడీ! యిప్పు డీప్సు.

చం. కులుకుగుత్తపుం గుబ్బచన్నుఁగవతోఁ గ్రొమ్మించు మైఁదీఁగతో,
నలఘుశ్రోణిభరాలసం బగుకరంబం దఃప్రయాసంబుతో,
లలితోదారవిలాసలాలసకళాలాలిత్యసంచిత్రితో,
విలసన్నూత్నవయోవిలాస మగుచున్ వేడ్కల్ దగం జేయవో!

కాంచనమాల. స్మితముఁ గావించుచు. ఆత్మగతమున.

---

* టీ. రేఖా=గీత, కావా=ఏమి? ఈగీతయేమియని ప్రశ్న.

† టీ. కాఖాగాఘా := కాఖాగాఘాలు.

ఈకాంచనమాల నవనీలనీరజాక్షంబు లగువాలుంగన్నులును ఎఱుపుమిాఱులే మోవియుఁగలది యని కవి వర్ణించుటవలనను ఈసుందరపురుషునిం గాంచి విస్మయంపడుటవలనను ఇట్టిగుణములారంభించుతారుణ్యప్రాదుర్భావపూర్వకాలికం బయినపదిసంవత్సరములప్రాయము గలది యని నిర్ణయింపవలసియున్నది. అప్పటికి కాఖాగాఘాలు పఠించుచుండుట వయస్సునకుం దగినదిగా దనవచ్చు. మఱియు నగవి యడిగినశ్లోకసమస్యలకు శ్లోకరూపముగా న[illegible]మొసంగుటంజేసి విద్యాకవిత్వవిచక్షణ యనియుం దెలియుచున్నది. కాన నిచట కాఖాగాఘా అని విశేషాకారములోఁ బల్కినందుకు నక్షరసామాన్యతాప్రతీతియే భావ్యము సామాన్యమును విశేషముచేత బల్కుట యార్యోక్త్యోడల విదిత మగుచున్నది. భక్తమందారుఁడు అనుచోట వృక్షవిశేషమును జెప్పుటకు సామాన్యమగుకల్పవృక్ష మని తాత్పర్యము గదా!

ఈచంద్రకాంతశిలావిశేషంబింక మాకెంతయు లజ్జాభరితం బగుచున్నది.

ఈత్రోవను రాఁ దగ దని చెలికత్తెలు గుసుగుసు కరిగెదరు.

అని యిట్లు మాటలాడుచు జనుట నభినయించుచు నిష్క్రమింతురు.

సఖులు. ఒండొరులతో,,

ఏమే యీచిత్రము? ఈకాంచనమాల యను మనసఖి యభినవయౌవనాగమంబు గలిగిన దెట్లుండెనో యిక్క పూర్వశైశవంబుం గనుంగొనం దలంచుచుం దదనురూపంబు లగువచనంబుల వట్ల నాడి యింతకు మునుపు మనప్రియసఖి సమారూఢయౌవన యగుచు రతీదేవివిధంబునం బొలుపారుచున్నది. ఇట్టిమాహాత్మ్యంబు గలవాఁడు కళాచంద్రుండయ్యె వినుము. ఆతండె యయ్యె నేని మనకాంచనమాలభాగ్యంబు పండినయదియ.

నేపథ్యంబువంకకుంజూచి,,

ఓసి! ప్రియసఖి! కాంచనమాలా! ఏలనే యిట్లు సిగ్గువడియెదవు? ఎప్పటికైన నిట్లు గావలసినదానవే గదా! అమ్మహాతిశయం బిప్పుడ సమకూరి యిమ్మహాపురుషాభినందనీయం బగుటకు మహాముదంబు నందుచు నిష్టమేలు సమకూరించినయీమహాకళికిం గృతజ్ఞతాసంసూచనం బొనర్పక మామాటునకుం జనుట పాడియే. అట్లు పోవం జనదు. ఇకనిపుడొక్కరితైయేనుం జనవలవదుం గాదే! కవికడకు రమ్ము.

అని చేతులు పట్టి తిగుచుచున్నారు.

అభినవయౌవనముతో లజ్జావనతాననయై కాంచనమాల ప్రవేశించి,,

ఓసి సఖులార యేమతిశయంబుం గాంచి మీరలిట్లు నన్నుగడు పెట్టం గడంగితిరి?

సఖులు. ఓసి ప్రియసఖి! నీవైనఁ దీఁగె నేమతిశయంబు వొడసూపినది యెఱుంగవా?

కాంచనమాల. తన్నుం గలయం గాంచుకొని. ఆత్మగతమున,,

ఉ. చిత్ర మిదేమి నాశ్రవణసీమలకుం జనె నేత్రపద్మముల్,
గాత్రము చేవసాగెడిని కాంతులనై మదిఁ గోర్కె గద్దె నే,
మాత్రము గానరాదు గద మధ్యము నూఁగుగ నారు దోఁచెడిన్,
మాత్రన భార మయ్యెఁ గటిమండలి సిగ్గును నిగ్గుదేరెడిన్.

ఇట్టియభినవతారుణ్యకళావిశేషంబు వొడముటకు ఫలంబుగ,,

చం. సుభగవయోవిలాసుఁ డతిశోభనగాత్రుఁ డుదారకాంతి యా,
యభినవమన్మథుండు నను నాదర మారఁగఁ జెట్టపట్టె నా,

యభిమతసిద్ధిఁ గూరిచి సుఖాంబుధివీచికలందుఁ దేల్చునే,
శుభగతి సాభవంబును విశుద్ధతఁ జెంది కృతార్థతం దగన్.

సఖులు, బండారులతో,,

ఓసి ! యీకవికులకుంజరుండే కొన్నిదినములకు ముందు మనసఖి డాఁగిలిమూఁత లాడంగడంగి యందు కనుపడకపోవుటం జేసి ఖేదంబుంగొన నాసొంపు వర్ణించి చెవుల పండువు సల్పినవాఁడు. ఈరసికవరునకు గాంచనమాల సమాగమనిబంధనంబుం గావింపంజనును.

కళాచంద్రునిం గాంచి,,

ఓసరసకులావతంసమా! నీవు కొన్నిదినంబులకుముందుఁ గార్యాంతరవ్యాపృతుండవు వోలెఁ ద్వరితగతి వేశ్యవాటికం జనుచుంటివి. అప్పుడు మాప్రియవయస్య తన యీడుబాలికామణులు డాఁగిలిమూఁత లాడుచుండుటకు సంతసంపడుచుఁ దాను నాయాటలాడం గోర్కి వొడమి వారలం దరిసిన నద్దానిం దమతోఁ జేర్చుకొనక తమతెగనుండి వెలువఱిచినం గాంచనమాల యూఁగడు ఖిన్నయై యేడ్చుచుం దనతల్లికిం జెప్పఁగా నదియుం దుకుం గతంబు విచారించి తనూజాత యాత్మీయాసదృశాభిరూప్య ద్యోతకంబులగువచనంబులు కొన్ని ముగుదతనంబునం జేసి వానిభావం బెఱుంగక పల్కిన నందు కలరుచు నశ్లేడుచుచున్న దానిం బలుమాఱు ముద్దుగొనుచు నవ్వుచుండఁగా నంగుకు మతికొండఱు సవయస్య లబ్బురంపడుచు నయ్యెడకుం దత్కాలసమాగతుండవగు నిన్నుం గాంచి నీరూపగాంభీర్యాదుల కలరుచు నీతో మాటలాడం గోరి ప్రియవయస్యవృత్తంబు నెపంబు గావించుకొని నిరుపంకరిసి నిన్నుం జేరి యోయయ్య ! యీ యబ్బురంబుం గాంచితివా ! యీబాలిక యేడుపనేడువ దీనితల్లి నవ్వుచు ముద్దుగొనుచున్నది. ఇదియేమి ? యని యడిగిరి. అందు కీట్లంటివి.

* శ్లో. న మాతుం శక్యంమే నయనయుగ మాళీకరతలైః
తనుజ్యోత్స్నా నేయం ఘటయతి గాఢాంధతమసం,

---

సవయస్యలు తామాడు డాఁగిలిమూఁతలాటలకు దీనిని రంజన ఖిన్నురా లైన బాలిక తనతల్లితో వారలు తన్ను వారియాటలలోఁ జేర్చుకొనమికిం గారణములు వచించుచు నేడుచుచున్నది.

టీ. * పుత్రీవచనము. హేజనని = ఓతల్లీ ! మే = నాయొక్క, నయన యుగం = కన్నుదోయి, అళీకరతలైః = చెలికత్తెలహస్తతలములచేత, మాతుం = మ

సఖీనా మాహూతిం విరచయతి సౌరభ్య మితి తాం,
రుదంతీం తన్మాతా హసితవదనా చుంబతి ముహుః.

---

మితియొనర్చుటకు, నశక్యం = సాధ్యముగాదు. ఓయమ్మా ! నాకన్నులు చెలికత్తెలచేరలకొలతకు మీఱియుండుటచేఁ గన్నులు మూయించుకొనువారి తెగలోఁ జేర్చుకొనరని యనుచున్నది. కొందఱు దాఁచుకొనునప్పుడు వారిని వెదకి పట్టవలసినవారిని మఱికొందఱు కన్నులు మూయుచు డాఁగనిచ్చినవారు డాఁగినవెంటనే కన్నులు తెఱచి వెదుకుటయుఁ గరతలములచేతనే కన్నులు మూయవలయునన్నదియు లౌకికక్రీడావిశేషపరాయణులకు ప్రసిద్ధము. కన్నులుపూర్ణముగ మూయనిచో డాఁగికొనువారు కనఁబడుదురు. మూసియుఁ బ్రయోజనముండదు. దీనికన్నులుచేరల కెక్కువయై యున్నవి కావునఁ గన్నులు మూయునది తామూయనని యనుచున్నది. సేయంతను జ్యోత్స్నా = శరీరచ్ఛాయాచంద్రిక, గాఢాంధతమసం = దట్టమగునంధకారమును, విఘటయతి = చెదరఁగొట్టుచున్నది. ఇతరులకుం దెలియఁబడకుండ నంధకారావృత మగుస్థలంబున డాఁగెనేని వెన్నెలవంటిశరీరకాంతి యాచోటియంధకారంబును రూపుమాపి యందఱకు నన్నుం దెలియునట్లు సేయుచున్నది. కాన డాఁగికొనువారు వైళంబ పట్టువడుదానిని జేర్పంజన దని తమతెగకవమానము రాకుండం గాఁచికొనుటకుం గడంగి తన్నుం జేర్చుకొనుటకు సమ్మతింపరు. అని యనుచున్నది. కడు దవ్వులకుం జని డాఁగికొనవచ్చునే యన్నచో:— సౌరభ్యం = దేహమునంగలపరిమళము, సఖీనాం = చెలికత్తెలకు, ఆహూతిం=పిలుపును, విరచయతి=చేయుచున్నది. పద్మినియగుకాంతకు దేహమందు దివ్యపరిమళ ముండునుగాన నీబాలికయు నాజాతిలోఁ జేరినదియగుటంజేసి పుట్టిసౌరభము శరీరమం దున్నది. ఇది పోయినమార్గమున సౌరభము గ్రమ్ముకొనుకారణముచేత దానిని నిరూపించి సఖు లక్రమమునం బట్టుకొందురు. ఎంతదవ్వుల కఱిగినను మార్గమున మూఁగినసౌరభము కాంచనమాల యీవైపునకుం జనియె, రండు పట్టుకొనుండు అని తెలుపుచున్నది కావునను డాఁగికొనువారలును తమతెగలోఁ జేర్చుకొనరు అని జననితోఁ జెప్పుచున్నది. ఇతి = అని, రుదంతీం తాం=ఏడుచుచుండునద్దానిని, తన్మాతా=దానితల్లి, హసితవదనా=నవ్వుదేఱుమోముగలదై, ముహుః=సారెకు, చుంబతి=ముద్దిడుకొనుచున్నది. తాను స్త్రీరత్నమగుటంజేసి తనకన్నులు చేరలకెక్కువయై యుంట కడు సౌందర్యవతి యగుటకుం దార్కాణ యని యెఱుంగక ముగుద యగుటంజేసి యిది యాటలాడుటకు లేకపోయెనే యని ఖేదపడుచున్నదే యేమి దీని మౌగ్ధ్యమని తల్లి దానిని దానియొక్కొక పల్కునకు ముద్దిడుకొనుచున్నది. ఇట్లే తక్కినరెండు నూహించున

అని వచించి యుద్దిష్టకార్యంబు సాధింపం బోతివి. అది విని యీకాంచనమాల తల్లి కడు సంతసించుచు నిట్టిరసికకులావతంసంబునను రాగంబు వడసినం గదా యీ కాంచనమాలరూపరేఖాదులు సార్థంబు లగును ఇతనియుక్తిమాధుర్యంబు కరం బరుదై తోఁచుచున్నయది. ఇంతదనుక నీయతివిలోభనీయాకృతికిం దగినవాఁడు రసికవతంసుం డుపలబ్ధుం డగునా! యని చింతం గూరుచుండు నాకు మానసంబునం గలిగియుండు నాకులభావం బిప్పుడు నివర్తించినయది. ఇట్టినరపాగ్రేసరులు తమకు రూపౌదార్యాదిగుణంబులఁ దద్దయు నర్హ యగుముద్దుగుమ్మలయందు ననురాగపూరితాంతరంగులు గాక పోరు ఈంపనిమ్మాచింత దీని కభినవయౌవనంబు సంప్రాప్తం బయినయనంతరము గదా నలుపకలయు. అందు కింకను రెండు మూఁడు వత్సరంబులు గడవవలసియున్నవి. ఆకాలమునకుం జూచుకొందము. అని యిట్లు సెప్పుకొనుచుం దనకూఁతు నూరడించె. ఓకవికులావతంసమా భవదనుగ్రహంబున నాయతిశయము సయితమిప్పుడ సమకూరినయది. దానికి ఫలంబుగ మాప్రియసఖియుం దనురాగంబుం గైకొని కంచుకవతిప్రార్థనం బంగీకరించి తదీయమందిరంబును భవదీయపాదకమలరజఃపరిపూతంబు గావింపుము.

కాళిదాసుఁడు. ఓకాంతాతిలకంబులార! మీపలుకులవలనకరంబు సంతసం బందితిని. ఆనాఁడు భువనేశ్వరీపాదవందనాభిరక్తి వైళంబ చనుచున్నవాఁడం గాన బాగుగ నిరూపింప నవ్వపడకపోయె. ఆబాలికావతంసంబె యిది యని నిర్ధారణ సేయంజాలక సంశయాక్రాంతమానసుండనై యుంటిని రూపరేఖావిలాసంబుల బరిస్ఫురమానభావంబునం బరగు బాలికామణు లెందఱో యుందురుగదా! ఆబాలికావతంసంబె యిది యగుటవలన నాకుం బరమామోదంబు సమకూరె. దీనితల్లి కంచుకవతి దీని ముద్దుగొనుచున్న నాతియేనా! దానివినయాదిగుణంబులకుం గడుసంతసించినాఁడ

నేపథ్యంబునం గలకలంబు గల్గఁగా,,

కాంచనమాలసఖులు తిరిగిచూచి. భయసంభ్రమంబులతో,,

ఓసి ప్రియసఖి కాంచనమాలా! అదె కనుంగొనుము; భోజభూపాలుని స్యాలకుండు కమలాలయాదేవిసహోదరుఁడు తురగారూఢుండై సమీపమున నుండు పురజనంబుల బ్రహరించుచు మనయుండుకడ కేతెంచుచున్నవాఁడు. ఇతఁడు కడు కఠోరుఁడు. రాజవల్లభుండు నగుటం జేసి తాఁ జేసినపనులకుం బదులు సేత యుండ దని గర్వంబుం గొనియుండువాఁడు. మఱియుం గామవశీకృతుండై సుందరీసందోహంబునం దక్రమం బాచరించుచున్నాఁ డని వింటిము. వీఁడు మనకాంచనమాలం గాంచెనేని చంచలితస్వాంతుండై యవినయంబునకుం గడంగక పోఁడు. ఏమి సేయం జనును అక్కటా! యీదుస్తరంపు దుఃఖసముద్రంబునుండి ప్రియసఖి నెట్లు తప్పింపం జనును. ఏమి సేయుదము?

తురగాధిరూఢుండై రాజస్యాలకుఁడు ప్రవేశించుచున్నాఁడు.

రాజస్యాలకుఁడు. ఆత్మగతమున

ఔరా! ఏమి యీచిత్రము! ఒకనిమిషకాలమునకు ముందీ వేశ్యాకన్యక బాలికయయ్యె. అప్పుడు బాల్యంబు వీడకయుండినయీయండజయాన యిట్టు లొక్కట యాడుకొనన నభినవయౌవనోద్భేదసుభగ యగుట కర మబ్బురంబై యున్నది. అరయ దీనియౌవనారంభము మున్మేషంబు ఈపుండరీకాక్షికి శైశవంబునన యుండినదానికి సూచుచుండ నప్పుడే,,

చం. ఉరమున నుబ్బిపోయెఁ గుచకుడ్మలము కన్నుల దీర్ఘభావముం,
బొలసిన నెచ్చెఁ గన్బొమలు పారెకు వక్రము లయ్యెఁ. జంచకుఁ,
గరము వచోవిలాసము గన్పడె వక్రము లౌచు మధ్యముం,
బరమతిసూక్ష్మముం గొనియె. భారము లయ్యె నితంబబింబముల్.

అదియునుంగాక యీరమణీశిరోమణికి యౌవనవిశేషోద్భేదంబువలన నంగకంబులం గలిగిన గుణవిశేషంబు కరము శ్లాఘనీయంబైనయది బాల్యంబువీడుచుండ నేకపదంబునన తారుణ్యంబు గూడుచుండ నప్పుడు.

ఉ. తనుభావంబు గటీతటంబు దొరఁగం దాఁ గైకొనె స్తనులో,
చనముల్ పాదవిముక్తచంచలగతుల్ శ్లాఘించు చంగీకరిం,
చెను వక్షంబు సరోజకుట్మలయుగశ్రీరమ్యతం బూనె యౌ,
వన మీకాంతకు భాంగకంబులగుణవ్రాతంబు వే మార్పఁగన్.

ఇది లీలాదేవిసైరంధ్రి యగుకంచుకివతికూఁతురు కాంచనమాల. దీని బహుదినంబులుగ రాజకులంబునం దనవారితో మెలఁగుచుండు దానిం గాంచుచు దీని రామణీయకంబున కచ్చెరువందుచు దీనినవయౌవనాగమసంప్రాప్తిం గోరుచుంటిని. మదీయభాగ్యబలంబునన కాఁబోలు నిది యిట్టిరమణీయావస్థం గాంచినయది. బహుకాలంబునకు నామనోరథంబు నీడేరె. దీని నాయింటికిం దోడ్కొనిపోయెద. ఈనగరంబున నానేయుంగడంగిన పనుల కడ్డముపల్కుట కెవ్వనికైనం దరం బగునే! ఏ నశ్వంబుం దిగి దీని నశ్వారూఢం గావించుకొని తోడ్కొని చనియెద. ఇట్లయిన నితరులు నన్నుం దటాయింపం జనుదెంచిరేని నాప్రియురాలు వారికి హస్తగత గాకయుండునట్లు గాచుకొననగును. ఇది సామాన్యకన్య యగుటంజేసి యిట్లు సేయుట యంతగా నపరాధంబుగఁ బరిణమింపదు. వైశిక మనోరథంబు నెఱవేర్చుకొననగు.

తురగంబుడిగ్గి. కాంచనమాలనెత్తి యశ్వంబుపైఁ గూరుచుండఁబెట్టెను.

సఖులు. హాహాకారంబులు సేయుచు చేచాటుచేసికొని,,

ఓసి! మనముద్దుచిల్క బావురుంబిల్లివాతం బడియెనే! యింక నేమిసేయం గలవారము. ఈక్రూరకర్మునివలన విడిపింపనినాఁ డీముద్దుగుమ్మ యొడలు విడుచు. ఇందు జంపుసేయం జనదు. ఎగ్గు వాటిల్లు. కాన వైళంబ చని మనయేలికసాని లీలాదేవి కీయద్భుతంబు విన్నవించితిమేని యాదేవి కుతూహలపడి కాంచనమాలను గాంచం దనకడకు రప్పించుకొనును. అట్లయిన నీ క్రూరునినిరోధంబు మనసఖికిం బాయు. ఒండుపాయం బిందుపయోగింపదు. ఇందు మనలోఁ గొందఱు పని విన్నవింపం జనుడు.

అనుకొనుచు సఖులలో గొందఱు నిష్క్రమింతురైరి.

కాంచనమాల. విన్ననైనమోముతో. కంపంబును భయంబును బెనంగొన. వాఁడి మిగులుచూపులఁ గాళిదాసునిం జూచి,,

ఉ. రాతిరి వోవు వేకడ రాఁగలఁ ధైర్యముఁ దుద్భవించుఁబో,
నూతనకాంతి తమ్మిసిరి నూల్కొనవ్వను సూపె యుంచు నీ,
భాతిని పంకజోదరనిబద్ధము షట్పది యాసఁ గాంచ సం,
భూతమదంబు హస్తి యొకపూనికి నబ్జిని సంహరించెడిన్.

కాళిదాసుండు. ఆత్మగతముగ,,

ఈయింతి తానుడికినపద్యంబువలనఁ దాను వనకిష్టుండైన ప్రియునిసమాగమంబునకుం గుతూహలపడుచుండఁగా దన యిష్టార్థంబునకు విరోధంబుగ నీకష్టునిచేతం బడవలసివచ్చె నయ్యయో యేమిసేతు ననుభావంబు నాకు సూచితము గావించినయది. ఈదుర్వృత్తునిమదం బడంచి యీనాతి నీసంకటమునుండి విముక్తం జేయ నగును.

ప్రకాశముగ,,

ఓరాజస్యాలక!

* శ్లో. చతురం తురగం పరివర్తయతః పథి పౌరజనాన్ప్రతిమర్దయతః,
నహి తే భుజవీర్యభవో విభవో భగినీభగభాగ్యభవో విభవః.

---

* టీ. పథి = మార్గమునందు, పౌరజనాన్ = అడ్డముగావచ్చినపురజనులను, ప్రతిమర్దయతః=ప్రహరించుచు, తురగం=గుఱ్ఱమును, చతురం = చాతుర్యముతో, పరివర్తయతః=ఆస్కందితము, ధౌరితకము, వల్గితము మొదలగునట్టి ధారావిశేషంబులతో నడిపించుచు, తే = ఇట్లు ప్రవర్తించుచుండునీకు, విభవః = ఇట్టివైభవము, భుజవీర్యభవః-విభవః=బాహువీర్యముచేత సంపాదించిన విభవము, నహి = కాదు. మఱి:— భగినీ భగభాగ్యభవః=నీతోఁబుట్టినదానిభగముచేసినభాగ్యమువలననైన, విభవః=వైభవము. నీ విట్లు మార్గమున కడ్డమువచ్చినవారిం బ్రహరించుచు గుఱ్ఱపుస్వారిసేయు వైభవము నీకు నీబాహువీర్యమువలన నైనది గాదు. మఱి నీతోఁబుట్టినదానియం దనురక్తుండై యుండుభోజునియందుం గలదాక్షిణ్యావిశేషము. అనిభావము.

రాజ స్యాలకుఁడు. వెన్నెఱపోయి, కాళిదాసునిం గాంచుచు. ఆత్మగతమున,,

కట్టా! వీఁడు నన్ను నిపుణంబుగ నుపాలంభించినవాఁడు. వీఁడు నన్నధిక్షేపించుట విని రథ్యాజనులు స్మేరముఖు లయి నన్నుం గాంచుచు నేగుచున్నారు. ఇంతకంటె నవమానం బేమి గలదు. వీనికి మాఱాడ్డితినేని యింతకంటె మిక్కుటముగఁ బరిభవంబు గల్గుట నిక్కంబు. కాన వీనితో మాటలాడం జనదు. మఱియు నీతఁడీయూర నుండునేని నావంటిగర్వితులగర్వం బడంచుచుండు. వీని నేవిధినైనం దుద ముట్టించుట యుత్తమంబు. అట్లయినం గాని నాగడంగినకార్యంబు నిరభ్యంతరంబుగఁ జరగదు. ఏవిధి వీనింజంపింతును.

చింత నభినయించుచు సోల్లాసముగ,,

ఆ! చింతితార్థంబు నెఱవేఱుచుకొనుటకుఁ ద్రోవ దొరికినయది. ఇట్లగునేని వీఁడు బ్రహ్మరక్షోహతుండై చచ్చు. ఇదియ కర్తవ్యంబు.

హస్తసంజ్ఞచే భటునిం బిలిచెను.

భటుండు ప్రవేశించి,,

ఆర్య! యే మాజ్ఞ యిడెదరు?

రాజ స్యాలకుఁడు. భటునికర్ణంబునం గొన్నియర్థంబులు వచించి,,

ఓరి! వైళంబ సని కార్యం బనుకూలింపం జేయుము.

భటుఁడు. అయ్య! మీయానతిం జరిపెదను. ముదలఁ గొనుచున్నాఁడను.

అని నిష్క్రాంతుం డయ్యె.

స్యాలకుఁడు. ఎదుటికి దృష్టులు నిగుడ్చి.

ఇదె లీలావతీపరిచారికలు గొందఱు త్వరితగతిం జనుదెంచుచున్నారు. ఏలకో!

చింతం గూరుచుండెను,,

లీలావతీపరిచారికలు ప్రవేశించి. ఒండొరులతో,,

ఓసి యిదేనఁటే మనకంచుకవతికూఁతురు కాంచనమాల!

ఏమే యీచిత్రము! ఈనాటియుదయంబున మనము సూచినప్పుడు బాల్యంబున నుండిన — ఇప్పుడిట్టితారుణ్యంబు నొందుట కరము చిత్రంబు గాదె! దీనిం గాంచుచుండెప్పుడెల్ల కమలాలయాదేవీసహోదరుం డీతండు శృంగారరసవశత్వంబుం జెందుచుండువాఁడు. వీఁడు దీనియౌవనాగమమునకుం బ్రతీక్షించుచుండినయర్థంబు రాజకులంబునం గలపరిచారికాజనంబునకెల్ల సువిదితంబ. ఇదియుఁ దగుసమయంబున నితనిచేతికిం దొరికె. లీలావతీసందేశంబుం జెప్పితిమేని యీనాతిని విడువం జాలఁ డుత్తలంపడు. ఎట్లైనను జెప్పక తప్పునే!

ఆర్య దేవి యగులీలావతి తనప్రధానసైరంధ్రిక కూఁతునకుం గాంచనమాలకు ననమయంబున వింతగ నభినవయౌవనంబు గలిగె నని విని యాకనకాంగిం గాంచం దలంచి దానిం దోడ్కొనిరమ్మని మమ్మిందఱ నంపియున్నది. దేవీనియోగం బనుష్ఠింపం జనును.

స్యాలకుఁడు. చింతతో ఆత్మగతమున,,

కట్టా! చేయలంతిం దొరికినబంగారము చేయిజాఱిపోవున ట్లున్నది. ఏమి సేయనగును. దేవియానతి దురతిక్రమణీయము. తదీయపరిచారికాజనంబునకుం దదాజ్ఞాప్రతిపాలనంబు నప్రతిషేధ్య మగు.

అనిచింతించుచూరకుండె,,

కాంచనమాల. ఆత్మగతమున,,

ఇదియ వీనిచేతినుండి తప్పించుకొనుటకుం దగుసమయము.

గుల్మమునుండి దిగ్గనుఱికి లీలావతీపరిచారికాజనంబుతోఁ గలసికొనియె.

నియోగిజనులు కొందఱు ప్రవేశించిరి.

నియోగులు. ఈరాజస్యాలకుండు మనకుం జెప్పిపంపినరహస్యంబు నెఱుప మన మిర్యాద కేగుదెంచియున్నారము గాదా! వీఁడీపాపం బెవ్వనియందు జేయం దలంచినవాఁడో?

కాళిదాసునిం గాంచి,,

వ్వనియందని విచారింపనేల! యీమనోహరాంగునియందె యని నిర్ణయింపం జను. వీఁడు రూపవంతులం జూచి యోర్వంజాలనివాఁడు. ఈతేజోవంతునెదుట గాఢాంధతమసంబు సూర్యునెదుటం బోలె రాజస్యాలకకృతం బగునికృతి యడంగక పోవునా! అయిన నతఁడు నేయుకపటంబు కడు దుస్తరంబు. ఎట్లయ్యెడినో! మనకుం జేసినయాజ్ఞ యనుష్ఠింపక తీరదు గదా!

కాళిదాసునిం దరిసి,,

కవివరా! వందనము! ఈధారానగరంబున భోజభూపాలుండు తననగరంబున నుండువారిం గడుసమర్థులశిల్పివరులం గొని సకలజననయనమనోహరంబుగ నొకభవనంబు వినోదార్థంబుగ నిర్మించి దానం గ్రొత్తగ నీయారికిం జనుదెంచినవారలం గని పిలిచికొనిపోయి యాతిథ్యంబు నేయ మమ్ము నియోగించియున్నాఁడు. మేమును బ్రతిసంధ్యము సంచరించుచు సాధువులం గనిపెట్టి తోడ్కొనిచని వారలకు విందొనర్చుచుందుము. నీవు కవికుల వర్యుండవు. నిన్నుం బూజించితిమేని యీధారాపతి యొనరించినపని సార్థకం బగును. మాప్రార్థనం బంగీకరించి మావెనువెంట రమ్ము.

కాంచనమాలయు సఖియలును ఆత్మగతంబున,,

కట్టా! ఈ నియోగిజనులు రాజస్యాలకునిమూర్ఖ్యంబునకు లోనై యీమనోహరాంగిని బ్రహ్మరాక్షసునికి భక్ష్యంబు గావింపం గడంగి యుండెదరు. వీరలు చెప్పిన భవనంబు ప్రాంతరథ్యయందుం దున్నది. అది నిర్మించిన దాదిగ ననేకులు పాంథులేమఱుపాటున నాయింటం బరుండి దానిం గాచియుండు బ్రహ్మరాక్షసునిచేత భక్షింపంబడి మడిసి రని యిది యీయూర నెల్లరకుం దెల్లం బయినయది. భూతాధిష్ఠితం బైన యీమందిరంబునకుం గొనిచని యీకవిచంద్రునిం జంపం బోయెదరు. ఏమి సేయవచ్చు? ఈమన్మథోపమునికిం గలిగినదుస్తరంపుటెడరు నెట్లు తొలంగింపవచ్చు. కట్టా! యిట్టి యాపదకుం బాల్పఱిచి విధాత యీతనియం దకార్యంబు సేయం గడంగె. దైవమా నీకఠోరచరితంబు నేమనంజాలుదును. నీ సేయంగడంగినపనులకుఁ బ్రతివిధానంబు లేక యున్నది. ఓయనాథరక్షకా! శ్రియఃపతీ! నీవ యీకవిం గావంగలవాఁడవు.

కాళిదాసుఁడు. ఓయధికృతులార! మీప్రార్థితార్థం బనుష్ఠింప నే సిద్ధపడి యున్నవాఁడ. పోదము రండు. ఆభవనం బనల్పశిల్పనైపుణసీమం బని విందు. దానిం జూడఁగోరిక నాకును గలదు.

కాంచనమాల. ఆత్మగతమున,,

ఆ! ఏమి సేయుదు? ఈకవివరుండు నియోగిజనులప్రార్థనకు సమ్మతించిన వాఁడు. ఈజగన్మంగళరూపనిర్మాణుని మొగంబుం గాంచనినాఁడు నే నీయొడలు దొరంగుట నిక్కంబు. ఈతని కేదేని యిడుమ దొరకిన నాప్రాణంబులుండవు. ఈ యభినవమోహనాకారునితో నయ్యెడకుం బోఁ జన దని వచింతు నన్నను ఈరాజస్యాలకునికిం గోపంబు గల్గు నని తోఁచుచున్నది. ఇందుఁ జేయంగలకార్యం బిది యని నాడెందంబునకుం దోఁపదు. ఈసుకుమారాకారునిం గూడనినాఁడు నాకాయంబు దురంతవేదనానికాయంబై యడంగుట నిక్కంబు.

లీలావతీపరిచారికలు. ఓసీ! గాంచనమాల! దేవి నిన్నుం గాంచఁ ద్వరపడి యుండెను. పోదము రమ్ము.

అని దానిం దోడ్కొని చనిరి.

కాళిదాసుండు ఆత్మగతమున,,

కాంచనమాల దైవవశమున నీయవినీతునిచేతినుండి విముక్త యయ్యె. లీలావతీదేవికడకుం దోడ్కొనిపోఁబడియెడిని. కావునం దదాజ్ఞానుసారిణి యై కంచుకవతి యాత్మతనూజాతయభీష్టార్థంబు నెఱవేర్పక పోదు. క్రమక్రమముగ నిది నాకు లభించు. ఇప్పుడు ప్రియావిరహవిక్లబం బయినమానసంబున నీకాంచనమాలం గాంచి యించుక యాశ్వాసంబుం జెందఁ నగు నని తలంచుకొనుచుండ విధి యీకాంచనాంగినిసయిత

మెడబాపుచున్నది. ఇప్పుడు ప్రతికూలప్రవర్తనంబున నుండువిధి యనుకూలప్రవర్తనంబునకుం గడంగక పోదు. ఈనియోగిజనులు పిలుచుభవనంబునకుం జని యందు జరుగు కార్యంబులచేఁ గొంత ప్రొద్దుపుచ్చెదను.

కాంచనమాలసఖులు. ఓసి మనప్రియసఖి ! యీకవివల్లభునియం దనురాగంబుం జెందినయదియ. ఇతని కేదేని యప్రియంబు గల్గిన జీవితమునుసయితము పరిత్యజింపం గడంగు. ఇప్పు డీకవివరునికిం గలిగినయాదరున నితనికి రహస్యస్థంబు విన్నవించినచోఁ దప్పించుకొనం గలఁడు లేనిచోఁ బ్రహ్మరాక్షసునివాతం బడును. మనలో నెవ్వతె యైనం గాననుసరించుకొని యాభవనంబదనుకంజని యయ్యెడ వేచియుండి తటి దొరకిన నితనికీకపటంబు విన్నవింపవలయు. ఇందు కీమధురవచనయ సరి.

రాజస్యాలకుఁడు. ఆత్మగతమున,,

పోని మ్మాకాంచనమాల ; రాజకులంబుననయుండునది ; నాకుం దొరకకపోవునే ! ఇప్పుడు నాసేయంబూనినకపటంబునం గాని పిలుకుమార్చి మానసంబునకు సుస్వస్థతం గలిగించుకొనియెద. తదుచితసంవిధానంబు జరుపంబోయెద.

అనినిష్క్రాంతుండయ్యె.

కాళిదాసుఁడు.

చం. ప్రియను దలంచి మానసము పెక్కుతెఱంగులఁ గుందసాగె నా,
నియతికి నాత్మలో నిపుడు నెమ్మి యొకించుక యేని గల్గ దా,
శ్రయ మొకటైన లేక మది సంతతదుఃఖము వాయకున్న దిం,
తయు వనజాయతాక్షునికృతం బడలం బనిలేదు దీనికిన్.

కం. వనజాక్షునిదయ గల్గిన । ఘనతరదుఃఖాంబునిధిని గాల్వరుఁ బోలెన్,
జనులు దరింతురు నా కతఁ(డనఘుఁడు శరణంబు గాక యన్యుఁడు గలఁడే.

ఇప్పుడు రాజనియోగిజనంబులతోఁ జని చిత్రసీమం బనుపేరం బరఁగుభవనోత్తమంబుం గనుంగొనుచు రాత్రి పుచ్చెదను.

అని నియోగిజనంబుతో నిష్క్రాంతుండయ్యె.

కాంచనమాలసఖులు. ఈమధురవచన కవివెంట నరుగుంగాక. మనమందఱము గృహంబులకుం బోవుదము.

అని యందఱు నిష్క్రాంతలైరి.

ఇది కాళిదాసచరిత్రప్రకరణమునందుం
షష్ఠాంకము ముగిసెను.

శ్రీరస్తు.

శ్రీః.

## కాళిదాసచరిత ప్రకరణము.

## సప్తమాంకము.

---

భోజభూపతియు లీలాదేవియుం బ్రవేశించుచున్నారు.

భోజుఁడు. దేవీ! నీ విప్పుడు వింత యైనలేనగవుతోఁ గనుపట్టుచున్నావు. దీనిం గాంచ నీముఖపారసంబువలన నేఁ గ్రొత్తలం దగు శ్రవణానందం బొందఁ గల దని తోఁచుచున్నది. అట్టి దేదేని యుండిన నీనుడువు విం దొనర్పుము.

లీలాదేవి. స్మితముగావించుచు,,

ఆర్యపుత్ర! భవదీయం బగువదనారవిందంబు మందహాససుందరంబై యొప్పనది యిప్పు డీషత్సంశయాకులం బగుచుండుటం గాంచిన మీరు న న్నే దే నొక యర్థం బడుగం దలంచినట్లు సూచితం బగుచున్నది.

భోజుఁడు. దేవీ! నీతర్కం బుపపన్నంబు. కొన్ని దినంబులనుండి యొకకొంత కాంత నానయనపథంబునం దగులుచున్నది. అది మనసైరంధ్రి యగుకంచుకపతికూఁతురు కాంచనమాల యని యూహింపం దగియున్నను దానికూఁతురు శైశవంబునన యుండునది గాన నాసంభావన యసంభావితంబై కనంబడుచున్నది ఆకాంత యెవ్వతెయో యని సంశయించుచున్నవాఁడ.

లీలావతి. లేనగవుతో,,

ఆర్యపుత్ర! ఆవింతకాంత యెవ్వతె యని మీ రనుకొంటిరి.

భోజుఁడు. దేవి! అది కాంచనమాలయే యని నిర్ణయించుకొనియుండెదను. కాంచనమాల యయ్యేనేని యిప్పుడ తరుణియయి చూపట్టం గతంబు లేదు. కాన సంశయించెదను.

లీలావతి. ఆర్యపుత్ర! మీరొనరించిననిశ్చయంబు యథార్థంబ.

భోజుఁడు. వైచిత్ర్యంబుతో,,

దేవి! యేమి యిది! అది కాంచనమాలయేనా! అ ట్లైన దాని కభినవయావనాగమం బకాలంబున నెట్లయ్యె?

లీలావతి. ఆర్యపుత్ర! ఒకమహాకవివలన నది లభించినయది.

భోజుఁడు. ఆశ్చర్యంబుతో,,

దేవి! యిది కడు చిత్రమై యొప్పుచున్నది. అట్టిమహాత్ముం డెవఁడో! అకాలంబునన యావనాగమము గలుగునట్లు వచించిన యామహాత్ముని వాక్సిద్ధి నేమందును! ఈవృత్తంబును సాకల్యముగఁ దెల్పుము.

లీలావతి. ఆర్యపుత్ర! విన్నవింతు వినుండు.

అని రాజుచెవిలోఁ జెప్పెను.

భోజుఁడు దేవీ! నీచెప్పినకవి కాళిదాసుండై యుండవోపు! కానివాఁడితని వచనంబుల నర్థంబును వర్తించుట యెక్కడిది? అట్టి వాక్సిద్ధి యాతనికే గలదనియే తెలియంగుదును.

ఇతనిం గాంచం గోరి బహుదినములుగ నేఁ బ్రయత్నించుచున్నవాఁడ. ఇట్లుండ నేను నామంత్రి యగునార్యబుద్ధిసాగరుండు నొకనాఁడు వేషాంతరధారులమై నగరపరీక్షార్థంబు వ్యాహ్యాళిక నరుగుచు నం దొకమాంసాపణముదగ్గఱ సన్యాసి నిలువంబడి పలలము బేరమాడుచుండుటం గాంచి ఆ! మననగరమందు నిట్టియధర్మము జరుగుచున్నదిగదా! యని యచ్చెరువందుచు నతనివృత్తాంతము నెఱుఁగ నెంచి యాతనిం జేరి నే నిట్లంటిని.

* శ్లో. భిక్షో మాంసనిషేవణం కిముచితం,,

అని యడుగఁగా నతఁ డిట్లనియె.

† శ్లో. కిం తేన మద్యంవినా,,

అనఁగా నితం డింతటితో నుండువాఁడు గాఁడు; మద్యంబునను బ్రియంబు గలిగియున్నాఁడు. ఆ! ఏమి వీని సన్యాసప్రకార మని యనుకొని యిట్లంటిని.

‡ శ్లో. మద్యం చాపి తవ ప్రియం,,

అనఁగా నతఁడు,,

§ శ్లో. ప్రియం మహో వారాంగనాభి స్సహ,,

---

* భిక్షో = ఓరిసన్యాసీ! మాంసనిషేవణం = మాంసభోజనము, ఉచితంకిం = యుక్తమాయేమి?

† మద్యంవినా=మద్యములేక, తేన=ఆమాంసముచేత, కిం=ఏమిప్రయోజనము.

‡ తవ=నీకు మద్యంచాపి=మద్యముసయితము. ప్రియం = ప్రియమా!

§ వారాంగనాభిస్సహ = వారాంగనలు త్రాగఁగా శేషించినది వారిలతోఁ గలసిత్రాగుట, ప్రియమహో=ప్రియము:

అనెను. అది విని నేను మనంబున మద్యపాననిరతునికి వారాంగనారతియు నత్యంతస్ఫుటంబు గాకపోవునే యని తలంచుచునట్టి వారాంగనారతి ధనాఢ్యునికి గాని భిక్షుకునికెట్లు దొరకంబోవు నని శంకించుచు నాతనితో,,

* శ్లో. వారస్త్రీరతయే కుత స్తవ ధనం,,

అని యడిగితిని. అందు కాతఁడు,

† శ్లో. ద్యూతేన చౌర్యేణవా !

అనఁగా నే నతనిపల్కులకుఁ గడు నెవ్వెఱపోయి మనంబున నితని కీభిక్షు వేషం బెక్కడ? చౌర్యద్యూత వారాంగనాసంగమమద్యపానమాంసభక్షణంబు లెక్కడ? బ్రహ్మవిద్యాపరిశ్రమమున కుచితం బగునీపావనాశ్రమము స్వీకరించుట కిదియా ఫలంబనుకొని యి ట్లంటిని

‡ శ్లో. చౌర్యద్యూతపరిజ్ఞతాఽస్తి భవతః,,

అని యడుగఁగా నతఁ డి ట్లనియె.

§ శ్లో. భ్రష్టస్య కావా గతిః,,

అనఁగా విని యది యేను మున్ను సన్యాసి యొకండు కాంతానురక్తుండై యాశ్రమాచారభ్రష్టతం జెంది బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతియు సంసారసుఖ సంప్రాప్తిరహంబును గాంచి రెంటికిం జెడినరేవణయై యుండ నదిసూచి తద్వర్తనం బరయం గోరి కవిసంఘంబున కీసమస్య యొసంగినాఁడ. ఆసమస్యార్థంబును నాకుం దెల్ప మనకవులలో నెవ్వఁడేని యిట్లు వేషాంతరధారియై వచ్చి నా కీయర్థం బెఱిగించెనో! యని సంశయించుచు నాయర్థం బార్యబుద్ధిసాగరునితోఁ జెప్పఁగా నతండు రాజా నీ

* వారస్త్రీరతయే = వారకామినులతో రతి సేయుటకు, తవ = నీకు, ధనం= ద్రవ్యము, కుతః=ఎట్లుదొరకును ?

† ద్యూతేన = మధ్యాహ్నమందు జూదమాడుటచేతను, చౌర్యేణవా = రాత్రి వేళల దొంగతనము చేయుటచేతను సంపాదించెదను.

‡ భవతః=నీకు, చౌర్యద్యూతపరిజ్ఞతా=దొంగిలించుటయందును, జూదమాడుట యందును, పరిజ్ఞానము, అస్తి=కలదా !

§ భ్రష్టస్య=వర్ణాశ్రమాచారమువలనం జెడినవానికి, గతిః=గతి, కావా = ఎది. వర్ణాశ్రమాచారపరిభ్రష్టుని నెవ్వరు నాదరింపరు గాన నట్టివాని కీరీతి గాక లోక యాత్ర జరుపుకొనుటకు గతి యే మున్నది ?

సభయం దీపాటిసమర్థుం డగుకవి లేఁడు. ఇతఁడు క్రొత్తగ వచ్చి చేరియుండం జనును. నీయొనర్చిన యూహయుపపన్నం బైనయదియ. అయిన నిప్పు డితని నింతటి నొప్పరికించి యుండినం గొన్నిదినంబులకు వాస్తవాకారంబుతో వెలువడకపోఁడు. ఇట్టి మహాకవి భవత్సందర్శనంబునకు రాక మానఁడు. అనఁగా నేను మనంబున నీవిద్యావంతుం డెవ్వఁడో! మన్మనోగతార్థంబును దెల్పినవాఁడు. ఈయర్థంబు విచారించి యిదిసత్యం బగునేని యితని మహాకవి యగుకాళిదాసుండుగా నెంచవచ్చు నని తలంచుకొనుచుం బోయి కొన్నినాళ్లకు గూఢచారులవలనఁ బూర్వ మేను గాంచినభ్రష్ట సన్యాసి మద్యపానాదిరక్తుండై యుండుటయు నెఱింగి సత్యంబువల్కనకవివచనంబులఁ దలంచుచు నాతనిపునస్సమావేశమున కువ్విళులూరుచుండువాఁడను; బహుతర ప్రయత్నంబులు సల్పియు సఫలమనోరథుండఁ గాకయుండెద. ఆనాఁడు పణ్యవీథికయందు గానంబడినవాఁడె కాంచనమాలయం దీకడునబ్బురంబుం గాన్పించినాఁ డని తోఁచెడిని. నీ వీకాంచనమాలను రప్పించుకొనఁగానే యాకవియెక్కడకేగెనో! ఎవ్వరి కైన విదితంబె?

లీలావతి. ఆర్యపుత్ర! భవదీయస్యాలకుండు కమలాలయాసహోదరుండు వానినిక్కృతిమెయి బ్రహ్మరాక్షసాధిష్ఠితం బగుచిత్రసీమం బను నూతనభవనంబునకుం దదధికృతులంగొని తోడ్కొనిచనిరియె నఁట.

భోజుఁడు. ఉద్విగ్నుండగుచు,,

కట్టా! ఈకఠినచిత్తుండు కవివరుని సమయించి యీలోకంబున భారతీవిలాసంబుమాపం గడంగినవాఁడు. వీనికంటెఁగడుఁ గష్టుండును గలఁడె? ఇప్పటి కాకవిగతి యేమయియుండునో!

ఒకసుందరి ప్రవేశించి. దేవి! జయంబగుంగాత. నీకుం గాంచనమాలయందుఁ గరము ప్రీతి కలదుగాన దానిసేమంబు నీకు విన్నవింపం జనుదెంచితిఁ.

లీలావతి. సంతోషముతో,,

ప్రాణనాథ! ఈ మధురవచన నుడివినవచనంబులచేఁ గవివరుండు జీవించి యున్నాఁడని యెఱుంగం జనును. మీ కతనిం గాంచం గల్గు.

సుందరిం గాంచి,,

ఓమధురవచనా! నీవు కవివృత్తాంతం బారయ నాతనితోఁ జిత్రసీమంబునకుం జని యున్నట్టు లాకాంచనమాల వచియించె. ఆమందిరంబునం జరిగినవృత్తాంతంబుఁ దెల్పుము.

మధురవచన. దేవీ ! కవికులచంద్రుం డగు నామహనీయునిమహిమ యింతింతని చెప్పం దరంబు గాదు. స్వాలకచోదితు లయి నియోగిజను లాకవిని నిక్కృతి మెయిం జంపంగడంగి వినయంబుఁ గాన్పించుచు నాబ్రహ్మరాక్షసాధిష్ఠితం బైననూతనమందిరంబునకుం గొనిపోయి యాతిథ్యం బొసంగి మృష్టాన్నపానాదులఁ బరితృప్తునిం గావించి మహోన్నతశయనంబునం బరుండం జెప్పి చనిరి. ఏను నాకవి పరుండినశయనంబుసమీపంబున స్తంభాంతర్హితనై యామందిరంబులోన నితరుల కెఱుకపడకుండం గవి వృత్తం బరయం గోరి నాప్రాణంబు లాకవివరుండు గావం గలవాఁ డనుధైర్యంబులో నుంటిని. అట్లుండం దొలిజామున,

ఉ. జంజాటుపల్లవెంద్రుకలు జొల్లు దొరంగెడునల్లసృక్వ మా,
యంజనశైల మట్లు నలు పారుమహోన్నతమైనకాయముం,
గుంజరదంతకుంతసమఘోరతరాకృతి దీర్ఘదంష్ట్రిలున్,
పంజులఁ బోలుకన్ను లకుభస్థితి నొప్పెడురక్కసుం డొగిన్.

కవి యుండుచోటికిం జనుదెంచి యోరీ ! నేను బ్రహ్మరాక్షసుండను ; ఈగృహంబుం గాచియున్నాఁడ. నానడిగినసమస్యలకుం దగునుత్తరంబీనినాఁడు నిన్నుం జంపుదు. ఇట్టిమందిరంబునం బడవులంబట్టి నాచేత మడిసినవారల లెక్కింపం దరంబు గాదు. నీవునట్లు నాచే భక్షితుండవు గాఁబోయెదవు సుమా ! నాకుత్తరంబీఁగలవా ! నుడువుము. అని యిట్లు సెప్పె.

బ్రహ్మరాక్షసుఁడు.

శ్లో. సర్వస్య ద్వే,, అనినుడివెను.

భోజుఁడు. ఓదేవి ! యిది పాణినిముని రచించినయష్టాధ్యాయియం దెనిమిదవయధ్యాయంబునందలి మొదటిపాదపు మొదటిసూత్రము. ఈవ్యాకరణసూత్రము వీప్సాఽభీక్ష్ణ్య వ్యాజాద్యర్థంబులందుం గొన్నిశబ్దములకు శబ్దస్వరూపమునకంతటికిని ద్విరుక్తి గలుగు ననునర్థంబు దోఁపింపం జెప్పంబడినది. దీనికి లౌకికార్థంబు సుయోజితముగావించి వచింపవలయు ననునుద్దేశంబుచే సమస్యగా నీఁబడియె. దీని కతం డేముత్తరం బొసంగంగలవాఁడో ! యారయ నగు. మధురవచనా ! అనంతరం బేమయ్యె? వచింపుము.

మధురవచన. మహారాజ ! ఆకవి యారాక్షసు నించుకేనియు సరకుసేయక తత్క్షణమె యిట్లనియె.

కవి. శ్లో. సుమతికుమతీ సంపదాపత్తిహేతూ,, అని.

భోజుఁడు. ఔర ! ఆవ్యాకరణసూత్రమునకు లోకవ్యవహారానుగుణముగ నర్థయోజనంబు గల్పించి తదనురూపముగ సమస్యాపూరణంబు గావించిన యాకవివరునిబుద్ధిచతురత కరము మెచ్చం దగినది. అంత నేమయ్యె ?

మధురవచన. మహారాజ! ఆరాక్షసుండు కవి వచించినప్రత్యుత్తరంబు విని యెప్పుడేమియుం జెప్పక చని రెండవయామంబున నెండియుం జనుదెంచి యాతనిం జేరి యోరీ! యీసమస్యను సముచితము పూర్ణము గావింపు మట్లు సేయనినాఁడు నిన్ను భక్షించెదను. అని యిట్లు సెప్పె.

బ్రహ్మరాక్షసుఁడు. శ్లో. వృద్ధో యూనా,, అని.

భోజుఁడు. ఓసి! ఇదియుం బాణినిసూత్రమే! గోత్రప్రత్యయాంతశబ్దమునకుఁ బ్రాచీనులు వృద్ధసంజ్ఞ వక్కాణించిరి. యువప్రత్యయాంతశబ్దముతో సమాసముఁ జెందిన గోత్రప్రత్యయాంతశబ్దము శేషించు ననునర్థంబు గలయిది యేకశేషాధికారమునం దున్నది. దీనికిని లౌకికార్థయోజన మతం డెట్లు గావించెనో! ఇవ్విశేషములు లంతఁ గదా! కవివరులబుద్ధి ప్రకటితము గావలయు. మధురవచనా! అంతు కాకవి యేమి ప్రత్యుత్తర మొసంగె?

మధురవచన. మహారాజ! అతని బుద్ధివిశేషం బసాధారణంబు. అవధరింపు మారక్కసునినోట మాట వెడలుడు నప్పుడ యతండు వచియించె.

కవి. శ్లో. సహపరిచయా త్త్యజ్యతే కామినీభిః,, అని.

భోజుఁడు. శ్లాఘించుచు,, ఆకాశమునలక్ష్యమొనరించి,,

భళిర! ఓకవీ కవియనుశబ్దంబు నీకే తగును. బాగుగ నతికింగి పల్కితివి. ఓ మధురవచనా! ఆకవివృత్తంబు వినంబయింబయిం గుతూహలం బయ్యెడిని. వచింపుము.

మధురవచన. మహారాజ! ఆబ్రహ్మరాక్షసుం డది విని మిన్నక చని మూఁడవ యామంబున వెండియుం జనుదెంచి కవింజేరి యీసమస్యను సముచితము పూర్ణము గావింపనినాఁడు నిన్నుం దినక పో నని యి ట్లనియె.

బ్రహ్మరాక్షసుఁడు. శ్లో. స్త్రీ పుంవచ్చ,, అని.

భోజుఁడు. ఓసి! ఇదియు నచ్చోటిసూత్రమే! గోత్రప్రత్యయాంత మగుస్త్రీ వాచకశబ్దము యువప్రత్యయాంతముతో సమాస మగునపుడు శేషించు. అది హేతువుగా నాగోత్రప్రత్యయాంతము పుంలింగశబ్దమువలె నగును. అనునర్థంబు గలది. కవి తనబుద్ధికౌశలంబున నె ట్లర్థాంతరయోజనంబు చేసెనో తెల్పుము. దీనికిని లౌకికార్థ యోజనంబు సుకరంబు గాదు.

మధురవచన. మహారాజ! ఆబ్రహ్మరాక్షసునినోట మాట వెడలుటయు తడవు గాని కవి వచించుట కొంకించుకయు నాలస్యంబు లేకుండె. అట్లు చెప్పినదాని నుఁ గవి యిట్లనియె.

కవి. శ్లో. ప్రభవతి యదా తద్ధి గేహం వినష్టం,, అని.

భోజుఁడు. ఓసి! యిట్లు వ్యాకరణసూత్రమునకు సంగతమగు లౌకికార్థయోజన ముంగల్పించుట కలంతులకగునే! కడుమహనీయుం డనంజను. అంత వారలవృత్తం బెల్లు ముగిసె.

మధురవచన. మహారాజ! అప్పుడు కవిపల్కులువిని యాపాలసుదిండి యేమి యు ననక చని నాల్గవజాము న పైళంబ సనుదెంచి కవిం జేరి యోరీ! మను క్తంబగు సమస్యాత్రయము ను పూర్ణము గావించితివి. ఇఁక నొకటి గలదు. దానికి సయితము సంగతార్థంబుగ వచించితి వేని భవదభీష్టార్థంబు సమకూర్తు. లేనినాఁడు నిన్ను భక్షింతును. అని యిట్లువక్కాణించె.

బ్రహ్మరాక్షసుఁడు. శ్లో. ఏకో గోత్రే,, అని.

భోజుఁడు. ఓసి! యిదియు నాపాణినిసూత్రమే. అపత్యప్రత్యయములు పెక్కు చోటం జెప్పఁబడినది. గోత్రార్థంబున నపత్యప్రత్యయములు పెక్కులు రావలయు నేని వానికిఁ బదు లొక్కటియే వచ్చు నని దీనియర్థము. దీనికిం గవి వచించిన దేమి?

మధురవచన. అట్లు బ్రహ్మరాక్షసుండు పల్కఁగాఁ గవి మందస్మితసుందరవద నారవిందుఁడై కవి యిట్లనియె.

కవి. శ్లో. * ప్రభవతి పుమాన్ యః కుటుంబం బిభర్తి,, అని.

భోజుఁడు. ఓసి! యేమి యీకవిచతురత! ఒకయర్థంబునకు మఱియొకటి వెదు దీయకుండం జెప్పినవాఁడు. ఇట్టి వాగ్వైచిత్ర్యంబు గలకవియందు స్యాలమునకిం గాక యితరునికి నరహంతకునైన దయారసంబు గల్గక పోవునే! అనంతర మాబ్రహ్మరాక్ష సుండు కవియం దెవ్విధిఁ బ్రవర్తించినవాఁడు?

---

* సర్వస్య ద్వే, ఇత్యాదులకు లౌకికార్థము.

టీ. సర్వస్య=సమస్తమునకు, సంపదాపత్తిహేతూ = సంపదలకును విపత్తులకును గారణములైనవి, సుమతికుమతీ = మంచిబుద్ధి చెడుబుద్ధులనునవి, ద్వే = రెండు.

యూనాసహపరిచయాత్=యౌవనముగలవానితోఁ బరిచయముసల్పుటవలన, కామినీభిః=స్త్రీలచేత, వృద్ధః=ముసలివాఁడు, త్యజ్యతే=విడువంబడును.

స్త్రీ=ఆడుఁది, పుంవచ్చ=పురుషునివలె, యదా=ఎప్పుడు, ప్రభవతి=పెత్తనము దీర్చునో! తత్ గేహం=ఆ యిల్లు, వినష్టంహి=చెడిపోయినదే.

గోత్రే=కులమునందు, యఃపుమాన్ = ఏపురుషుఁడు, కుటుంబం=కుటుంబమును, బిభర్తి=భరించునో; ఏకః=అట్టివాఁడొక్కరుఁడే, ప్రభవతి=కుటుంబమున సమర్థుఁడగు చున్నాఁడు.

మధురవచన. దేవ ! వినుము. అంత నాబ్రహ్మరాక్షసుండు వినయంబు మెఱయఁగ వివరుం గనుంగొని యోమహాత్మా ! యేను భోజభూపాలుండు వినోదార్థము నిర్మించుకొనిన యీయింటం బ్రవేశించి యీసమస్య లడిగి వానిం బూర్తిసేయ వలంతులు గాకయుండ నట్టివారి నెల్ల భక్షించితిని. నాసమస్యలభావం బెఱింగి పల్కుటం జేసి నీయందుఁ గరం బనురాగంబుం గొంటిని. నీయభీష్టార్థం బేదేని సమకూర్పం గడంగి యున్నాఁడ. నీకార్యం బొనర్చి కృతార్థతం గనం దలంచెదను. అని సవినయంబుగం బ్రార్థింపఁ గవియు రాక్షసుం గాంచి యిట్లనియె. ఓభూతనాయక ! నీ కీభూతలంబునం జరుగుచుండువృత్తంబు లెల్ల నారయుచుం దెలిసికొనుచుండుదివ్యజ్ఞానంబు గలదు గదా ! నాప్రాణదయిత యగుమధుమంతపురాధీశుని పుత్రి మదనసేన నన్నుం బాసి పోయినవిధంబును నీకుం దెలిసినది యే ! ఆకన్యకావతంసం బిప్పు డెయ్యెడ నున్నదో నీదివ్యజ్ఞానంబున నెఱింగి నాకుం దెల్పుము. ఇదియ నాకు నీవు సేయఁదగునుపకారము. అనిన నప్పుడ యంతర్హితుండై యారాక్షసుండు మఱునిమిషంబున,

సీ. పరిణతకేతకీపరిపాండుదుర్బలరమణీయతరకపోలములదాని,
ధూళిధూసరము లై తూఁగుముంగురులతోఁ గడు విన్ననైనమొగంబుదాని,
కరుణరసంబె యీకనకాంగి రూపున వెలసెనో యనునట్లు వొలుచుదాని,
విరహవ్యథాభారవివశతావైచిత్రి యంగకంబులఁ బొలుపారుదాని,

గీ. జీర్ణమై కడు మాసినచీరదానిఁ । గంతుఁ బాసినరతియ నాఁ గ్రాలుదాని,
భూభువనలక్ష్మియే యనఁబొలుచుదానిఁ। దెచ్చెనొకరూపసారయామచ్చెకంటి.

దేవ ! వినుము.

ఉ. ఆరమణీయగాత్రిసొగ సారసి చూడ సరోజవాసినీ,
భారతులందు దేవపతిభామినియందు సుమాస్త్రరాణియం,
దారఁగ నుండఁ బోల దన నచ్చర లెంతటివారు తన్నవో,
దార మనోజ్ఞవైఖరికి ధారుణిఁ గాంతలు సాటిసేరిటన్.

దారుఫలకాశయితయై భూతనాథసమానీత యయినదాని నాకాంచనాంగిం గని కవియు నవిరళబాష్పధారలు నయనకమలంబులం దొరంగ నిట్లనియె.

ఉ. కామిని నీవు నాకొఱకుఁ గాఱియ నొందుచునున్నదాన వా,
కామనిశాతబాణహతిఁ గన్నియ యీవిధి గ్రుక్కుచున్నవో,
ద్దామవియోగదావశిఖిదాహముఁ గాంచుచు నుండె దయ్యయో,
భామిని యిట్లు నీవు పడుపాటులు సూచి సహింప లే నెదన్.

అనిచెప్పి బ్రహ్మరాక్షసునిం గాంచి యోభూతనాథ! యీకామిని నిశాశ్రతంబు నలుపుచుం గడు డస్సి శ్రమాకుల యయి నిదుర గూరుచున్నయది. ఇది యెయ్యెడ నీ కుపలబ్ధ యయ్యె? అని యడిగిన నారక్కసుండును గరూశపతిపురంబున నొకమనోహరోద్యానంబునందు నా కీమచ్చెకంటి దొరకినయది. అనినం గవియు నోభూతనాథ కరుణించి యీకాంచనాంగి నంద విడియింపుము. ఆకరూశాధిపతి మజ్జనకునిచేత సుశిక్షితుం డగుటంజేసి తనయుం దిప్పపడని కామినులం దన్యాయం బాచరింపడు. ఈ యంగనయు నచటం కేరినకతంబున నామనంబు గొంత దళుకనాపాద్యయితం బగుచున్నది. అతం డన్యాయ మాచరింపడు గాన నిట్లు చౌర్యంబునం జెచ్చుట తగదు. ఎల్లరకు సువిదితంబగునట్లు దెప్పింపం గలను. దీనిం దీసికొని పొమ్ము పూర్వమిది యున్నచోటన యుంచుము. అని ప్రార్థించినంతన నాకాంచనాంగిం గొని రక్కసుండు సనియె. వెండియుం గడువేగిరంబ ప్రవేశించి యారాక్షసుండు కవిం గాంచి యోమహాత్మ! నీకు నొండుప్రియంబు సేయం గలను. అద్దానిని వచింపుము. అనినం గవియు రక్కసుం గాంచి యోరక్షోనాథ! నీవు నాయందుం గరుణ గలిగి యుంట నిక్కంబేని యీమందిరంబుం బాసి చనుము. ఇదియు నాకుం గావలసినవరంబు. అనిన నట్ల యగుంగాక యని యాబ్రహ్మరాక్షసుండు సనియె.

ఇంతలోం దన్మందిరాధికృతులు తలుపులు దెఱచుకొని వచ్చి యాకవి జీవించి యుండుట కచ్చెరు వందుచు నాతనిమాహాత్మ్యంబు వర్ణించుచు నతనికి వందనంబులు సల్పి యిట్లనిరి. ఓయయ్యా యింతదనుక నీయింటంబరుండి జీవించినవారు లేరు. నీవొక్కరుండవ బ్రతికితివి. బ్రహ్మరాక్షసునివలనం దప్పించుకొన్నవాడవు. ఈగృహంబు భోజభూపతి వినోదార్థంబు గట్టించినది. కట్టిన దాదిగ భూతాధిష్ఠితంబై యుండినకతంబున నామహీపతి యీగృహంబుం బరదేశాగతుల కాతిథ్యంబు సేయుట కేర్పఱిచినవాడు ఏమహాత్మునివలన నైన నీయనిష్టంబు దొలంగునో యని తలపోయుచుండు. ఈబ్రహ్మరాక్షసునిం దోలి రాజుకడ బహుమతులు వడయుకోరికతో ననేకులు మంత్రశాస్త్రపారంగతులు సనుదెంచి యీభూతంబును బాఱందోలం గడంగి వానిచే భక్షితు లైరి. నీవు దానిం జయింపక జీవించియుండవు. ఈవృత్తంబు రాజెఱింగెనేని కరము నిను సన్మానించు. అని చెప్పుచుండంగాం గవియు వారల వీడ్కొని యామందిరంబుం బాసి పోయె. నే నామందిరంబుం జొచ్చి యచటి యధికృతులును బరిచారకులును సనినయనంతరము కవితో మాటలాడం దలంచుకొనుచు వారలు సనిన వెంబడిన యాబ్రహ్మరాక్షసుండు రాంగా నశువు పడకయుండి యింతలో నదియు మరలి పోంగా నింక నీకవికి దీనివలన భయం బుండదని తలంచి వృత్తంబారయ నిగూ

ఢత్వంబున నుంటిని. కవి సనినయనంతరమున నేను వారలకుం గానంబడినచో నాయం దన్యథాబుద్ధిఁ గావింతు రని యెంచి నన్నుఁ గప్పుకొనకయె యొదిగి యొదిగి కంబం బులమఱువునన యాయిల్లు వెడలి వచ్చితిని. ఇట్లగుటం జేసి కపికిఁ గాంచనమాల యిల్లు సూపి యతనిం దోడ్కొనిపోవుట కనువుపడ దయ్యె.

భోజుఁడు. కుతూహలముతో,,

ఓమధురవచనా! యిప్పుడు కాంచనమాల యెయ్యెడ నున్నది?

మధురవచన. దేవ! భవదీయస్యాలకునికి భయంపడుచు నీలీలావతీదేవి సన్నిధానంబునన యున్నది. అతండు దీనిం దనకడకు రప్పించుకొనం దనవలన నైనంత దనుకను పాయంబులు పన్నుచున్నవాఁడు. దేవిసన్నిధానమువలన విగ్రమించెనేనిఁ గాంచనమాల యతని మాయాజాలంబునం దగులుకొనక పోదు. ఆకారణమునన దేవియు దాని నెడబాయదు.

భోజుఁడు లీలావతిం గాంచి నవ్వుచు,,

ఓదేవీ! కాంచనమాలం దప్పించుటకును దర్పసారు నతిసంధానంబొనర్చుటకగిన యుపాయంబుం బన్నవలసియున్నది. ఇందుకు నాకుందోఁచినది చెప్పెదను. వినుము. నాకడ నటపంబుంబట్టునర్తకుం డనువాఁడు గలఁడు చతురుఁడు. కాంతలం జేయువిలాసంబుల నభినయించుటయందు వానివలె నెట్టి దిట్టలును శక్తులు గారు. వానిప్రాయంబును గాంచనమాలప్రాయంబుతో సమానమయినయది. వానికిం గాంచనమాలవేషంబు వేసి యది సమ్మతించినట్లులు స్యాలకునికడ కంపినం గాంచనమాలకుం గలిగిన నిర్బంధంబు వాయు. ఇదియ చేయందగినపని. వాఁడు నాకుఁ బంటు గాన నతనిం బరిహాస్యునిం జేయుట తగనిది గాదు.

లీలావతి. మందహాసంబు నేయుచుం దలవాంచుకొనుచున్నది.

భోజుఁడు. ఓమధురవచనా! ఈయర్థంబున వానికిఁ బ్రయత్నించునది యెవ్వతెయో! యెఱుంగుదువా!

మధురవచన. దేవ! కమలాలయాదేవిపరిచారిక వేత్రవతి యిందుం బ్రవర్తించి యున్నది. పెక్కుప్రయత్నంబులు సల్పి విఫలోద్యమ యయి మీఁదటికార్యం బాలోచించుచున్నయది.

భోజుఁడు, ఓసి! యట్లయిన నావేత్రవతితోఁ జెప్పుము. కాంచనమాల రాజభవనసమీపమున నుండు కృతకోరకం బనునుద్యానంబునకు రాఁగలదు. నిజనం బైయుండునచోటికి దర్పసారుండు వచ్చునేని యతనిమనోగతార్థంబు దెలిసేను. ఇది

రాజస్యాలకుని కెఱుంగం జెప్పుము. అని వేత్రవతికిం దెల్పి మఱియుం గృతకోరక వనాధికృతునితో జెప్పి యావనము వివిక్తంబు గావింపుము. పొమ్ము. అర్జునుని కీవృత్తం బుం దెల్పి చందురుండు దోంతెంచుట కించుకముందు కాంచనమాలానైపథ్యంబుతో నయ్యోడకు రమ్మనుము.

మధురవచన. నవ్వుకొనుచు,,

దేవ ! దేవరయాజ్ఞానువర్తనంబుం గావించెదను. అని నిష్క్రాంతయయ్యె.

భోజుండు. దేవీ! మనము కృతకోరకోపవనమునం బోలుచు దారుపర్వతకంబుపై నుండుచంద్రశాలకుం జేరి యందుండి మాయాకాంచనమాలతో మదీయస్యాలకుండు ప్రవర్తింపంబోవువేడ్కలు కొన్ని కన్నులపండువుగం జూతము. నిగూఢమార్గంబున నయ్యెడకుం బోదము.

లీలావతి. ఆర్యపుత్ర ! మీ స్యాలకుని నందఱు నీకుం బరిహసింతురు. ఇంక నతండు నలువురిలోఁ దలయెత్తంబోడు. బందుపగువాని నిట్లవమానపఱుచుట తగునా!

భోజుండు. దేవీ ! వాని నే నవమానింపవలసినది లేదు ! మఱి తనయవినయంబునన తనకుం దాన యవమానితుం డయ్యెడిని. చూడుము ; ఆకవివలన నెట్టిదూఱు వడసిన వాఁడు !

లీలావతి. ఆర్యపుత్ర! ఈ వృత్తంబు కమలాలయచెవి కెక్కెనేని దుర్మనాయమానమానస గాదా !

భోజుండు. దేవి ! తన సహోదరునిగర్వం బడంగునట్లు కవి వచియించినపద్యం బువిని యాకాంత తన సహోదరునియంద దుర్మనాయమానమానస యయి యుండును. కాని మఱియెవ్వరియందును విరసంపడం బోదు. అదియునుంగాక వానికి గర్వభంగంబు నేయకపోరాదు. కావింపనిచో వీఁడు సాధువుల కిట్టియపకారంబులు నేసి తిట్టులు వడుచుండు. దీన నపకీర్తి నాకును గల్గు. అది యట్లుండనిమ్ము. దారుపర్వతారోహణంబుం గావింతము రమ్ము.

భోజలీలావతులు పర్వతారోహణం బభినయించిరి.

భోజుండు. దేవీ ! ఇదె చంద్రశాలకుం జేరితిమి. ఇందు జాలకాంతర్హితుల మైయుండి వేడ్కలు గనుగొందము.

అని దేవితో జాలకాంతరోపవిష్టుండై కృతకోరకంబువలనికి దృష్టులు నిగుడించి,,

# సప్తమాంకము.

దేవీ ! అదె కనుంగొనుము. నావ్యాలకుం దగుదర్పసారుండు మధురవచన వన్నిన కపటంపువలం దగులుకొని కృతకకోరకంబుం బ్రవేశించుచున్నాఁడు. వీఁడు కాంచనమాలాసక్తుండు గావునఁ దద్విరహవేదనాజనితపాండుతాదిగుణంబులం దద్దయు మాఱియుండెడిని.

దర్పసారుండు ప్రవేశించి,,

కట్టా ! కవిని సమయింపం జేసినప్రయత్నంబు వమ్మయ్యె !

పోనిమ్మా యర్థంబు ? కాంచనమాలాప్రాప్తికిఁ జేసినప్రయత్నంబులు ఫలోన్ముఖంబులుగా నుండ నదియే మయిన నేమి ?

ఉ. కాంచనమాలఁ గాంచి మదిఁ గామశరాహతిఁ గుందుచుండఁగా,
సంచితమైత్రి వేత్రవతి యాత్మహితం బగుమాటఁ దెల్పినన్,
మించినకౌతుకంబునను మీనవిలోచనఁ గూడవచ్చితిన్,
పంచశరుండు నాపయిఁ గృపావశతం గనె నేమి భాగ్యమో !

నలువలంకులు నిరూపించి,,

దైవవశంబున నీయుపవనంబును జనశూన్యంబై యున్నది.

కం. కృతకకోరకము వివిక్తము। సుతనువు ప్రేమమునఁ గూర్చు శుభగతిఁ గని నా,
యతనుఁడు దయఁ జూచెను న। న్నతులితమోహాద్రిశిఖర మారోహింపన్,

ఏలకో తడవయ్యెఁ గాంచనమాల రాకున్నయది !

కాంచనమాలావేషధారియై యర్జునుండు ప్రవేశించె.

అర్జునుఁడు. ఆత్మగతమున,,

ఏను భోజభూపతినియోగం బనుష్ఠించువాఁడ. కామాతురుండై పశుగతిం బ్రవర్తించునీదర్పసారు నవమానితుం జేసెద. వీఁ డీరసాలపాదపంబుమాటున నుండి కాంచనమాలరాక కెదురుచూచుచున్నాఁడు. నావచ్చినజాడ తెలియంగఁడు. నాపాటువ యెఱుకపడెనేని త్వరితగతిం బఱతెంచు. కాన నెఱింగించెదను.

ప్రకాశముగ,,

ప్రియసఖి వేత్రవతీ ! మధురవచన నీతో నీకాంచనమాల కృతకకోరకోద్యానవిలోకనోత్సుకతం జెలంగుచున్నది ; దీనిం దోడ్కొనిచని యావనంబుసొంపుఁ గాన్పింపుము ; ఏను దేవికార్యంబునకుఁ గాఁ జనవలసియున్నది యని చెప్పి నీచేతికి నన్నప్పగించినందుకు నీ వీయుపవనంబున నన్నొంటి విడిచి పోతివి. ఇదేనటె చెలిమి

పసిడి యని యెఱుఁగక పోతివి. ఈయుపవనంబు వివిక్తం బయి యున్నయది గాన నరిపోయె. కానిచో నేమిగతి కావలె ? ఇట్టి మోసగత్తె వని యెఱుంగుదు నేని నీతో నేను రానే రాను.

నలువలంకులు దిలకించున ట్లభినయించి,,

సంభ్రమముతో,,

ఆ ! ఇయ్యెడ నన్యపురుషులపొలఁకువ యున్నట్లు గానంబడి యెడిని. ఏమి సేయవచ్చు ! ఏకతంబునం బురుషుం డుండుచోటికి ముగుద యొంటిమై నేఁ జను దెంచె నేని దానిం గాంచి గరగరికగలమగవాఁ డూరకుండునే.

భోజుఁడు. నవ్వుచు,,

దేవి ! అర్జునుండు సేయుకపటంపువగలు సూచితివే !

లీలావతి. ప్రాణనాథ ! యిట్టియర్థంబులందు మీరలె యీతనిం దిద్దినట్టులు న్నది. మీకు వీఁ డడపగాఁడు గాన సర్వజ్ఞులరగుమీవలన ననేకము లగునర్థంబుల నెఱింగియుండఁడా.

దర్పసారుఁడు. మాయాకాంచనమాలం గాంచి. సంతసించుచు. ఆత్మగత మున,, వేత్రవతి యొనరించినయుపాయంబు కరము శ్లాఘనీయంబ. కాంచనమాలయుం జేయలఁతిని జిక్కినయది. దీనిని విస్రంభణోపాయంబున వశగతం జేసికొనియెద.

సమీపమునకుం జని,,

ఓవగలాడీ! ఏ నన్యుండను గాను. తడవులంబట్టి నీయుం దాసఁ గాంచుచుండు వాఁడను. నన్నుం గాంచి భయంపడఁ బోకుము.

మాయాకాంచనమాల. దర్పసారునిం జూచిన ట్లభినయించుచు. లజ్జావినయ సంభ్రమంబులతో మఱియొండుచోటికింజనియె.

దర్పసారుఁడు. వెంటనంటిచని,,

ఓముద్దులగుమ్మా ! నీ వేల నన్నొప్పరికించి చనియెదవు ?

ఉ. మారకఠోరశాతసుమమార్గణతాపభరంబు హెచ్చ నీ,
చారుపయోధరస్తబక సంగత చందన పంకలేప మి,
చ్చారతిఁ జెందఁ గోరితిని పంకవగంధిరొ నీవు నాపయిన్,
గూరిమిఁ గాంచి నాభవ మకుంతగతి న్ఫల మొందఁ జేయుమీ.

మాయాకాంచనమాల. తలవాంచుకొనియుండె.

దర్పసారుఁడు. కామావేశంబుతో,,

కం. సుమగంధి మాటలాడవె। రమణీ నీ బిగువుచనుల రహిఁ జేర్పవె న,
గ్నమలాక్షి మోవి తేనెలు। క్రమమునఁ గ్రోలంగనిమ్ము కనకపుఁబొమ్మా.

మాయాకాంచనమాల. బెళుకుంజూపులంజూచి,,

చం. సరసము చాలు చాలు నిలు సారసలోచన లొంటి నుండఁగా,
సరసకుఁ జేర రాఁ దగునె చక్కనిచానల కాడికల్ భువిన్,
దిరముగఁ గల్గఁ జూవె యలఁతిం గడుఁ గష్టము గల్గ నక్కటా,
పురుషుల కక్కరల్ గడవ పొల్తుల నొప్పరికింతు రంతటన్.

అని యప్పలికిం జనుచున్నది.

భోజుఁడు. ఓరి! యర్జునా! భళిరా! నీ నుడివినవచనంబులు మెచ్చుకొనం దగినవియ. చక్కనిచానల కాడికలు గలుగు నమాట నిక్కంబు.

లీలావతి. ఆర్యపుత్ర! పురుషుల కక్కరల్ గడవ పొల్తుల నొప్పరికింతు రన్నది తథ్యంబు గాదో?

భోజుఁడు. నవ్వుచు,,

దేవి యదియు సత్యమే! ప్రవృత్తం బగువినోదంబు గాంచెదము.

దర్పసారుఁడు. అనునయించుచు వెంటంజని,,

చం. నిలుము లతాంగి పోకు కరుణింపుము నాపయిఁ గోప మేలనే,
చిలుకలకొల్కి రో! భయముఁ జెందకు బంటను నేను నీకు నీ,
లలితవినూత్నయౌవనవిలాస వశీకృత మానసుండనై,
పలచితి నిల్వలేను పెరవాఁడను గాను మృగాక్షి గావుమా.

అని యామాయాకాంచనమాలచెయిపట్టెను.

మాయాకాంచనమాల. మొగమోరఁ జేసికొని,,

సీ. సారతర మైనముత్యాలహార మొకటి। కపికిఁ దొరకిన మార్కైను గాంచుమీలు,
తేహనమొనర్చు నాసన మూహ నెత్తు। కొని నటించుచు గాక తద్గుణముఁ గనునే,

భోజుఁడు నవ్వుచు,,

ఓరియర్జునా! మర్కటసాదృశ్యముచే బాగుగవీనినధిక్షేపించితివి. మాకహి నందు గాన వెండియు ని నన్నుసరింపం గడంగెడిని.

దర్పసారుఁడు. నెవ్వెఱపడినిలిచి వెండియు ననునయించుచు,,

ఉ. కోమలి రిత్తకోపములు గూడునె యెప్పటికైన నాపయిన్,
గామునిలీలలం బ్రణయగౌరవరమ్యము లైనకిన్కలం,
వేమఱు గాంచబోయెదవు వేడుక నన్నలయించె దింతయో,
సామజయాన మోడి యిఁకఁ జాలును లీలల నేలు గ్రక్కునన్.

అని చుబుకంబుంబట్టి యెత్తిముద్దుగొనంబోయె.

మాయాకాంచనమాల. తటాలున వానిచేయిఁ దట్టివేసి,,

గీ. చనునె నీ కిని పెద్దలచాటుఁ బాయ । కుందుముగుదలయం దిట్టు లుచితపథము,
దప్పి నడచుట నీగొప్పతనమునకును । దగినవిధమున నడచుకోఁ దగును నీకు.

దర్పసారుఁడు. ఆత్మగతమున,,

పయింబయిఁ బడఁతులతో మెండొడ్డం గూడదు. కాన నిప్పుడుబలాత్కరించు పనివలన నివర్తించుకొనుట యుత్తమంబు.

మాయాకాంచనమాలభుజంబు వదలి,,

ఉ. సార మసారముం గననిచానలపొందును గాంచుకంటె నా,
సార మెఱుంగునాతిముఖసారసవీక్షణమేనిఁ జాలు పో!

మాయాకాంచనమాల. అసూయనభినయించుచు,,

ఉ. పూరుషులంగనామణులబుద్ధు లశుద్ధ లెఱుంగ కానతోఁ,
జేరిన వారికూటములు చీయనరే కమలాక్షు లెల్లెడన్.

భోజుఁడు దేవి! మనయర్జునుఁడు కాంచనమాలావేషంబుం దాలిచి యాదర్పసారుని వంచించుపంచు మించినవేడుక గలిగింపదే! ఇంతకుం గాంచనమాల మధుర వచనచే బోధితయై తనయింటికిం బోయి యుండు. ఈదర్పసారుండును వంచితుం డయ్యె. ఇఁక వీరలు నివృత్తులౌట మంచిది.

దర్పసారుండు. ఆత్మగతమున,,

ఈకన్యకామణి చేయలంతిం జిక్కియుం దప్పిపోవునట్లున్నది. ఏమి సేయనగుని

ప్రకాశముగ,,

కం. కరుణింపుము నాపయి నో । యరవిందదళాక్షి నీదునంఘ్రులకును నా,
శిరముఁ గదియించి మ్రొక్కెద । వరవర్ణిని నన్ను నేలు వాంఛలు మీఱన్.

అని మాయాకాంచనమాల యడుగులపయిం బడుచున్నాఁడు.

అర్జునుఁడు. నవ్వుచు,,

ఓ రాజస్యాలకా! నేను వరవర్ణినిని గాను. ఇదె చూడు మర్జనుండ. నన్నుం గాంచి యేల మరులుపడియెదవు?

అని చీర విడిచి పాఱవైచి.,

ఓ స్యాలకా! రాజును దేవియు నీపడుపాట్లు దాసపర్వతశిఖరారూఢులై గాంచుచున్నవారు. ఇఁక నీవు రాజునెదుట మోముఁ గాన్పింపం దరంబు గాదు. పోఁ బోదుంగాక.

అని నిష్క్రమింతుం డయ్యె.

దర్పసారుఁడు. నెవ్వెఱపడి. కొంతసేపూరకుండి. దీనాననుండై. ఆత్మగతముగా. ఆ! మోసపోతిని. ఏమి సేయవచ్చు! కామాంధునకు జ్ఞానంబు మాసిపోవునను నన్నది యథార్థంబయ్యె. ఇఁక నీయూర నుండి రాజుమొగంబుం గాంచుటకంటె నవమానం బేమియు లేదు. ఇఁక నింటికిం జనుట యుత్తమంబు గాదు. నిజనగరంబున కరిగెదను.

అని నిష్క్రమింతుం డయ్యె.

భోజుఁడు. సంతసంబుతో.

దేవి! ఈ మానహీనుని నూరువేలువరహాల నెంచియుఁ గమలాలయను మోహమోడి యట్లు సేయకుంటిని. ఇప్పుడు విధివశంబున వీఁడె మనపత్తనంబు వదలి పోవలసినట్లయ్యె. ఇఁక నాయెదుటికి రామోమోడును. కాంచనమాలాకవీంద్రులవృత్తాంతం బారయుదము. నగరునకుం బోదము. మధురవచనకదంబం గలాలాప నంపి వృత్తాంతంబుఁ దెలిసికొందము.

అని నిష్క్రమింతు రైరి.

ఇది కాళిదాసచరిత ప్రకరణమునందు

సప్తమాంకము సంపూర్ణము.

శ్రీ ర స్తు.

---



శ్రీరస్తు.

# కా ళి దా స చ రి త ప్ర క ర ణ ము.

## అష్టమాంకము

---

కలాలాప ప్రవేశించి,,

ఏను భోజలీలావతులయాజ్ఞానువర్తినినై మధురవచనయింటికిం జనియెద. గతదినాంతంబున దారుపర్వతకమునుండి దిగి వచ్చి రాజును రాణియు నన్నుం జీరి యోసి కలాలాప! దర్పసారుం డర్జుననికపటంబున వంచితుండై యీయూరు వాసె. కాంచనమాల నిర్బంధంబు నివృత్తం బయినది. నీవు మధురవచనకడకుం జని దానినడుగుము. కాంచనమాల యింటికిం జనినయనంతరము కవిసంప్రాప్తి దాని కయ్యెనా! లేదా! ఇది తెలిసికొని రమ్ము. అని యానతి చేసి పంపిరి. ఏనును మధురవచనయింటిదాపునకు వచ్చితిని. అదె నాప్రియసఖి మధురవచనయు నతిత్వరితగతి నెక్కడకో చనంబయనమై వచ్చుచున్నది.

మధురవచనప్రవేశించి. సంశయంబుతో,,

ఏలకో రేపకడన ప్రియసఖి కాంచనమాల నన్నుం బిలువ నంపినయది. ప్రియసంప్రాప్తివలన సంతసంబు గూరుచుండినయాకాంత లేదేని కొఅంత రయుండునో! లేనిచో నన్నేల రప్పింపం బూనినయది ?

ముందుకు దృష్టులు నిగుడ్చి. వైచిత్ర్యంబుతో,,

రాజాంతఃపురపరిచారిక కలాలాప యిదె నాకడ కేగుదెంచుచున్నయది. ఏదేని కారణంబు లేక యిది రాదు. కాన నారయ నగు. ప్రియసఖి ! కలాలాప యంతఃపురపరిచారిక వగునీకు మావంటివారియిండ్లకు రాఁ గతంబు వీనులకు విందై యుండును. ఎఱింగింపుము.

కలాలాప. ప్రియసఖి! అవన్నియు న ట్లుండనిమ్ము. కాంచనమాలకుం ప్రియసంప్రాప్తి యయ్యెనా! ఈవృత్తం బారసి ర మ్మని భోజలీలావతులు నన్ను నీకడ కంపిరి.

మధురవచన. ప్రియసఖి! లీలావతీదేవికిం గాంచనమాలయందుం గలప్రియంబు కడు నధికంబు; కాన విచారించుకొని రమ్మనినయది. చెప్పెదను వినుము. అర్జునుండు కాంచనమాలావేషంబుం దాలుచుకొని కృతకోరకోద్యానంబునకు నాతోఁ జనుదెంచె.

రాజస్యాలకుని కార్యంబులందు వ్యాపృతలై యుండు వేత్రవతీప్రధానలు వారిం గాంచనమాలయే యని యెంచి త్వరితతరంబుగ నతనికి వృత్తాంతంబు విన్నవించిరి. అంత వేత్రవతి కపటంపుం గాంచనమాల ననుసరించె. అది గాంచి యేను వాని వెడబాపి పోయి కాంచనమాలాగ్రహణనియుక్తలగు దాసికలు తమ కార్యంబు ఫలించిన దని యేమఱుపాటున వారివారి యిండ్లకుం జనఁగా నతినిగూఢమార్గంబునఁ గాంచనమాలం దోడ్కొని తెచ్చి దాని యింట విడిచితిని. ప్రియసఖి కవిగతం బగుచింతతో విషాదంబు నొందుచు స్నానాదులు నిర్వర్తించుకొని సౌధోపరిదేశంబున నుండి నలువంకలు విలోకించుచుండె అప్పుడు తత్సమీపవర్త్యయం దాకవివయుండు సమచుఁ గాంచనమాలం గాంచి యిట్లనియె.

శ్లో. * ఝడితి ప్రవిశ గేహం మా బహిస్తిష్ఠ బాలే,
గ్రహణసమయవార్తా శ్రూయతే శీతరశ్మేః,
తవ ముఖ మకళంకం వీక్ష్య నూనం స రాహు,
ర్గ్రసతి తవ ముఖేందుం చంద్రబింబం విసైవ.

---

* టీ. బాలే = ఓపడుచా! ఝడితి = వేగముగ, గేహం = ఇంటియందు, ప్రవిశ = ప్రవేశింపుము. బహిః = వెలుపల, మాతిష్ఠ = ఉండకుము. ఏలయనఁగా:— శీతరశ్మేః = చంద్రునికి, గ్రహణసమయవార్తా = ఉపరాగము సంభవించుసమయ మను వార్త, శ్రూయతే = వినంబడియెడిని. ఈయాఱఁ జంద్రగ్రహణము గలుగం బోయెడు మని పదంతి వినంబడుచున్నది యని యర్థము. చంద్రోపరాగము గలిగినఁ గలుగనిమ్ము! అందుకై వెలుపల నుండక యింటిలోపలికి జనవలసిన దేమి యన్నవో:— అట్లు పోనినాఁడు గలిగెడుకష్టము దెల్పుచున్నాఁడు. స రాహుః = ఆచందురుని మ్రింగం గడంగు రాహువు, తవముఖం = నీ మొగమును, వీక్ష్య = కని, చంద్రబింబం = చంద్రబింబమును, విసైవ = వదలిపెట్టియే, అకళంకం = కళంకరహితుఁడైన, తవముఖేందుం = నీయొక్క ముఖచంద్రునిని, గ్రసతి = మ్రింగెడిని. నిర్దోష మగువస్తువు దొరికనేని సదోషమగువస్తువును గోరరు. కాన నకళంక చంద్రుండై యొప్పునీ మొగంబుం గాంచి కళంకి యగుచంద్రుని వదలి రాహువు నీ మొగంబును మ్రింగఁబోవు. నీ మొగంబు కళంకము లేనిచంద్రబింబముపగిది నొప్పుచున్న దని భావము.

ఈ శ్లోకమునకు సరియయిన యాంధ్రపద్యము.

చం. ఘనకచ యింటిలోపలికిఁ గ్రక్కునఁ బొమ్మిఁక బైట నుండఁగా,
జన దుపరాగవేళ యిది చంద్రుని కంచును బౌరు లాడుటల్,
వినఁబడె నీముఖేందువును వేడుక రాహువు గాంచెనేని భా,
మిని యకళంకి మ్రింగఁ గడిమి న్సకళంకుని బాసి క్రేస్త్రిడిన్.

ఇట్లు కవి వచియించినపలుకులు విని యతనిరసికతావిశేషంబునకు మనంబున మెచ్చుకొనుచు పెండియు నాతనిసరసోక్తిసుధారసంబుం గ్రోలం దలంచి యూరకుండంగా నాకాంచనమాలభావం బెఱింగి నేనాకామినీమణి కంచుకము దాల్పకయుండుట మనంబునం దలంచుకొనుచుం గవిం గాంచి యోకవికులతిలకమా! యిది యింటిలోనికింజని చేయవలసినకార్యం బే మేనిం గలదా! ఆనతిమ్ము అని యడుగంగా నాతండు గాంచనమాలం గాంచి,,

శ్లో. * కనకాంగి కలయ కంచుక మనయో స్తనయో ర్జవేన ఘనతరయోః,
పురుహూతదిగ్విభాగా దుదయతి కోకారి రద్య పరిపూర్ణః.

అని చెప్పిన నాతనిసుధామధురంబు లగుచతురోక్తుల కలరుచు నాకాంచనమాల వేగంబ సౌధతలంబు డిగ్గి పరిచారిక యందిచ్చునారంజపుఱైక దొడిగికొని సఖీకదంబకంబు తోడ రాం దనగృహబహిర్ద్వారదేశగతుం డైన తనసరసుని నెదుర్కొనం జనుదేరనప్పుడు కవివరుండును బ్రణయరసపరిప్లుతంబు లయి మందహాసరోచిరుదంచితంబు లగు నుదారకటాక్షవీక్షణంబుల నాకాంచనమాలముఖాంబుజంబుపయి నోలయించిన సిగ్గుపడుచు మాప్రియసఖి తనకేలం దమ్మిం బయింటచెఱంగు నెత్తి మోముదామర కడ్డము చేసికొని సుస్మితంబు సేయ నది గని కవి యిట్లనియె.

శ్లో. † ఉచితం గోపన మనయో స్తనయోః కనకాద్రికాంతితస్కరయోః,
అవధీరితవిధుమండలముఖమండలగోపనం కిమితి.

---

* టీ. కనకాంగి = బంగారమువంటి యొడలిచాయగలదానా! ఘనతరయోః= కడుగొప్పవియగుం అనయో స్తనయోః= ఈస్తనములకు, జవేన= వేగముగ, కంచుకం= ఱవికను, కలయ = తొడుగుము. అద్య = ఇప్పుడు, పురుహూతదిగ్విభాగాత్ = తూరుపుదిశయొక్క భాగమునుండి, కోకారిః= జక్కవలకుసూడగుచంద్రుండు, పరిపూర్ణః= కడుంబూర్ణుండై, ఉదయతి = ఉదించెడిని. ఓకాంతా నీయొక్కకుచములు జక్కవ లగుటంజేసి చక్రవాకవైరి చందరుం డుదయ మగునేని కుచచక్రవాకంబులు విరియుం గాన వేగముగం గంచులికం దొడుగు మనుచున్నాండు.

ఈ శ్లోకమునకు సరియయిన యాంధ్రపద్యము.

కం. కనకాంగి గబ్బిగుబ్బల! మానుపడం గంచులిక దొడుగు ముద్దియ యదిగో,
కను కోకవైరి యేత్తెఱఘనమండలుం డగుచుం బొడముం గాంౘ్రాగ్దిశలోన్.

టీ. † కనకాద్రికాంతితస్కరయోః = బంగరుకొండవన్నెలుదొంగిలించిన వగుటంకేసి, అనయో స్తనయోః = ఈ నీ స్తనములకు, గోపనం = దాపటికము, ఉచితం=

అనిన నతనిసరససంభాషణామృతలహరీపరంపరల నోలలాడుచు నానందపరవశం బగుచిత్తంబుతో నమ్మత్తకాశినీతిలకంబు మానసంబునఁ గుతూహలంబుం గాంచుచుండు నదియయ్యు లజ్జాగ్రహగృహీతయై యూరకున్న నాశ్యంగారవతీవతంసంబు భావం బెఱింగి యే మెల్లరమును బూన్న నాసరసాగ్రేసరునికిం గైదండ యొసంగి తోడ్కొ నిచని కేళీమందిరంబున ననల్పసుఖదం బగు తల్పంబునం గుపవిష్టుం జేసినారము. అంత మేము మాయిండ్లకుం జనుదెంచితిమి. కాంచనమాల యింతకు మున్నె ప్రసన్నతిత్వరిత గతి రమ్మని చెప్పి పంపె. కతంబు స్ఫురియింపదు. ఇదియ ప్రవృత్తం బగువృత్తాంతంబు. ఇది దేవికి నివేదింపుము. వైళంబ యేను గాంచనమాలమందిరంబునకుం జని యది నన్ను రమ్మనిపంపినకారణ మరసి దేవీసన్నిధానంబునకు వచ్చి విన్నవించుకొని యెదను. ఒకలాలాప దేవి తహతహపడుచుండును పొమ్ము. ఏఁ జనియెద.

అని దాసితోనిష్క్రాంతయయ్యె.

ప్రవేశకము.

---

తగినదియే. ఇతరులసొత్తు దొంగిలించిన వారలను రాజభటులకంటికిం గనంబడకయుండ దాచియుంచుట యుక్తమే యనునది లోకవ్యవహారసిద్ధము. కాన బంగరుకొండ వన్నెలం దొంగిలించినది యైనకతంబునం గుచంబులను కంచుళికచే మూసిపెట్టుట యొప్పిదంబ యగు నని భావము. అవ...వనం—అవక్షిప్తశశధరమండల = చంద్రమండలమునుదిరస్కరించినదియగు, ముఖమండలం=ముఖమండలమునకు, గోపనం=దాచుట, కిమితి = ఎందుకు? ఇతరులను దిరస్కరించి విఱ్ఱవీగుచుండువారిని దాపఱిక మొనర్ప వలసినది లేదనుట లోకవ్యవహారసిద్ధము. కాన చంద్రమండలమును దిరస్కరించి విఱ్ఱవీగుముఖమండలమును దాపఱికముసేయ నుచితంబు గాదని భావము. స్తనములనుగప్పికొనుట యుచితమే! ముఖ మేలగప్పుకొనియెదవు? ఇది తగదని భావము.

ఈ శ్లోకమునకు సరియయిన యాంధ్రపద్యము.

చం. కనక మహీధరేంద్రకుభకాంతులఁ బల్మఱు దొంగిలించుటన్,
స్తనకలశద్వయంబునకు ధారుణి గోపన మొప్పుఁ గాని యా,
ననమునకు న్శరచ్ఛశిఘనప్రభల న్నిరసించి మించుచున్,
వనరుహుఁ జెందుదానికిని దాఁపఱికం బొనరించు టొప్పునే.

కాంచనమాల ప్రవేశించి. దీనత్వముతో,,

నా ప్రియసఖి మధురవచన యింకను రాకున్నది. ఏఁ జెప్పిపంపి తడ వయ్యె.

మధురవచన ప్రవేశించి. ప్రియసఖి కాంచనమాలా! నీకోరినకాంతునిం బడసి యూ సంతోషాంబునిధియందుం దేలనివిధంబు నీవిన్ననైనమొగంబు దెలుపుచున్నది. మఱియును.

చం. మలయజపంకలేప మిటు మాయక యున్న దిదేమి చన్నులన్,
గలసినపత్రభంగములు గండములం జెడకున్న వేల ని,
స్తుల మగునోష్ఠబింబమునఁ దోఁపకున్నదమలంపురాగముం,
గలయక యున్న దేమి కలకంఠిరొ యల్గితివో కొకొ నాథుపై.

కాంచనమాల. ప్రియసఖి : యే మనియెదవే! ప్రాణనాథునిమోము గనంబడుటకు ముంద ప్రణయకోపమా! ఏంతలే నీమాటలు.

ఉ. కోప మదేల నాకు మదిఁ గోర్కులు వేకొనసాగకున్న వో,
రూపవతీవతంసమ! నిరూఢిగఁ జెప్పెద నాయకుండు సం,
తాపపరీతుఁడై వ్యసనతప్తమతిం గడుఁ గుందుచుండఁ గా,
నే పగిది న్సుఖంబుఁ గను నింతి కృపాకలితాంత రాత్మతోన్.

మధురవచన. ప్రియసఖి ప్రణయంబు విశేషించిన నల్కగల్గుట చిల్కలకొల్కులకుం దగునర్థంబు గాన నడిగితిని. ఇట్టికారణము లేనినాఁడు రసాభిజ్ఞశిఖామణి యయ్యె ననురక్తయందు సౌభాగ్యలక్ష్మీనవావతారయందుం బూర్వమనుమోదితయైన దానియందుఁ గ్రీడావిముఖుండై యుండం గతం బెద్దియో!

కాంచనమాల. ప్రియసఖి! నాథుండు నాయం దనురక్తుం డగుట యథార్థంబ. ఇతండు కాంతాంతర సమాసక్తుండై తద్వియోగంబునం గుందుచుండు విధంబు గానం బడియెడి. బలవద్వియోగవ్యథావివశుండు తనయభీష్టాంతరంబులం బాటింపకుండుట తెల్లంబ కదా!

మధురవచన. ప్రియసఖి! ఆయర్థం బటుండనిమ్ము. గతరాత్రియం దతఁ డెట్లు ప్రవర్తించెనో యెఱింగింపుము.

కాంచనమాల. ప్రియసఖి చెప్పెదను వినుము.

ఉ. ఆరసికోత్తముండు ప్రియ మార సుఖాంబుధి నోలలాడుటల్,
గోరక మన్మథాస్త్రచయగుంఫితవేదన కోర్వలేక తా,
సారెకు వెచ్చ నూరుచును సర్వముపై మది నీసడించుచున్,
వారనిబాష్పసంతతివివర్ణముఖాబ్జముతోడఁ జింతిలున్.

ప్రియసఖి! యేమి సేయుదు. ఇందులకు మూలంబు తాపంబది యెడంత మనిరేఁ జేసిన శీతోపచారంబులందు,

చం. తనువునఁ జందనం బలఁదఁ దత్క్షణమాత్రన పెట్లఁబారెనా,
తనసుమమాల్యసంతతులు దావమునం బడినట్లు వాఁడెనే,
మనిరొదఁ దారహారము లహో యురవుంటినఁ గందె త్రేళ్ళిడిన్,
ఘనఘనసారలేపము నికామగతి జ్వలియింపఁ బూనెడిన్.

ఇట్టి దురంతసంతాపవేదనావశీకృతస్వాంతుండైనయామనోహరాంగునికి,

కం. సర్వలోకైకమంగళసార మైన। తనువు విరహజపాండిమాధార మగుచు,
జిక్కి యభినవసౌభాగ్యశేష మయిన। సుందరాకారరేఖతో నందగించు.

మఱియు నాలోకోత్తరసౌందర్యలక్ష్మీస్వయంవరపతి యగుచాప్రాణనాథుండు నాకడకుం జేరిన దాదిగ.

చం. పులకలు గ్రమ్ముచుండు మెయి పూరితబాష్పము లైనకన్నులున్,
కలితవిమూర్ఛనాశ్రితవికంపిత మై వెతఁ గాంచుమానసం,
బలఘుసుశోచిశేష మయి యాందము విరాలిఁ జేసెను గర్తి యా,
కులపడఁజేసె నామనము ఘోరతరార్తి మునుంగఁ జేయుచున్,

ఇవ్విధంబున రేయి యంతయుం గడిచినం బ్రభాతశేషంబునను సయితమాధన్యచరితుండు.

ఉ. తానము సల్ప నిచ్చ మదిఁ దాల్పఁడు వేమఱుఁ బల్కరింపఁగా,
దీనతతోడఁ జల్కు నతిదీర్ఘతరోష్ణశమారుతాస్యుఁడై,
మానిని చింతతోడ ననమానవిలాసముఁ బాసి యుండు సు,
మ్మానవనీరజాక్షి యెది యొక్కొ? కతం బితఁ డిట్టు లౌటకున్.

మధురవచన. ప్రియసఖి! ఇందుకుం గతంబు గలదు. మధుమంతపురాధినేత కూఁతురీతనికిం బ్రాణదయిత. ఏకారణంబుననో దాని నెడఁబాసి యితండు వియోగవ్యథావశాంతఃకరణుండై యుండెడిని. దానిరామణీయకం బనన్యసాధారణము.

బ్రహ్మరక్షస్సమానీతమై యాకాశాంతరి నూతనమందిరాంతరంబున నాకంటికిం గనం బడియె. ప్రియసఖి ! లోకంబున నెందఱో సుందరాంగులు గలరు గాని యానిరవద్య రూపోపేతవంటి నాతియీ భూతలంబున నుండదు. వినుము.

ఉ. ఆ నవమోహనాంగి కమలాలయయే యన వచ్చు నాసరో,
జానన రూపసంపదల కచ్చెరు పందక పోరు లోకులా,
చానవయోవిలాసములచారుత నేఁ బొగడంగజాల నో,
మానిని దానిఁ బాసి భువి మానవసత్త్వముఁ డోర్వఁజాలునే.

ఆకాంతం గాంచి యాకవివరుండు దానివిరహవ్యథావివశత్వంబునను వగచి బాష్పాకులేక్షణుండై భూతనాథునితో వెండియు నిది యెందుచోటికి దీనిం జేర్పు మని ప్రార్థించిన నాబ్రహ్మరాక్షసుం డిట్లని యొనరించె.

కాంచనమాల. ఆ ! ప్రియసఖి అట్టియనురూపవయోగుణోపేతయం దనురక్తుండు గాననే యితరానురాగంబు తద్విరహవ్యథాకులితహృదయుం డగుసితనియుల్లంబున రసభావంబుం జెందక యున్నది.

ఉ. ఆరుచిరాననం గలసినంతట గాని ముదంబుఁ జెందఁ డా,
సారవిచారుఁ డీనరసుసఖ్యము జన్మఫలం బ దెంతయుఁ జా,
చారుముఖీవతంసము విచారము సేయుము దానిఁ జేర్పఁ గా,
బోరన సర్వయత్నములు పూనికఁ జేయుట యొప్పిదం బగుఁ జా.

ఆరమణీవతంసంబుం బడసినం గాని యీతనిదురవస్థావిశేషంబు నివర్తింపదు. అది నివర్తింపనినాఁడు నాకు నీతనితో సుఖం బనుభవింపం బోలదు. కాన నాకాంతా సమాగమం బీకవివర్యునికిం గలుగం జేయ నగును. ఇందు కను వేదియో యెఱుంగను.

మధురవచన. ప్రియసఖి భోజునికిని కవికిని పరస్పరసమావేశం బయినం గాని యీకార్యంబు సాధితంబు గాదు. ఈవృత్తాంతంబు లీలావతీదేవికి విన్నవించి తన్మూలకముగ రాజుచెవి కెక్కింపం జనును. భోజభూపతి కవులపయిం గరమనురాగంబు గలవాఁడు. ఈకవివరునిం గాంచం గోరుచుండెడిని. ఈతనిం గనుంగొనె నేని కరూశదేశపతికి వృత్తం బెఱింగించి యానాతిం దెప్పించి యితని కర్పింపం గలండు. తొలుత నీకభినవతారుణ్యంబు గలుగం జెప్పిన యర్థంబు వినియే యితనియతిమానుషప్రభావంబునకు నచ్చెరు వొందుచున్నాఁడు. ఇట్టియద్భుతచరితంబులు పెక్కులు కవివరుని యందుం గాన్పింపఁబడె. అవియు నతనిచెవి కెక్కినవి. కవియును రాజసన్నిధానం

బునకుం జను. పీఠికింబరస్పరమైత్రి గల్గక పోను. ఇంకను భువనేశ్వరీపాదప్రణామంబు సతతము సేయుచుండుదుమేని కార్యంబు సనుకూలు. వీఁ డని లీలావతికి వృత్తం బెఱింగింతు. నీవు భువనేశ్వరిం గొలుచుచుండుము. ఉద్దిష్టకార్యం బనుకూలింపక పోదు.

ముందుకువృష్టులునిగుడ్చి. వైచిత్ర్యంబుతో,,

ఓకాంచనమాలా! ఇది యేమివింతయో. ఆర్యుండుబుద్ధిసాగరుండు తా నేనాఁ డేని యీవంకకు మరలనివాఁడు సుస్నాతుండై ధౌతాంబరంబులు దాల్చి వైదికశోభితవేషంబుతోఁ బాదచారియై యుద్యానవీథి కేఁగుదెంచుచున్నవాఁడు. ఈభోజుని ముఖ్యామాత్యుండిప్పు డిట్లు రాఁ గతం బేమియొకో! ఇతఁ డెక్కడ కేఁగెడినో.

ససంభ్రమముగ,,

ఎక్కడకో యన నేల? మనయింటికే వచ్చుచున్నాఁడు.

కాంచనమాల. ప్రియసఖి! ఒకనాఁ డేని యిట్లు రానివాఁడు తాన యిప్పు డిటు వచ్చుటకుం గారణము మహాకవిం గనుంగొనవలయు ననుటయె కాని యొండు గాదు. కవియు నింత ప్రొద్దెక్కినను నింకను శయనంబున నిదురపోవువాఁడునుంబోలెఁ బరుండియుండెడిని. త్వరితగతి లోనికిం జని బుద్ధిసాగరుని రాక కవికి నివేదింతుఁగాక.

అని మందిరాంతరాళంబునకుఁ జనం గడంగుచున్నది,,

బుద్ధిసాగరుండుప్రవేశించి. సత్వరముగ,,

ఓకాంచనమాలా! నన్నుం గాంచి నీవు త్వరితగతిం జనుటకుం గారణం బెఱుంగుదును. కవి యుండుశయనాగారంబున కేన వచ్చెద. అతనికిం బరిశ్రమం బొసంగం జనదు.

అని మందిరాంతరప్రవేశ మభినయించుచున్నాఁడు.

శయనస్థుం డయి కాళిదాసుండు ప్రవేశించె.

కాళిదాసుఁడు. శయనంబునం దుపవిష్టుండై.

ఆర్య బుద్ధిసాగర! నీ విచ్చోటకుం జనుదెంచుటకుం గతం బెయ్యది!

బుద్ధిసాగరుఁడు. ఓమహాత్మా! వినుము. మదీయజనని కడు వృద్ధ నీ వీయూరికిం జనుదెంచిన నాఁడెగ నుసి గప్పిననిప్పువంటివాఁ డితం డని చెప్పుచు వచ్చినది. కరము దేవపితృ సమారాధనంబునం దత్పరయై యుండినయది. పతిభక్తిపరాయణ.

ఆయమ నీ ప్రభావంబుం గలతెఱంగున నెఱుంగు. ఆసతి తన ప్రాణప్రయాణసమయంబున నన్నుం జీరి యోబుద్ధిసాగర! నేను పరలోకగత నైనయనంతరము నాకుం జేయవలసినయౌర్ధ్వదైహికక్రియలయందుఁ గళాచంద్రుని నిమంత్రితుం జేసి యతనియందు మనంబున నీసడించుకొనక భోజనం బిడవలయు. అట్లైన నేఁ బరితృప్తిం గాంచి యచ్యుతం బగుపదంబును బితరులయనుగ్రహంబునం బడసెద. ఇదియ నాయిష్టార్థంబు. అని నుడివిన నేనును. మాతృవాక్య మవశ్యానుష్ఠేయంబు గాన నట్ల యొనరించెద నంటిని. నాతల్లియుం బరలోకగత యయ్యె. తదిష్టార్థంబు నెఱవేర్ప నిన్నుం దోడ్కొని పో వచ్చితిని. ఈదినమున భవదీయపాదకమలరజఃపూతంబై నాయిల్లు సకల సాధుజనసంసేవ్యం బగుం గాత.

**కాళిదాసుఁడు.** బుద్ధిసాగర! నీనుడివినవచనంబుల కడ్డు గలదా! అట్లేఁ జనుదెంచెదను. నిమంత్రణోపాయంబునకుం బూర్వభావికార్యంబులు సిద్ధపఱచుకొనుము.

బుద్ధిసాగరుఁడు. మహాత్మా! అనుగృహీతుఁడ నైతిని.

అని నిష్క్రాంతుం డయ్యె.

కాళిదాసుఁడు. ఓ ప్రాణదయితా! కాంచనమాల! ఏలకో నామానసంబు దుఃఖాకులం బగుచు సంతపించుచున్నది. ఎవ్వరితో నైన మాటలాడ నొల్లను. రాతిరి నిదురలేమిం జేసి యించుక శిరోవేదనయు బాధించుచున్నది. సూర్యుండు నడిజామున కెక్కునేని నా కెఱింగింపుము. అప్పుడ లేచి బుద్ధిసాగరునియింటికిం జనవలయు. ఈశయనాగారంపుందలుపులు మూసికొని పొమ్ము.

**కాంచనమాల.** ప్రాణనాథ! యట్లయే నిదురింపుఁడు.

అని తలుపులు మూసి నట్లభినయింపం గాళిదాసుండు నిష్క్రాంతుఁడయ్యె.

మధురవచన. ప్రియసఖి నేను దేవిలీలావతి కీవృత్తం బెఱింగింపం జనియెదను. నీవు స్నానాదులు నిర్వర్తింపం బొమ్ము.

అని కాంచనమాలతో నిష్క్రాంతయయ్యె.

ఇది కాళిదాసచరిత ప్రకరణమునందు

అష్టమాంకము సంపూర్ణము.

శ్రీరస్తు.



శ్రీరస్తు.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణేనమః.

# కాళిదాసచరిత్రప్రకరణము.

## నవమాంకము.

---

భోజుఁడు లీలావతియుం బ్రవేశించుచున్నారు.

భోజుఁడు. దేవి! యీదిన మేను విద్వత్సభయం దుండఁగనప్పుడు శంకరుం డనుకవివరుండు సంధించి యొకపద్యంబు పఠియించె. అందుకలకి నేను వానికిం బండ్రెండులక్షలధనం బొసంగితిని. అట్లొసంగినందుకు మదీయహృదయగతం బగు కారణం బెఱుంగక కవులు తదితరు లగువారు విచ్చాయవదనులై యీరాజు సమస్తశాస్త్రవిచక్షణుఁ డగుతమకు లక్షధన మిచ్చుటయు గ్రామ్యోక్తి యగు శంకరునికిం బండ్రెండులక్ష లిచ్చుటయు నాతనియవివేకం బని యనుకొనుచు నాయం దసూయాకులురై కోపంబు దీపింప వర్తించుటం గాంచి యేను వారికిఁ దెలుపక మందం జన దని తలంచి రాజ్యకార్యవ్యాజంబున నింటికేతెంచితిని. నాయందలి యవినయాగ్రహం బుపశాంతం బయ్యెనో లేదో యెఱుకపడకున్నది. తెలిసికొన నగును. ఈ పరిచారిక నొకదాని నంపి నాచామరగ్రాహిణిని సీత యను దాని రప్పింపుము.

లీలావతి. ప్రాణనాథ! అట్లయె,

అని కలాలాపం గాంచి,,

ఓసి నీవు సభకుం జని సీతం దోడ్కొని రమ్ము.

కలాలాప. దేవీ! ఇదె నీయానతిఁ జరిపెదను.

అని నిష్క్రమించి వెండియుం బ్రవేశించి,,

దేవ! ముఖ్యామాత్యుం డార్యుండు బుద్ధిసాగరుఁడు జలపూరితసువర్ణకుంభంబులు మోచుకొని యుండుబ్రాహ్మణులతో వాకిట నిలిచి భవద్దర్శనంబునకు వేచి యున్నవాఁడు.

భోజుఁడు. సంశయించుచు. ఆత్మగతమున,,

ఇప్పుడు వృద్ధ యగుబుద్ధిసాగరునితల్లి కాలగతిం జెందియుండుకతంబునఁ దదూర్ధ్వదైహికకృత్యంబుల వ్యాపృతుండై యుండవలసినవాఁడు బుద్ధిసాగరుం డిందులకుఁ

జనుదెంచుటకుం గారణంబు బలవత్తరంబై యుండకపోదు. మఱియుం బూర్ణకుంభం బులు దాలుచుకొని యుండుబ్రాహ్మణులం దోడ్కొనివచ్చుట యేలకో;

ప్రకాశముగ,,

ఓసి! రమ్మని చెప్పుము.

కలాలాప. దేవ! అట్లయ,

అని నిష్క్రాంతయై బుద్ధిసాగరునితోడను బూర్ణకుంభంబులు దాలిచిన బ్రాహ్మణులతోడను బ్రవేశించి,,

ఆర్య! అమాత్యసత్తమా! రాజు మధ్యాహ్నస్నానశాలాపురోవర్తిమండపమున నుండి భవదాగమనంబునకుం బ్రతీక్షించెడిని. ఉపసర్పింపుము. ఏను దేవియానతి సేయంజనియెద.

అని నిష్క్రాంత యయ్యె.

బుద్ధిసాగరుఁడు. భోజునికి సమీపించి,,

ఓరాజా! మన మీదినమునందు జన్మసాఫల్యంబుం గంటిమి. స్వర్గలోకంబున నుండుమందాకినీపావనతీర్థంబు లివి బ్రాహ్మణులచే సువర్ణఘటంబులందు మోపించుకొని తెచ్చియున్నాఁడను. ఇందు దేవికి బ్రాహ్మణసుమంగలులు వేఱుగ నాతీర్థంబులు దెచ్చియున్నారు. ఈపావనోదకంబుల నీవును దేవియుఁ దానమాడి సమస్తకలుషవిముక్తులరగుఁడు. నీకు మధ్యాహ్నస్నానకాలం బతిక్రమింపం బోవు నని త్వరపడుచు నీమహాతిశయంబు నీకుం బ్రాప్తింపఁజేయ నాకార్యంబు వదలియైన నిది సేయం జను నని నిర్ణయించి నీయందుం గలవాత్సల్యంబున నివి దెచ్చితి. అఘమర్షణమంత్రంబులతో నీ విప్రవర్యులు నీ కభిషేకంబు సల్పెదరు. బ్రాహ్మణపుణ్యయువతులు దేవిని దానమాడింతురు.

భోజుఁడు. మహాశ్చర్యంబుతో,,

ఆర్య! భగీరథునంతటివాఁడు తత్పూర్వపూర్వులును దాను రచించినమరతపస్యాంబగుతపఃఫలంబునను బడసినయాదివ్యగంగాజలంబులు నీకు లభించుట యెట్లు! ఇది కరమాశ్చర్యకరంబై యొప్పెడిని. భవన్మూలకముగ నాకు నీవిశేషంబు సంప్రాప్తంబయ్యె. మనయం దేదేవత కనుగ్రహంబు గల్గెనో తెలియదు. కృతార్థుల మయితిమి. నీకుం గలిగినయీమహాతిశయంబును నాకును సంప్రాప్తంబు గావించిన నీవాత్సల్యవిశేషంబునకు నేను నీ కేమి సేయంజాలను.

బుద్ధిసాగరుఁడు. రాజా! సాధుజనులసమాగమంబు గలిగెనేని యదియ జన్మఫలంబు. దానం బడయరాని దేదియును లేదు. అట్టిది యబ్బుటంజేసి యీయతిశయంబు సంప్రాప్తం బయ్యె.

భోజుఁడు. ఆర్య! అట్టిసాధు వెవఁడు లభించె? నిన్నువిధి ననుగ్రహించిన వాఁడెవ్వఁడు? ఈవృత్తంబు జరిగినవిధం బెట్లు? సర్వంబు వినిపింపుము. కౌతూహలం బయ్యెడిని.

బుద్ధిసాగరుఁడు. రాజా! యిప్పుడీయూర నతిచతురకవితాచాతురీవిభూషితుండగు కవివరుం డొక్కరుండు దిరుగుచున్నాఁడని నీ వెఱుంగుదువు గాదె! నాతల్లి యతని ప్రభావం బెఱింగినవృద్ధ తనయౌర్ధ్వదైహికకార్యంబులం దతని నిమంత్రితునిం గావించి భోజనం బిడు మని నాకుం జెప్పి కాలధర్మంబు నొందినయది. ఏను మాతృవాక్యంబు ననుండువాఁడఁ గాన యతని నీదినమున నిమంత్రితుం గావించితిని. మధ్యందినమున కాతఁడియు,

చం. నిరుపమసారసౌరభము నిర్భరమై యలరారు మేనితోన్,
వరతను మేనినున్న సప్రవన్నెలు చెన్నలరారు వల్వతోన్,
సరుణతరాధరోష్ఠమున సద్దపుమద్దపులంపుఁగాంతితోన్,
సరగున వచ్చి స్నానవిధి సల్పకయే కుడువం గడంగినన్.

ఏను మదీయమాతృవచనగౌరవంబునంజేసి యాతనియందు దోషబుద్ధి నిలుపకుంటిని గాని యాతనికి సహనిమంత్రితులు విప్రులు తదశుద్ధి కీసడించుకొనుచు నోరి బ్రాహ్మణుఁడ స్నానమాడక కుడుచుట యనుచితంబు. అంతియ కాదు. రాత్రియంతయు వేశ్యాగృహంబునం గడపి యా వేశ్యాసంభోగచిహ్నంబులను మాపుకొనకయ పాపపుంబాఁచివేషంబుతో నీవైదికకార్యంబునకుం గడంగుట యెవ్వ మెప్పునిపని. ఇట్టి యనుచిత కృత్యంబులు సేయునీతోఁ బొత్తున భుజియించుట మాకుం బాతిత్యహేతు వగు. బుద్ధిసాగరునిం గాంచి యొప్పుకొనవలసివచ్చె. అని పరుషవచనంబు లాడిన నాకవిచంద్రుండు విని యోవిప్రవర్యులారా! యిప్పుడేఁ జేయం దగుపని యేమియో! ఆనతిండు. అనిన నాబ్రాహ్మణులు నోవిప్ర! నీవు తొలుత దీర్ఘోదకంబులఁ దాన మాడవలయు; ననంతరము ధౌతాంబరంబులు ధరించి వైదికకార్యంబున నుపయోగింపం జను అని చెప్పిన విని యామహాత్ముండు నవ్వి యోవిప్రవర్యులారా! నన్నుం దీర్ఘోదకంబులం దానమాడు మంటిరి. అట్టియుదకంబులం గానక యున్నాఁడ. పర్యాప్తంబులైనయుదకంబులు విస్తారంబులు గానివి యెట్లు విస్తృతంబు సేయం జాలను

భూమియం దుండునేయుదకంబులుగాని పర్యుషితంబులు గానివి గలవా! యని యడుగ నావిప్రు లాకరిమొగంబొకరు సూచుకొనుచు బదులు సెప్పం జాలక యూరకుండిరి. అప్పుడు నే నాకవివరునితో నోమహాత్మ యీ యపర్యుషితంబు లగుతీర్థోదకంబుల రప్పింపంగలవాఁడ వని తోఁచుచున్నది. కానిచో నిట్లు నీవు వీరి నడుగవు. నన్నుం గాంచి నాయందుం గనికరించి నాతల్లి నీయం దుంచినభక్తిగౌరవంబులం బరికించి యట్టి యుదకంబులు రప్పించి యెల్లరం బావనులం జేయుము. అతులితం బగుయశోవిభవంబుం గాంచుము. అని ప్రార్థించిన నామహాకవి సంతసిల్లి యించుక ధ్యాననిమీలితనేత్రుండై యుండి కన్నులు దెఱచి యి ట్లనియె.

* శ్లో. ఆదౌ వాదిపితామహస్య నియమవ్యాపారపాత్రే జలం,
పశ్చాత్పన్నగశాయినో భగవతః పాదోదకం పావనం,
భూయ శ్శంభుజటావిభూషణమణి ర్జహ్నో ర్మహర్షే రియం,
కన్యా కల్మషనాశనీ భగవతీ భాగీరథీ దృశ్యతాం.

---

* టీ. ఆదౌ = తొలుత, ఆది పితామహస్య = ఆద్యుఁడగు బ్రహ్మయొక్క, నియమవ్యాపారపాత్రే=నిత్యానుష్ఠానమునకుఁగా నుంచుకొనియుండు పాత్రమునందు, జలం = ఉదకము. పశ్చాత్ = పిమ్మట, భగవతః = భగవచ్ఛబ్దవాచ్యుఁడైన, పన్నగశాయినః= శేషశాయియగునారాయణుని, పావనం=పరిశుద్ధమగు, పాదోదకం = పాదతీర్థము. భూయః = మఱియు, శంభుజటావిభూషణమణిః = మహాదేవునిజడల కలంకారరత్నము. జహ్నోర్మహర్షేః = జహ్నువనుమహామునికి, కన్యా= కూఁతురు. అయిన:—భగవతీ భాగీరథీ = భగవతియగు దేవగంగ, ఇయం = ఇదెతోఁచెడిని. దృశ్యతాం = చూడనగుఁ గాత. ఇచటభాగీరథీశబ్దమునకు భగీరథపథప్రవృత్త యయినగంగ యర్థ మయినను మందాకిని కుపలక్షణము.

తొలుత గోలోకమున మహాదేవునిగీతంబు విని ద్రవీభూతు లయినశ్రీరాధాకృష్ణుల శరీరములవలననిస్సృతము లగుజలముల కదిదేవత యయియొప్పుచుగంగాదేవి యుద్భవించె. అదియాకృష్ణునిం గామించినందున రాధ కుపిత యై తజ్జలాత్మకస్వరూపంబునుద్రమింగి రూపు మాప గడంగుడు నది యెఱింగి గంగ తనస్వరూపముల నుపసంహృతములఁ గావించుకొని రాధానాథునిచరణకమలములందు లీన యయ్యె. జలతత్వంబుతో సంబంధంబువాయుడు బ్రహ్మాండంబు పెట్లు సాగిన బ్రహ్మాదు లాయనర్థంబు వారించు

అని వచియింపఁగా నప్పుడు,

ఉ. శారదనీరదప్రకరచందన చంద్రమయూఖపూర నీ,
హారరుచిప్రచార రుచిరాంశుఝరీకలితాత్మనై నభ,
శ్శ్రీరమణీయహార మని చెప్పఁగ నొప్పులుగుల్కుచుం దగున్,
జోరన దూఁకె నాకధుని భూమిని మధ్యమహామధ్యసీమకున్.

అప్పు డాకవి నన్నుం గాంచి యీనాకధునీజలంబు లపమృషితంబులు ; వీని యందుం దానమాడినం బాపవిముక్తులరై విశుద్ధు లగుదు రని తా నాజలంబులం దాన మాడిన నెల్లరము గ్రుంకితిమి. అప్పు డీవు సమీపమున లేవు గాన నీకొఱకు స్వర్గ్నదీ జలంబులం బంగరుకుండలం బాలురచేతం బట్టించి నీ మధ్యాహ్నస్నానకాలం బతి క్రమింపకుండం దెప్పించితిని. ఇదియ యీపావనోదకములు దొరకుటకుం గతంబు.

భోజుఁడు ఆశ్చర్యపడుచు,,

ఆర్యా ! ఆకవివల్లభుని మహాత్మ్యం బేమని పొగడంగలవాఁడను. ఇతనియందు

---

కొన గోలోకంబునకేగి కృష్ణునిం బ్రార్థించి యతనిమానసతి రాధాదేవిని శాంత క్రోధను గావించిరి. అప్పుడు గంగ భగవంతునిపాదారవిందములోటనవ్రేలం జల రూపిణియై వెలువడియె. ఆపావనోదకంబులను దొలుత నలువ దనకమండలువున నుంచు కొనియె. ఆతీర్థంబులను మహాదేవుఁడు శిరంబునం దాల్చికొనెను. అంత యథా పూర్వముగ నాగంగ గోలోక స్వర్గలోకాదిస్థానంబులందుఁ బ్రవహించెను. త్రిజగత్పతి బలిదైత్యునియొక్క సంపదఁ గైకొని యింద్రుని కీఁ దలంచి వామనుండై పుట్టి త్రివిక్ర ముఁడై పెరిగిన కాలంబున నూర్ధ్వాండమును గొలువ బయికిఁ బోయిన యతనిచరణమును నళినగర్భుండు మున్నుదా సంపాదించుకొని యుండినకమండలూదకంబులం గడిగె. ఆ త్రివిక్రముపాదోదకములను మందాకినీ జలంబులతో నొక్కటి యయి స్వర్గంబున నున్నయవి. మఱి కొంతకాలంబునకు భగీరథుండు ప్రార్థింపఁగాఁ గమలగర్భు నానతి నాగంగ యిలాతలంబునకు రా నయ్యిన నాజలంబుల యురవడికి భూమి యోర్వం జాల దని మహాదేవుఁ డాయాకసంబునుండిపడుగంగాప్రవాహంబును శిరంబునం దాల్చి మెల్లన విడువఁగా నాప్రవాహము జహ్నుమునియజ్ఞవాటంబు నావరింప నతఁడు యజ్ఞ విఘ్నభీతిచే నాజలంబు లెల్ల యోగబలంబునఁ ద్రావి తనచెవినుండి విడిచెను. కా నీగంగ జహ్నుమునికన్య యయ్యె. ఈచరిత్రవిస్తారంబు నేఁ దెనిఁగించి యుండ శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణంబునం దెలిసికొనవచ్చును.

దేవతలకు సయితము దయ కలిగియుండుట విస్పష్టం బయ్యె. ఇట్టిమహాత్మ్యం డీయూర నుండియుం గాంచుటకు లేకయున్నానా యభాగ్యం బేమనవచ్చు! అంత నేమయ్యె?

బుద్ధిసాగరుఁడు. ఓరాజా మీ మవ్వ డతనిమాహాత్మ్యంబున కచ్చెరువొందు చుండ నిమంత్రితు లగుబ్రాహ్మణులలో నొక్కఁడు చోళదేశాగతుండు నాతో నిట్లనియె. ఓమంత్రిపుంగవా! యింతదనుక నితఁడు కాళిదాసుం డని యెఱుంగకుంటిని. ఈయతిమానుష ప్రభావంబున నితని నిరూపించి చూచి గుఱుతుపట్టితిని. ఇతనిప్రభావంబునితఁడు భగవత్ప్రీణయపాత్రతం బడసినవృత్తంబును వినుఁడు.

ఏను శ్రీరంగస్థలంబున నునుకలము రంగనాయకీప్రాణనాథునిం దర్శించుచుండు వాఁడను. ఒక్కదినంబున రాత్రి వేళ నాదేవపూజానియుక్తులగు పూజారులు గుడిపనులు ముగింపుజేసికొని కవాటములు మూయుచుండిరి. అప్పు డీసువేషధారి యయ్యెడకుం జనుదెంచి రంగనాథుని దర్శింపం గోరి పూజారులం జీరి దేవుని దర్శింపవలయును దలుపులు తెఱువుఁడు అని యడుగఁగా నాగుడిపూజారు నితనిం జూచి ఓరి! దేవుఁడు నిద్రించుచున్నాఁడు; ఇప్పుడు దర్శనంబునకు సమయంబు గాదు అని చెప్పి గ్రామ్యునిం బోలెఁబరిహసింపఁగా నీకవి తలయూఁచి యి ట్లనియె.

* శ్లో. ఐంద్రీం పాటలయ న్నలక్తకరుచా మంఘ్రిత్విషాం జాలకై,
రాశాం రత్నకిరీటకాంతినికరైః పాశాయుధీయా మపి,
పర్యంకే పవమానతూలభరితే పారే కవే రాత్మజం,
ముద్రా కాచన ముక్తిదానకుశలా నిద్రాతి:—

---

* టీ. అలక్తకరుచాం = లత్తుకకొప్పయిన యెఱ్ఱని కాంతులుగల, అంఘ్రిత్విషాం = పాదకాంతుల, జాలకైః = సమూహములచేత, ఐంద్రీమాశాం = ఇంద్రపాలితమైన ప్రాచీదిశను, పాటలయన్ = రక్త వర్ణముగలదిగానొనర్చుచు; రత్నకిరీటకాంతినికరైః = రతనంపుబొమిడికపు వన్నెలగుంపులచే, పాశాయుధీయామాశామపి = వరుణపాలిత మగుదిశను, పాటలయన్=రక్తవర్ణము గాఁజేయుచు, పారేకవేరాత్మజం = కావేరీనదీతీరమునందు, పవమానతూలభరితే = వాయుమయ మగుదూదినింపినదయిన, పర్యంకే=పానుపునందు, (అనఁగా శేషశయనంబునం జనియు; నతఁడు సర్పంబుగాన వాతాశనుఁడనియు భావము) ముక్తిదానకుశలా=మోక్షము నొసంగుటయందు సామర్థ్యముగల, కాచనముద్రా = ఒకముద్ర:—రతుకవస్తువు, నిద్రాతి=నిద్రించుచున్నది. జాగర్తి వా = మేలుకొనియేయున్నది! శ్రీరంగనాథుఁడు కావేరీతీరమందుఁ దూరుపు దిశకుఁ బాదపద్మములు సాచియుఁ బడమటి దిశయందు శిరం బిడుకొనియుఁ బరుండియున్నాఁ డని భావము.

అని చెప్పినఁ దోడనె యాయాలయంపుఁదలుపులు తమంతటఁ దామ తెఱచుకొనెను. అప్పుడు తదంతరంబునుండి,,

సీ. శ్రీరంగనాయకీచారుకుచాభోగ కాశ్మీరసుభగవక్షంబుతోడ,
నవనీలనీరదోద్భవసుందరచ్ఛాయఁ గడుఁ బ్రోసెడుదేహకాంతితోడ,
కరుణాతరంగముల్ గలయంబర్వఁగఁ జేయు దళదబ్జపత్రనేత్రములతోడ,
కుటిలబంభరనీలకుంతలావృత మయి తళతళ మెఱయుముద్దుమొగంబుతోడ,

గీ. మణిమయోదారభూషణగణముతోడఁ। డంబు మీఱు మెఱుఁగుకనకాంబరంబుతోడ,
మధుకరాకుల పావనమాలతోడఁ। దరుణితోఁ గన్పడిరి రంగధాముఁ డపుడు.

ఇట్లు ప్రత్యక్షం గనంబడి యా దేవదేవుండు కటాక్షించి యో కాళిదాస! మహాకవీ! మదీయాలయపరిచారకులు నీప్రభావం బెఱుంగక నిన్ను గ్రామ్యునింబోలెఁ బరిహసించి దేవుండు నిద్రించుచున్నాఁ డని యనిరి. తదనుగుణముగ నీవు నన్ను సంస్తుతించినశ్లోకముచే నిద్రాతి యని యంటివి. ఆపలుకువలన నీస్థలంబు ప్రభావశూన్యంబై నిద్రించినది యుంబోలె నడంగు. కాన నీస్థలంబున నీకొఱకు నింత గన్పడకుండ నుత్తిష్ఠించునది యని యానతిచ్చినం గవియు మహానందామృతలహరీపరంపరల నోలలాడుచు నిట్లనియె.

శ్లో. జాగర్తివా.

అని యిట్లు పల్కి యాలక్ష్మీపతికిం బ్రదక్షిణనమస్కారంబు లొనరించి దేవా నీవు నాపయిం గరుణించి దర్శనం బొసంగుటం జేసి కృతార్థుండ నైతి నని సంస్తుతించిన నారంగధాముండు నంతర్హితుం డయ్యె. అంతం గవియు నవ్వోటు వాసి చనియె. అది గాంచి యచటనుండువార లచ్చెరు వొందిరి. ఇది నే నెఱింగిన మఱియొకప్రభావంబు. అని యాబ్రాహ్మణుండు పల్కఁగా మేము మాశ్చర్యపూరంబునం దేలుచు నాస్వర్ణదీపావన జలంబులం బితరులకు నివాపాంజలులు నిర్వర్తింప నంతలో మత్పూర్వులును నాజనకుండు నాతల్లియు మాకన్నులకు బ్రత్యక్షము గనంబడి యోపుత్రకా! నీ వీమహాత్ము ననుగ్రహంబువడసి స్వర్గంగాజలంబులం దానమాడి మాకు నివాపంబు లొసంగినకతంబున మే మెల్లరమును బాపంబులు వాసి యచ్యుతం బగుపదంబుం బ్రాపించుచున్నారము; అని చెప్పి చనిరి. ఓరాజా యాకవివరునిమాహాత్మ్యం బత్యద్భుతంబు నీకుం దెల్పితిని.

భోజుఁడు. ఆర్య! బుద్ధిసాగర! నీతల్లి యాకవివరునిమాహాత్మ్యం [illegible] ఆవృత్తాంబు నీ వెఱుంగుదువేని వచింపుము. అది విని మా [illegible]

బుద్ధిసాగరుఁడు. రాజా! చెప్పెదను వినుము. వృద్ధ యగు నాతల్లి; భువనేశ్వరీ పాదపంకజప్రణామబద్ధాశయ యొకనాఁడు తదీయదేవాలయంబునకుం జని యాజగదంబికకుం బ్రణమించి సంస్తుతించి తనమనంబున నోదేవి! యేను భవసాగరాంతర్నిమగ్ననై భవదీయచరణసమాశ్రయణం బనునావం గాంచినదానను. న న్నుత్తమగతికిం జేర్చుభారము నీది యని ప్రార్థించి యచ్చోటు వాసి యింటికిం జనుదెంచుచు మార్గమధ్యంబున విజనంబైయుండు నొకగుడిసెలో నొకయోగిని బిడ్డని నొకని నెత్తుకొని యత్యాశతో నోనాభ్రాతా! ముద్దమ్మా! యని యొకమాఱు ముద్దిడుకొని యనంతర మాబిడ్డ నిసే భ్రాతృపుత్రుఁడా! యనియు, పుత్రునిపుత్రుఁడా! యనియు, మామగారూ! అనియు, కుమారుఁడా! యనియు, పినతండ్రీ! యనియు, మఱఁదీ! యనియు సంబోధించుచు ముద్దిడుకొనియెను. అది గాంచి నాతల్లి పరస్పరవిరుద్ధములయిన యీవచస లొక్కని నుడుట యెట్లని వితర్కించుచుఁ గతంబు దెలియక యాయోగినికడకుం జని తనసంశయంబడిగిన నాయోగిని యిట్లనియె.

ఓయమ్మా! వినుము. ద్రవిడదేశమందు జంగమువాని కొక్కనికిం జారుతర సౌందర్యోపేత యగుకూఁతు రొక్కతె జనియించి మఱియొకజంగమువానికిం బత్నియై మగఁడు బిచ్చమెత్తుకొనుచు నూళ్లవెంటం దిరుగుచు దూరదేశంబునకుం బోయియుండ జనకునింటనుండెను. ఆ జంగమునింగారి సమారూఢయావనయై సమీపదేశంబున నుండు కోడెకాండ్రకుం దంగెడిజున్నై ప్రవర్తించుచు నొకకుమారునిం గనియె. దానిజననీజనకు లావృత్తం బితరుల కెఱుకపడకయుండ దాఁచి యాశిశువును తమయింటి కతిథియై వచ్చిన కన్నడదేశపుజంగమువానికి సంతానశూన్యుని కొక్కనికిం బుత్రికఁగా నొసంగిరి. ఆనాతి తొల్లింటివలె మఱికొందఱువగకాండ్రం గూడి రహస్యంబుగఁ గామసుఖం బనుభవించుచు గర్భంబుఁ దాల్చి నన్నుం గనియె. పూర్వపుశిశువుంబోలె నన్ను నొకతెలుఁగుదేశపు జంగమువానికిం బుత్రికగా నొసంగిరి. క్రమక్రమముగ నక్రమప్రవర్తనము బయల్పడుటం జేసి బంధుగులచే నాయంబ బహిష్కృతయయి యుదరపోషణంబునకు రూపవతిగాన వేశ్యావృత్తిం గైకొని బ్రతుకుచున్నది. నన్నును నాయన్నను గైకొనిపోయినవారు పరస్పరబంధుభావంబు గలవారగుటంజేసి తమతమయాకారసపుత్రు లనియే చెప్పుకొనుచు మాయిరువురకు వివాహంబు సల్పిరి. మేమిరువురమును భిక్షుకవృత్తిచే జీవించుచు నొకయూర నుండ నాభర్త యింట లేని సమయంబున నొకయోగిని సనుదెంచి నన్నుం గాంచి యోసి! అన్నను వివాహముచేసి కొన్నదానా! కడుఁ బాపిష్ఠురాలవే యనిన నేను గర మనుతపించుచు నాయోగినిని వేడి వృత్తాంతంబుఁ దెలిసికొని భ్రాతృగమన పాపంబున కేవగించుకొనుచు నాయోగి

ని నా కీపాపంబుఁ దొలఁగు నుపాయం బుపదేశింపు మని వేడుకొనఁగా నాదయామయు రాలు నాకు యోగం బుపదేశించి తనవెంటం దోడ్కొని చనియె. నామగండు నన్నుం గానక దుఃఖాకులితుండై దేశంబులు దిరుగుచుఁ దల్లి వేశ్యయై యుండునగరం బునకుం జేరి దానిని సంపదముచేసికొనియె. ఆయిరువురకుం జనించినవాఁడీ బిడ్డఁడు. ఏను పుణ్యక్షేత్రదర్శనోత్సుకతం జెలంగుచుం బోవుచుండి మధ్యమార్గంబున వీనిం గాంచి యాసఁ గొని దగ్గఱకుం జేరి నాకు నీకుమారునికిని గలసంబంధంబులు సెప్పు కొనుచు ముద్దుపెట్టుకొంటిని. (1) వీఁడు నాజననికిం జనించుటంజేసి తమ్ముఁడాయెను. (2) నాతోడంబుట్టినవానికిఁ గుమారుఁడు గాన నాకు మేనల్లుఁడయ్యెను. (3) నాజన నికిం గుమారునికుమారుఁడు గాన దానికిం బతినగునాకు వీఁడు పౌత్రుఁడయ్యె. (4) నాజననికి నేను కొడుకుపెండ్లామును గానఁ గోడల నైతిగదా! దానంజేసి నాజనని నాకత్తగాఁ గలదు. అత్తగారిమగఁడు మామగారు. మామగారితమ్ముఁడును మామగా రగును. నామగని యమ్మకుఁ గొమరుఁడు గాన నతనికి సహోదరుండయ్యె. ఆకతంబున నాకు మామగారయ్యె. (5) నామగనికిం గుమారుండు గాన నాకు సుతుండయ్యె. (6) నాజనని పెనిమిటి నాకుఁ దండ్రిగదా! తండ్రితమ్ముఁడు పినతండ్రి యయ్యె. ఈ బిడ్డఁడు నామగనియమ్మకుం గొడుకుగాన నతనికిం దమ్ముఁడగు. (7) నామగని తమ్ముఁడు గాన మఱఁది యయ్యె. ఈ యేడుసంబంధంబులును జెప్పి ముద్దుగొంటినని నుడివెను. నాతల్లియునది విని యాశ్చర్యంబు నొందుచు నిట్టిపాపాటవీపటలవిపహితము యోగాగ్నివలనఁ గాల్పంబడి పోయెఁ గదా! సంసారమునఁ బుండువారికి నిస్తరణో పాయం బిట్టియోగీంద్రుల యనుగ్రహంబగదా యని చింతించుచు నాయోగినితో నోభగవతీ! నాయం దనుగ్రహించి యేదేని సద్గతి వడయు నుపాయం బుపదేశింపు మని యడిగిన నాయవ్వయు నోబ్రాహ్మణీ యేను పుణ్యక్షేత్రవిలోకనోత్కంఠాకుల మానసనై వేగిరంబ యరుగుచున్నదానం గాననిప్పుడు భవదభీష్టార్థంబు నెఱవేర్ప నవు పడదు; దివ్యజ్ఞానంబున నాకెల్లవృత్తంబులు దెలియు; ఇప్పు డేను నీ బిడ్డనితో నాడుకొనినసంబంధప్రకారంబు నాకుం గాక మఱియెవ్వరికిం దెలియదు; ఈ సంబంధ ప్రకారంబు సమస్యగాఁ బ్రకటించిన నందు సత్యంబెఱింగి యెవ్వండు వల్కు; నాతనివలన నీ కుత్తమగతి గలుగంబోవు నని వచించి చనియె. నాతల్లియు నయ్యోవ వాసి యేగుదెంచుచుం దన కెదురుగా భువనేశ్వరీపాదప్రణామాసక్తుండై పోవు నీకవిం గాంచి తనకడ నుండుపరిచారికలం గొని ॥శ్లో॥ శిశుం లాలయంత్యబ్రవీ త్సా భ్రాత! భ్రాతృవ్య! పౌత్ర! శ్వశుర! సుత! పితృవ్యేతి తం దేవరేతి,, అనుసమస్యను జెప్పింప నది విన్నతోడన యతండు,

* శ్లో. జారోత్పన్నౌ విసృష్టౌ తనయదుహితరౌ దంపతీ దైవయోగాత్,
యోగిన్యా గర్హితా సా తదనుగమవశా ద్యోగినీత్వం ప్రపేదే,
పశ్చా ద్వేశ్యీకృతాంగాజనిత సుతశిశుం లాలయం త్యబ్రవీత్సా,
భ్రాత ర్భ్రాతృవ్య పౌత్ర శ్వశుర సుత పితృవ్యేతి తం దేవరేతి.

అని చెప్పి చనియె. నాతల్లియు నది విని యీసంబంధప్రకార మెఱింగి తెల్పి నందు కాకవిని సర్వజ్ఞుండై యుండునని మెచ్చుకొనుచు నానాటంగోలె నతనికడం దా సద్గతి నొందుటకుం దగినవెఱవు దెలిసికొనం గోరుచుండి యకస్మాత్తుగం దనకుం గాల గతింజెంద నైనం దనమనంబున వెర వూహించి నన్నుం జీరి యీవృత్తాంతంబుం జెప్పి తన యౌర్ధ్వదైహికకార్యంబునం దతని నిమంత్రితునింజేసి మృష్టాన్నాదుల సంతృప్తిం గావించినం దనకుం బరలోకంబున సమస్త సుఖంబు లబ్బునని చెప్పి కాలగతిం జెందె.

భోజుఁడు. ఆర్య బుద్ధిసాగర! ఆకవి సర్వజ్ఞుండు గానినాఁ డీవృత్తం బతిరహస్యంబె ట్టెఱింగి పల్కుట యెక్కడిది? పరోక్షమునం జరిగినవృత్తంబులు నయిత మితని కెఱుక పడనివి లేవు. ఇతనిమాహాత్మ్యంబు సాధారణంబుగాదు. తదీయదర్శనంబె పాపాపహంబగును. అది నాకు సమకూరుకాలంబుం బ్రతీక్షించుచున్నాఁడ.

బుద్ధిసాగరుఁడు. ఓ రాజా! కాలంబు రాక యెదియుం గూడదు. అది రాఁగాఁ గూడక పోదు. సర్వంబు కాలవశంబై యుండు. ఇప్పుడు మన కిట్టియతిశయంబు గల్గునని మనంబున నైనఁ దలపోసియుంటిమా! అది యట్లుండనిమ్ము. నేను కర్తవ్యశేషంబు గలవాఁడను. ఇంటికిం జనియెదను.

అని నిష్క్రమింతుం డయ్యె.

---

* టీ. జారోత్పన్నౌ = జారపురుషునిచేఁ గలిగినవారగుటంజేసి, తనయదుహితరౌ = కుమారుఁడును గూఁతురును, విసృష్టౌ=పరిత్యజింపఁబడినవారు; (అనఁగా నితరులకీఁబడిరనుట) దైవయోగాత్ = విధివశముచేత, దంపతీ = భార్యాభర్త లయిరి. సా = ఆకూఁతురు, యోగిన్యా = ఒకయోగినిచేత, గర్హితా = నిందితయై, తదనుగమవశాత్ = దానిననుసరించి చనుటచేత, యోగినీత్వం = యోగిని యైయుండుటను, ప్రపేదే = చెందెను, పశ్చాత్ = పిమ్మట, వేశ్యీకృతాంగాజనితసుతశిశుం = వేశ్యగానైనతల్లికి దానికుమారునివలనం జనించినశిశువును, లాలయంతీ=లాలనమొనర్చుచు, సా= ఆకూఁతురైనయోగిని, భ్రాతః=ఓతమ్ముఁడా! అనియు; భ్రాతృవ్య=అన్నకుమారుఁడా! అనియు; పౌత్ర=కుమారునికుమారుఁ డగుమనుమఁడా! అనియు; శ్వశుర=శ్వశురుఁడా! అనియు; సుత = కుమారుఁడా! అనియు; పితృవ్య = తండ్రితమ్ముఁడా! అనియు; దేవర = మఱఁది! అనియును; తం = ఆబిడ్డనిగుఱించి, అబ్రవీత్ = వచించెను.

భోజుఁడు. ఓదేవీ! కలాలాపపిలుపంబోయినసీత యిందనుక రాలేదు. కవిపండితసంఘంబు శాంతక్రోధంబై యుంటికిం జని యుండదే మొ! కానం దడయుచున్నది యని తోఁచెడిని. అదిసనుదెంచునంతలో మాధ్యాహ్నికస్నానాదికృత్యంబులు దీర్చుకొని యభ్యవహారంబు సల్పి యుండెదను.

అని దేవితో నిష్క్రమింతు రయ్యో.

మిశ్రవిష్కంభము.

---

సీత ప్రవేశించి. ఏను మహారాజుమహాపాత్రనై తత్సన్నిధి కరుగుచున్నదానను. కవివరులు కలహించుకొనుచు సభ వదలి పోకుండుటంబట్టి యధిపతిముదల కప్పుడే చనుదెంచుటకు లేకపోయె. కలాలాప మహీపతి లీలావతీదేవిభవనంబున నున్నాఁడని వచించె గాన నక్కడకుం జనియెదను.

అని పరిక్రమించుచు స్మృతినభినయించి,,

ఔర! ఈరాజసభకుఁ గ్రొత్తగఁ జనుదెంచిన కవీంద్రుని సామర్థ్యంబె సామర్థ్యము. ఇంతటిసమర్థు లిందనుక నీరాజసభకుం జనుదెంచినవారు లేరు. రాజు శంకరకవి కొసంగిన ధనమునుగుఱించి కవ్వుడుకుం బ్రవృత్తం బయినకలహంబునకు దగుసమాధానంబు సెప్పి యాజగడము నివర్తింపం జేసినయీకవిచంద్రుని బుద్ధికౌశలంబునకు రాజు కరము మెచ్చెను. ఆర్య బుద్ధిసాగరుఁడు మొదలగువారు నుడువఁగా నతిమానుషం బగుసామర్థ్యంబు విని యీతనిం గాంచఁబోలు మహీభర్త గనుంగొనం దహతహపడుచుండెడిని. ఈయుపరిమేయప్రభావసంపన్నుండు కొన్నిదినంబులనుండి యీయూరం బొడసూపువాఁడు దా నిందనుక రాజసభకు రాకుండి యీదినంబున సనుదెంచుట యారసిచూడ బ్రాహ్మణులు క్రోధమూర్ఛితులై యభ్యవహారాదికంబులు సయితమొప్పరికించి యుండుటం గని దయమానమానసుండై వారల నుపశమితక్రోధులం జేయం దలంచి యె కవిపండితసంఘంబు నాత్మీయసమావేశంబున నలంకరించె నని తోఁచెడిని. ప్రాయికంబుగ మహాత్ములు పరులకష్టంబుల కోర్వంజాలరు. తమవలన నైనంతయుపకారంబుసల్పి యాయిడుమ దొలంగింపకపోరు. వారలస్వభావం బత్యుదారము ఈకవివరునిం గనినచో మహీపతి యెంత సంతసించునో!

ప్రత్యభిజ్ఞతో,,

ఆ! ఈకవి వర్యునియం దెంత సంతసంబు గల్గెనో యంత యసూయ యీదినంబున సభకు రాఁబోవు ఛాందసులయందు [illegible] గలుగకపోదు. [illegible]సాలంకార

మనోహరంబగు కవితాచమత్కృతి యున్నంగాని సంతసింపఁడు. ఆఛాందసుల కీగంధమే తెలియదు. వేదవిత్తము లగు బ్రాహ్మణవర్యులు రాజుకడకుం జనుదెంచి యాశాభంగంబుం గాంచి చనియెదరే! యని మానసంబు చింతాకులం బగుచున్నది. ఇందు కేమి సేయనగు ?

చింతనభినయించి. తలయూచి,,

సరి! ఇది యీవిధంబునం జరిపినచో సర్వము సమంజసంబ యగును. రాజు కడనాకవిరాజుండు కాలంబున ఛాందసబ్రాహ్మణులఁ బ్రవేశపెట్టినచో వారలందఱం గలలోపంబును గవి సమరసపెట్టు. బ్రాహ్మణులును భగ్నాశులై చనరు. చేయందగు కార్యంబిదియ. ఇప్పుడు పగలపరాహ్ణంబు దాఁటె. సాయాహ్నంబు ప్రవృత్తం బయ్యెడిని. కవియు సభయందె యున్నవాఁడు. రాజునకు వృత్తాంతంబు నివేదింతము. ఇదె దేవియుండు నంతఃపురము.

ప్రవేశమభినయించి. ముందుకు దృష్టినిగుడ్చి,,

అదె మహీభర్త మహావాతాయనాంతరోపవిష్టుండై యుపవనమారుతంబుల సేవించెడిని. సమీపమునకుం జనియెదను.

అని యుపసర్పించుచున్నది.

వాతాయనాంతరోపవిష్టుండై భోజుండు ప్రవేశించుచున్నాఁడు.

భోజుఁడు. ఆత్మగతమున,,

ఏఁ జెప్పిపంపి కడుఁ దడవయ్యెనింతదాక సీత రాకున్నయది. కవుల కలహం బింతదనుక నివృత్తంబు గాకయుండునే!

సీత. రాజసమీపమునకుంజని,,

మహారాజ జయంబు గల్గుంగాత.

భోజుఁడు. ఓసి! సీతా! నిన్నే తలంచుకొనుచుంటిని. వచ్చితివి. కరంబు సంతసం బయ్యె. నేను మధ్యాహ్నమునకు ముందె నిన్ను రమ్మంటిని. నీవు తడయుట కుం గారణం బేమి?

సీత. మహారాజ! తా మేయర్థంబు నన్నడుగం దలఁపించితిరో? ఆయర్థం బిప్పటికి సాంతంబు గాకయుండె. శంకరకవికి మహారాజు పండ్రెండులక్షలధనం బొసంగిన కారణంబునఁ బ్రవృత్తం బగువిద్వత్కలహంబు కలాలాప సనుదెంచి దేవి యాజ్ఞాప్రకారంబుఁ జెప్పినప్పటికి నివర్తింపక యుండెను. కవులు పరస్పరము గలహించుకొనుచు సభాభవనంబుం బాసి పోకుండిరి. అందుచే రానువుపడకయుండె.

భోజుఁడు. సరే ! వారలవివాద మిప్పటి కెట్లు నివర్తించెనో తెల్పుము.

సీత. మహారాజ! మీరు సభాభవనంబుం బాసినయనంతరము తత్పూర్వ మంత్రః క్రోధపరీతులై లోలోపలన కలహించుకొనుచుండిన యాకవులకుఁ గ్రోధాగ్ని యుద్దీపితంబయిన నంతట నొండొరులు రోషపరవశులై వాక్కలహంబునకుం గడంగి ఈనరపతియజ్ఞత యేమి ? వీని నిటఁ గొలుచుట యవమానకరము ; సకలవేద శాస్త్రవిశారదులమైన మమ్మాశ్రయించుకొని యుండుమనకు లక్షధనమే యిచ్చెను. మనవలె సమర్థుండుగాక గ్రామ్యకవి యగుశంకరునికిం బంచదశలక్షలధనం బొసంగె. పాత్రాపాత్ర వివేకంబు లేనివీఁ డిచ్చిన నేమి? ఈకుండిన నేమి? ప్రభు వవివేకమతి యయి గుణజ్ఞు లగుమంత్రులయందుం బెడమోముపెట్టి ఖలులకుం జోటిచ్చినవాఁ డగునేని యయ్యెడసజ్జనులుం జేరం జనరు. అని యివ్విధంబునం బల్కుచు మూఁడుపయాముంబు గడచుదనుక సభాభవనంబు వదలి పోకుండిరి. అప్పుడు,,

సీ. మణిగణమండిత మహనీయకుండల కలితకపోలయుగంబువాఁడు,
మృగమదపంక సమ్మిశ్రితమలయజ సాంద్ర చర్చితతనుచ్ఛాయవాఁడు,
కనకదివ్యాంశుకకల్పిత ప్రావరణోనూనరుచులచే నమరువాఁడు,
శృంగారరస మిట్లు రంగారఁ బరిణామ మొందెనో యని చెప్పనొప్పువాఁడు.

గీ. కవిత యారీతి దేహంబుఁ గాంచెనొక్కొ,
వరవిలాసంబు మూర్తితో వఱలెనొక్కొ,
యనుచుఁ జూడంగఁ దగునట్టియందగాఁడు,
వచ్చె సభ కొక్క సత్కవిసన్నిభుండు.

ఇట్లు సనుదెంచినవాని ; మహీవలయంబునకుం దీసమహేంద్ర[illegible]వాని ; నాకవిశిఖామణిం గాంచి యావిద్వత్సభ భయంబును గౌతుకంబును జెంది యుండె. ఆతఁడంత నందఱకుం బ్రణామం బొనర్చి భోజభూపతి యెక్కడ ! అని యడిగిన సౌధాంతరంబున నున్నాఁడని సభాసదులు బదులు సెప్పఁగా నతఁడు పండితులం గాంచి మీరలేల కుపితులై యున్నారని ప్రశ్నచేసి యందఱుం గారణంబుఁ దెలిసికొని యిట్లనియె.

ఓపండితులార ! శంకరకవికి రాజు పంచదశలక్ష లిచ్చెనని మీ రనుకొనం జనదు. భోజునభిప్రాయంబు మీ కెఱుకపడినది గాదు. భోజుండు మానసంబున శంకరునిం బూజింపం దొడంగియుండినవాఁడు గాన దత్పుణ్యసన్నిహితుఁ డైనశంకరుని యందు నేకాదశరుద్రు లున్నారని యవ్వారికి నొక్కొకలక్ష చేతను శంకరకవి నొక

లక్ష్మీచేతను బూజించినవాఁడు. ఇదియు నీయభిప్రాయంబు. అని చెప్పెను. అని యిట్లు చెప్పఁగావిని సెబ్బెఱపడి పండితు లందఱు మాఱు పలుకక యూరకుండి కొంత సేపు లేచి పోయిరి.

భోజుఁడు ఆశ్చర్యపడుచు,,

ఔరా! యీమహాకవికౌశలంబే మని వర్ణింతును! నామానసంబునం గల భావంబుం దెలిసి చెప్పెను. ఇట్టికౌశలంబు మనుష్యమాత్రుల కుండదు. కాన నీతఁడు భారతీదేవ్యవతార మని యెంచ నగును. వైళంబ యాతనిం గనుంగొన నామానసం బుత్కంఠితం బగుచున్నయది.

సీత. మహారాజ! ఆతని నేను సింహాసనాసీనుం గావించి వృత్తంబు రాజునకు విన్నవించి నిన్నతనికడకుం దోడ్కొని చనియెద నని చెప్పి వచ్చినదానను. ముదల యేని దోడ్కొని వచ్చెద.

భోజుఁడు. ఓసి! యట్లయి! తోడ్కొని రమ్ము.

సీత. నిష్క్రాంత యయ్యె.

భోజుఁడు. ఆత్మగతమున,,

ఏలకో! సీత దోడ్కొనిరాఁగలపురుషునిం గనుంగొనుటకు మానసం బత్యనల్పకుతూహలంబునం బొదలుచున్నది.

సీత. కాళిదాసునితో ప్రవేశించి,,

సీత. ఓమహాకవీ! అదె మహారాజు వాతాయనాంతరోపవిష్టుండై యుపవన మారుతసేవ యొనర్చెడిని. సమీపమునకుం జనుము.

కాళిదాసుఁడు రాజుసమీపంబునకుం జనుచున్నాఁడు.

భోజుఁడు. కవిం గాంచి లేచి నమస్కరించి. ఆత్మగతంబున,,

ఆ! ఏమి యితని సౌందర్యంబు. మన్మథవసంతాదులం దిరస్కరించునట్లు తోఁచుచున్నాఁడు. ఆదినంబున మాంసాపణంబుదగ్గఱఁ గానంబడినవాఁ డితండ యని తోఁచెడిని. అప్పుడు నాకుం గలిగిన విత్కారంబు పన్నంబయ్యె.

కాళిదాసుఁడు. మహారాజ! స్వస్తి గలుగుంగాత.

భోజుఁడు. ఓ విప్రోత్తమా! భవద్దర్శనంబున సంతోషాంబుధిం దేలుచున్నాఁడ.

అని యాలింగనముచేసికొని కేలు తనకేలం గీలించి,,

ఓకవివరా! భవన్నామంబునం దగిలి యే యక్షరంబులు సౌభాగ్యంబుం గాంచిన యవి ? ఏదేశపుజనులు భవద్వియోగమున బాధపడియెదరు ?

కాళిదాసుఁడు. భోజునిహస్తంబునందు "కాళిదాసః" అని వ్రాయుచున్నాఁడు.

భోజుఁడు. కాళిదాసునిపాదంబులపైఁ బడియె.

కాళిదాసుఁడు. రాజుం గవుఁగిటం గ్రుచ్చియెత్తెను.

భోజుఁడు. ఓ మిత్రమా! ఇప్పటికి నాయదృష్టంబు పండినయది. నీప్రభావంబు జనులవలన విని బహుదినములుగ నిన్నుం గాంచఁ దహతహపడుచుంటిని. కవివరసమాగమంబు మావంటివారలకు నిరవద్యకీర్తిసంపాదకంబు గాదె! ఇది భాగ్యవిశేషంబునం గాక యూరక దొరకునే.

కాళిదాసుఁడు. మహారాజ కవి యగువానికిం బ్రభుపరిగ్రహంబు లేకున్నను బ్రభువగువానికిం గవి లేకున్నను బ్రసిద్ధి గలుగం బోదు. వినుము.

* శ్లో. మణినా వలయం వలయేన మణి ర్మణినా వలయేన విభాతి కరః,
కవినాచ విభు ర్విభునాచ కవిః కవినా విభునాచ విభాతి సభా.

భోజుఁడు. మహానందంబుతో,,

మిత్రమా ! కవికులచంద్ర కాళిదాస ! భవదీయసరసవచనామృతధారలు గ్రోలం గంటి. జన్మసాఫల్యంబుం గొంటి.

---

* టీ. మణినా = రతనముచేత, వలయం = కడియము, విభాతి = వెలిఁగెడిని. వలయేన = కడియముచేత, మణిః = రతనము, విభాతి=వెలిఁగెడిని. మణినా వలయేన= రతనముచేతను గడియముచేతను, కరః=హస్తము, విభాతి = ప్రకాశించెడిని. అట్లు:— కవినాచ=కవిచేత, విభుః = రాజును, విభునాచ = ప్రభువుచేత, కవిః = కవియును, కవినావిభునాచ = కవిచేతను బ్రభువుచేతను, సభా = సభయును, విభాతి వెలిఁగెడిని. రతనము చెక్కుటవలన వలయమును; వలయమునందుఁ బొదుగుటచే రతనమును; ప్రకాశము గాంచుచుండుట యట్లుండ నట్టి రత్నముచేతను వలయంబుచేతను వానిని దాల్చుకొను హస్తమునకుఁ బ్రకాశము గల్గును. అట్లు కవిగూడుటచే రాజును రాజా రముచేఁ గవియు నీయిరువురు గూడుటవలన సభయుఁ బ్రకాశించెడిని. అని భావము.

ఈ శ్లోకమునకు సరియయిన యాంధ్ర పద్యము.

కం. వలయము మణివలనను నా। వలయముచే మణియు రెంటవర లెడిఁగరము,
ట్లిలఁ గవిచే విభుఁడు న్గవి। యు విభుచే వీరివలన నలరెడి సభయున్.

దౌవారికుండు ప్రవేశించి. మహారాజ! యే దేశమునుండియో యిరువురు విప్రులు చనుదెంచి ద్వారదేశంబున నిలువంబడి భవద్దర్శనంబునకు వేచియున్నవాడు.

భోజుండు. వారిఁ బ్రవేశపెట్టుము.

దౌవారికుండు. నిష్క్రాంతుండై బ్రాహ్మణులతోఁ బ్రవేశించి.

ఓ బ్రాహ్మణులారా! అదె భూపతి కవితో మాటలాడుచు నిలువంబడి యుండెడిని. సమీపమునకుం జని మీ యభీష్టార్థంబులు దెల్పుకొనుఁడు.

అని నిష్క్రాంతుండయ్యె.

బ్రాహ్మణులు రాజుకడకుం జనిరి.

భోజుండు. ఓవిప్రులార! మీర లే మపేక్షించి వచ్చితిరి?

బ్రాహ్మణులు. మహారాజ ధన మపేక్షించి నీదగ్గఱకుం జనుదెంచినారము. వేదవేదాంగంబు లభ్యసించినవారము. నిప్పచ్చరంబునం గలుగునిడుమలు సహింపం జాలక నిన్నుం గాంచ వచ్చితిమి.

భోజుండు. ఓవిప్రులారా! మీకుం గవితాసామర్థ్యంబు గలదా! శ్లోకం బేదేని రచించుకొని తెచ్చితిరా!

బ్రాహ్మణులు. ఓమహారాజ! శ్లోకము చేసికొని వచ్చితిమి. అది సగమే కాని పూర్ణము గాలేదు.

భోజుండు. నవ్వుచు.

మీరు ఛాందసు లరని తెలియుచున్నది. అర్ధశ్లోకమును రచించినవారు తక్కిన సగమును రచింపలేరా! మంచిది చేసిన యర్ధశ్లోకంబైనను వచింపుఁడు.

సీత. ఆత్మగతమున,,

వీరలనుగుఱించి యే నేమ చింతించినయది.

బ్రాహ్మణులలో నొకండు,,

శ్లో. అణో రణీయాన్ మహతో మహీయాన్,, అనియెను.

మఱియొక బ్రాహ్మణుండు,,

శ్లో. యజ్ఞోపవీతం పరమం పవిత్రం,, అనియెను.

భోజుండు. నవ్వుకొనుచు.

ఎంత్రమా! ఈ విప్రులు కేవలము ఛాందసులు. తాము గఱచిన వేదవాక్యము లను లౌకికఛందము లని వచించెదరు. వీరలయజ్ఞానంబుం గాంచిన మా మానసంబునకు వెగటయ్యెడిని. ఈరెండువాక్యములను జేర్చి సరసంబుగ నొకశ్లోకము వచింపుము.

కాళిదాసుఁడు. మహారాజా వినుము. వీరలు వచించినవాక్యములలో "అణో రణీయాన్" అనువాక్యము మొదటను "యజ్ఞోపవీతం" అనుదానిని కడపటను జేర్చుకొనిన నానుడువువాక్యము నడుమ సరిపడివచ్చును. ఎట్లన:—

* శ్లో. అణో రణీయా న్మహతో మహీయా।న్మధ్యం నితంబశ్చ యదంగనాయాః,
తదంగహారిద్ర నిమజ్జనేన, । యజ్ఞోపవీతం పరమం పవిత్రం.

భోజుఁడు. సంతోషపరవశుండై కాళిదాసుని గౌఁగిటంజేర్చుకొని,,

ఓమిత్రమా! కాళిదాస! కవి వన్న నీవ కావే! ఇట్లు సరసంబుగ వచియించువాఁ డెవ్వఁ డున్నాఁడు? ఇట్టి సరసాగ్రణి వగు నీకుఁ బ్రియతమావిరహం బుండంబోలను.

కం. నవనీతమువంటిది యీ భువి। సరసులహృదయ మెప్పుడు పూఁబోఁడులతోఁ,
గవఁగూడి మెలఁగకున్నను। నవనవమదనాగ్నిశిఖల నలిఁ గెంది చెడున్.

నీవు నా ప్రియావిరహంబునం గుందుచున్నా వని మధురవచనాబోధితయై లీలావతీ దేవి నాకుం జెప్పినయది. నీవు దయితాసహితుండవై సుఖంబుం గాంచుచుండం జూచి యానందంబుం జెంద మనం బువ్విళులూరుచున్నయది. తదానయనార్థం బీవు ప్రయత్నింపవలయు. ఇప్పుడు సూర్యుండస్తాద్రిశిఖరారూఢుం డయ్యె. సంధ్యాసమయంబు ప్రవర్తించెడిని. నీ వీ సంధ్యను వర్ణింప విన గోరెదను.

కాళిదాసుండు. మహారాజ వినుము.

---

* టీ. యదంగనాయాః = ఏకాంతకు, మధ్యం = నడుము, అణోః = సూక్ష్మమునకంటె, అణీయాన్ = కడుసూక్ష్మమో! నితంబశ్చ = పిఱుందు, మహతః = గొప్పదానికంటె, మహీయాన్ = కడుగొప్పదియో! తదంగ..మజ్జనేన:—తత్ = ఆకాంతయొక్క, అంగ = తనువున నలందుకొనియెడు, హారిద్ర = పసుపునందు, నిమజ్జనేన = మునుంగుటచేత, యజ్ఞోపవీతం = జన్నిదము, పరమం పవిత్రం = కడుపరిశుద్ధము. అతిసూక్ష్మ మగుమధ్యంబు నతివిపులం బగునితంబంబులును గలకాంత కడు ముత్తమమత్తకాశిని యై యుండక పోదు అట్టిదానిఁ గౌఁగిలించుకొనిన నద్దానియంగ సంగత మగునున్నపసుపున మగ్న మైన జన్నిదమే పరమపవిత్ర మైనజన్నిదము.

ఈ శ్లోకమునకు సరియయిన యాంధ్రపద్యము.

ఉ. ధారుణి నేలతాంగికి నితంబయుగంబును గౌనుదీవె యున్,
హారిమహత్త్వకంటెను మహత్తరగా నణువైనదాని కిం,
పారునణుస్వరూప మన నందమునీటునొ దాసియుంగదా,
క్ష్మీరనిమగ్న మైనయుంచెన్నపుజన్నిదమే పవిత్రమా.

* శ్లో. వ్యసనిన ఇవ విద్యా క్షీయతే పంకజశ్రీః। గుణిన ఇవ విదేశే దైన్యమాయాంతి భృంగాః,
కునృపతిరివ లోకం పీడయత్యంధకారో। ధన మివ కృపణస్య వ్యర్థతామేతి చక్షుః.

భోజుఁడు. సంతసంబుతో,,

మీశ్లోకమా! ఇం దుపమానకల్పనము ప్రపంచానుసారంబై యుండుటం బట్టి కరము మోదావహం బయ్యె.

బ్రాహ్మణులం గాంచి,,

ఓ బ్రాహ్మణులార! మీకు శ్లోకము రచియించు సామర్థ్యము లేకపోయినను మీరు సంతరించి తెచ్చిన శ్రుతివాక్యంబులచే నీమహాకవి సలలన తిరుచిరార్థామృతంబుఁ గ్రోలంగంటిని. ఇమ్మహానందంబునకుం గారణభూతుల రైతిరి గాన మిమ్ము సత్కరింప వలసియున్నది. ఓరీ యెవఁ డక్కడ?

దౌవారికుండు ప్రవేశించి,, మహారాజ యేమి ముదల?

భోజుఁడు. ఓరి దౌవారిక! ఈవిప్రులను గోశాధికారులకడకుం దోడ్కొని పోయి చెరియొక లక్షధన మిప్పించునది.

---

* టీ. పంకజశ్రీః = తామరసములయొక్క కాంతి, వ్యసనినః = ద్యూతాది సప్తవ్యసనములం దగులుకొన్నవానియొక్క, విద్యేవ = శాస్త్రజన్యజ్ఞానము వలె, క్షీయతే = క్షీణతనొందుచున్నది, శాస్త్రము లెన్ని చదివినను ద్యూతమద్యపానాదులం దగులు కొన్నవానికి జ్ఞానము క్షీణించుచు వచ్చు. అట్లే సాయంకాలము గాఁగాఁ బంకజముల కాంతి క్షీణించుచున్న దని యర్థము. గుణినః = గుణవంతులు, విదేశ ఇవ = పరదేశము నందుంబోలె, భృంగాః = తుమ్మెదలు, దైన్యం = దీనతను, ఆయాంతి = చెందెడిని. గుణవంతులు వారలయోగ్యత యెఱింగి గారవించువారలు లేమింజేసి పరదేశంబున దైన్యంబు నొందుచందంబునం దుమ్మెదలు తమ కామెత లొసంగి గారవించుపంకజినీ సముదయంబు మొగిడ్చుకొనుటం జేసి దైన్యంబునుం జెందెడిని, అంధకారః = చీఁకటి, కునృపతిరివ = కుత్సితుండగు రాజువోలె, లోకం = జనులను, పీడయతి = బాధించెడిని. కునృపతి కప్పములు మొదలగునవి మెండుగ విధించి జనుల దారిద్ర్యదుఃఖంబున ముంచి పీడించును. కృపణస్య = పిసునినియొక్క, ధనమివ = ధనమువలె, చక్షుః = కన్ను, వ్యర్థతాం = నిష్ప్రయోజనత్వమును, ఏతి = చెందెడిని. కృపణుఁడు ధనమును దా ననుభవింపఁడు. పరుల కీఁడు. వానిధనమునకు దానోపభోగములు లేమింజేసి వ్యర్థతయే గతి.

దౌవారికుఁడు మహారాజ! అనుగ్రహంబ.

అని విప్రులందోడ్కొని నిష్క్రమింతుండయ్యె.

భోజుఁడు. మిత్రమా! మహాకవీ! సంధ్యోపాసనాదికార్యంబులకుం బోదము రమ్ము. కొద్ది దినములలోనం గరూశదేశమునకుం జనం బ్రయత్నంబు సలుపుదము.

కాళిదాసుఁడు మహారాజ! యట్లయగుంగాక.

అని నిష్క్రమింతులైరి.

ఇది కాళిదాసచరిత ప్రకరణమునందు

నవమాంకము సమాప్తము.

శ్రీరస్తు.

---



శ్రీరస్తు.

# కాళిదాసచరిత్రప్రకరణము.

## దశమాంకము.

బ్రాహ్మణవేషధారియై భోజుఁడు ప్రవేశించుచున్నాఁడు.

భోజుఁడు. ఏను గళాచంద్రుని కార్యార్థము కరూశదేశాధీశునికడ కరుగ బ్రాహ్మణవేషధారినై యిదె వచ్చినాఁడ. కరూశదేశాధీశునినగరంబుం జొచ్చినాఁడను. బ్రాహ్మణవేషధారి నైతినిగాన రాజసభయందుఁ బ్రవేశంబు సులభంబ యగును. ఇదె రాజనగరు!

ప్రవేశ మభినయించి,,

ఓరి ద్వారపాలక! ధారాపతి యగుభోజభూపాలునిసభ నుండుకవి యొకఁడు సన్మానార్థియై వచ్చియున్నాఁ డని వచింపుము. ఓరి! యేమనియెదవు! రాజు విద్వత్పరివేష్టితుండై యుత్తరదేశాగతు లగుపండితులరాకకుం బ్రతీక్షించుచున్నవాఁడు; మీరలునిరభ్యంతరముగ రాజుకడ కరుగవచ్చు ననియా పల్కెదవు? అట్లైన మఱియు మేలయ్యె. ఇదె రాజసభ కేగెద.

పరిక్రమించి,,

వీర్యగుప్తుం డిదిగో! సింహాసనాధిష్ఠితుండై యుండెడిని. సమీపమునకుం జనియెదను.

అని కొన్నియడుగులు సనియెను.

విద్వత్పరివేష్టితుండై వీర్యగుప్తుండు ప్రవేశించె.

భోజుఁడు. రాజా! స్వస్తి గలుగుంగాత.

వీర్యగుప్తుఁడు. బ్రాహ్మణోత్తమా! నమస్కరించెదను. మీరలెక్కడనుండి వచ్చితిరి?

భోజుఁడు. ధారాపతి యగుభోజభూపాలునిసభనుండి?

వీర్యగుప్తుఁడు. సాదరముగ,,

అట్లు లయిన సారతరవిద్యావిశేషవిభూషితులరై యుండంబోలు.

భోజుఁడు. ఔను. ఆ ధారానగరంబునందు సయితము కవిగానివాఁడు లేఁడు. అట్లుండం దత్సభావిభ్రాజితు లగువారి నడుగవలెనే! అభోజునిసభ కళింగ, పూర, వినాయక, శంకర, తారేంద్ర, విద్యావినోద, రేఫణ, గోవింద ప్రముఖసుకవిగణంబుచే

సలంకృతంబై యుండు. అందుఁ గాళిదాస, భవభూతి, దండి, భట్టబాణులు సంస్కృత కవులతిశయించినవారు. అందును గాళిదాసుండు మిన్నయై యుండు.

వీర్యగుప్తుఁడు. ఓ బ్రాహ్మణోత్తమా! దండియు భవభూతియు భట్టబాణుం డును నిరుపమకవితాచాతురీధురీణు లనిపించు. వారికన్నను గాళిదాసుండు శ్రేష్ఠుం డని యేర్పడినచరిత్రంబు లుండునుగదా! అవి దెల్పి వీనులకు విందొనర్పుము.

భోజుఁడు. రాజా! అట్టిచరిత్రంబులు పెక్కులు గలవు. వినుము. మహాకవి కాళిదాసుండు తనకవితాచమత్కారంబుచే సకలము ధారాపతిని మెప్పించుచు సతి డొసంగినయర్ధసింహాసనమున నాభోజునితోడ నాసీనుండై యుండును. ఇట్టిగౌరవంబు గలుగుటంబట్టి భట్టబాణప్రభృతులు మనంబునం గవిపయి నసూయగలవారలయి రాజున కతనియందుం గలగౌరవజ్ఞానమును దొలంగింపం దలంచి యాలోచించి కవివరుండు లేనిసమయంబున భోజునికడకుం బోయి యోరాయి ధారాపతీ! కాళిదాసుండు వేశ్యా లంపటుండై యున్నవాఁడే గాదు; మత్స్యమాంసంబులు సయితము భక్షించుచున్నాఁడు. అనుదినమంగటివీధిలో నుండి యవి విలుచుకొని పోవుచుండఁగా మే మెల్లవారము జూచినవారమే. బ్రాహ్మణుండై జనించి చేపలు దినుటధర్మవిరుద్ధముగదా యని యనిన రా జెదలో నాలోచించి వీర లతనిపయి నసూయచే నసత్యంబులు పల్కు చున్నా రని నిశ్చయించికొనియు వారలమానసము చిన్నబోకయుండ వాక్యజాలతో నోపండితులారా! అతఁడు చేపల నెత్తికొనిపోవుచుండఁగా నేను రమ్మన్నట్లు చెప్పి పిలుచుకొని రండు; మీరలు నుడివినయర్థంబు యథార్థం బయ్యెనేని యతనికి శిక్ష విధింతము. అని చెప్పి పంపఁగా వారలు తాము పల్కినయసత్యవచనంబుల సత్యములని నిరూపింప నోడి మఱునాఁడు మొదలు సభకు రాకుండిరి. కాళిదాసుం డది గాంచి వారలవంతయుఁదుపం దలంచి యొకనాఁడు వారు సూచుచుండ మాంసాపణమునకుం జని చేపలఁగొని చంకఁ బెట్టుకొని రాజరథ్యయందుఁ జనుదెంచుచుండెను. భట్టబాణ ప్రభృతు లట్లాతఁడు సనుదెంచుచుండం గాంచి మించినముదంబున నతనికడకుం జని యోమిత్రమా! కాళిదాస! ని న్నిప్పుడ భోజుండు దోడ్కొనిరమ్మని ముదలచేసె నని చెప్పఁగా దీనాననుండువోలెఁ దోఁతెంచుచు నొక్కింతతడవు తప్పించుకొనిపోవం గడంగి తత్తరపడువాఁడునుంబోలె నభినయించి తుదకు విధిలేక చనుదేరంబూని వాని పగిదిఁ దదానీతుండై భోజసభకు రాఁగా,

రాజు కవిం గాంచి శ్లో (1) “కక్షే కిం తవ” అని యడిగెను.

అందుకు గవి రాజుం గాంచి (2) “పుస్తకం” అని బదులు చెప్పెను.

అది విని రాజు (3) “కిముదకం” అని యడిగెను.

అందుకు గవి (4) “కావ్యార్థసారోదకం” అని బదులు సెప్పెను.

అది విని రాజు (5) “గంధః కిం” అని యడిగెను.

అందుకు గవి (6) “ఘనరామరావణమహాసంగ్రామరంగోద్భవః” అని చెప్పె.

అది విని రాజు (7) “పుచ్ఛః కిం” అని యడిగె.

అందుకుం గవి (8) “నవతాళపత్రలిఖితం” అని బదులుపల్కె.

అంత రాజు (9) “కిం పుస్తకం హే కవే! అని యడిగెను.

అందుకుం గవి (10) “రాజన్ భూమిసురోత్తమాదృత మిదం రామాయణం పుస్తకం” అని యాచేపలకట్టను భూమిపయిం బడవేయఁగా నది కాళికటాక్షంబున రామాయణపుస్తకం బై యొప్పెను. రాజు పరమానందంబుం జెందె. వైరులెల్ల విచ్ఛాయవదనులై యేమియుఁ బలుకక యుండిరి. అదిమొదలు భట్టుభాణుండు కాళిదాసుని యందతిమానుషప్రభావంబు గల దని యెంచి యాతనితో సఖ్యంబున మెలంగుచుండెడిని.

వీర్యగుప్తుఁడు. ఓ విప్రవర్యా! ఆకవివరునికిం గలదివ్యప్రభావం బేమని వర్ణింపంగలము.

భోజుఁడు. ఓరాజా! ఇంతమాత్రమే కాదు! దండికిని యాతనికి జరిగినకలహంబునం దీ తని ప్రభావంబు కరం బరుదై తోఁచు. అది చెప్పెదను విను.

---

1. కక్షేకింతవ=నీచంకలోనుండునదేమి ?

2 పుస్తకం=పుస్తకము.

3 కిముదకం=నీళ్లేమి ?

4. కావ్యార్థసారోదకం=కావ్యార్థంబులలోని సారమీయుదకము.

5. గంధఃకిం=కంపేమి ?

6. ఘన ..ద్భవః=రామరావణులమహాయుద్ధమునంజచ్చినపీనుఁగులకంపు.

7. పుచ్ఛఃకిం=తోఁకలేమి ?

8. నవ.. ఖితం=క్రొత్తతాటాకులందు మొదళ్లు కొనలు దలుగని వానియందు వ్రాసినది.

9. హేకవేకింపుస్తకం=ఓకవీ! అదేమి పుస్తకము ?

10. రాజన్భూ...వేస్తకం. ఓరాజా! విప్రోత్తము లాదరించుచుండు రామాయణ పుస్తక మిది.

ఒక దినమందా ఖేటకక్రీడకుం జని యుండి ప్రభాతసమయసమాగతుండై తనకు నంగటనుండు కవివరులం గనుంగొని.

భోజుండు ; శ్లో. చరమగిరినితంబే చంద్రబింబం లలంబే ”
అని ప్రభాతవర్ణనోదార మగునొక సమస్య యొసంగె.

అంతకుం దొలుత భవభూతి; శ్లో. *అరుణకిరణజాలైరంతరిక్షే గతశ్రీ,, అని పూరించెను.

అంత దండియు ; శ్లో. చలతి శిశిరవాతే మందమందం ప్రభాతే,, అనివక్కాణించె.

ఈ యిరువురు నుడివినయర్థంబులను దనభావంబునం బొదలునవిగా నెంచక కాళి దాసుని నడిగెను.

అతఁడు. శ్లో. యువతిజనకదంబే నాథముక్తోష్ఠబింబే ,, అని

వచింపఁగా రాజు కరముసంతసించి కాళిదాసుని విశేషముగను దక్షిణవారిని యథోచితముగను సన్మానించెను.

అందుకు దండి కోపోద్దీపితుండై రాజుం గాంచి నీవు కాళిదాసునియందుఁ బక్షపాతంబు గలవాఁడవు గాన నతనిం జెలఁగ సన్మానించితి వని మాటిన భూపతి మా యిరువురతారతమ్యంబు భువనేశ్వరీసమక్షంబునం గాని వ్యక్తంబు గా దయ్యెడకుం జనుఁ డని చెప్పిన నతంతు కాళిదాసునిం దోడ్కొని యయ్యెడకుం బోఁ బయనమై యూరు వెడలఁగా నొకనాఁడును వీ రిరువురును గాంచనిపూఁదోటయొకటి గన్పడియె. దానిరమణీయత కచ్చెరువందుచు నా యిరువురు నందుం జొచ్చి యా యుద్యానము నందుంబచ్చవిలుకాని మాయరో యనం దగు నొకమచ్చెకంటిం గాంచి తదీయసౌందర్య విశేషంబున కరుదందుచు నాపూర్ణచంద్రాననతో మాటలాడం గోరిక వొడమఁగా నాకుంభకుచ చెంగటికిం జేరిరి. అప్పుడు దండి యిట్లనియె.

---

* టీ. అరుణకిరణజాలైః = అనూరునికిరణములగుంపులచేత, అంతరిక్షే = ఆకాశము, గతశ్రీ = నక్షత్రములుమాసినదికాఁగా; ప్రభాతే = ప్రాతఃకాలమునందు, శిశిరవాతే=చల్లనిగాలి, మందమందం=మెల్లమెల్లగా, చలతి=వీవఁగా; యువతిజనకదంబే= ఎలప్రాయంపుంబడతులగుంపు, నాథముక్తోష్ఠబింబే=నాయకులచే విడువంబడిన యధర బింబములు గలది కాఁగా ; అనఁగా నప్పుడే తమదయితల నధరామృతంబుఁ గ్రోలి విడుచుచున్నారని భావము. చరమగిరినితంబే=అస్తాద్రిసానువునందు, చంద్రబింబం= చందురునిబింబము, లలంబే=వ్రేలాడెను.

* శ్లో. చూర్ణ మానీయతాం తూర్ణం పూర్ణచంద్రనిభాననే,,

అని యడుగఁగాఁ గాళిదాసుండును.

† శ్లో. పర్ణాని స్వర్ణవర్ణాని కర్ణాంతాయతలోచనే ,,

అనియనియెను. అందు కాకాంతామణి తనసఖియుం జేరి యిట్లనియె.

‡ శ్లో. పర్ణాని దీయతాం చూర్ణం తూర్ణం చంద్రనిభాననే.

కాళిదాసాయ కవయే దండినే పండితాయచ.

అని చెప్పి యాకాంత సఖితో నావనంబుతో నంతర్హిత యయ్యె. అట్లు కాఁగా నది తనతారతమ్యంబుం దెల్పం బొడసూపి యంతర్హిత యయినభారతి యని యెంచిరి. తన్నుఁ బండితసామాన్యునిగాఁ బల్కినందుకు దండి గతాభిమానుండై కాళిదాసుని గారవించె. ఇట్లె భవభూతియు నొకనాఁడు భోజునిచామరగ్రాహిణి సీతసేయుమన్న రత్యంతపన్నసంబున నితనికి నోడిపోయె. అది యెల్లరకువిదితంబు.

వీర్యగుప్తుఁడు. ఆశ్చర్యపడుచు ,,

ఆ! ఆకాళిదాసునియందు దేవికిం గలవాత్సల్యాతిశయంబు నేమని పొగడం గలవాఁడ ? అత్యద్భుతం బాకవివరునిమాహాత్మ్యము.

---

* టీ. పూర్ణచంద్రనిభాననే=పున్నమచందురుని కొప్పయిన మోముగలదానా ! తూర్ణం=వేగముగ, చూర్ణం=సున్నము, ఆనీయతాం=కొనితేఁబడుఁగాత.

† కర్ణాంతాయతలోచనే = చెవులదనుక దీర్ఘములై యొప్పుకన్నులుగలదానా ! స్వర్ణవర్ణాని పర్ణాన్యపి=బంగారువన్నెగల యాకులును, తెమ్ము.

‡ చంద్రనిభాననే=చందురుని కొప్పయినమోముగలదానా, తూర్ణం=వేగముగ, కవయేకాళిదాసాయ=కవియగు కాళిదాసునికి, పర్ణాని=ఆకులును, పండితాయదండినే= పండితుఁడైన దండికి, చూర్ణం=సున్నమును దీయతాం=ఇమ్మా !

కవులునుడివిన పద్యమునం బూర్వార్ధమునంగూఁ దూర్ణ మనియెడుపద మధికము. ఉత్తరార్ధమునందుఁ గర్ణాంతాయత ,, లోచనే యనుచోట హృదయంగమం బైనసారస్యమునుండుటంబట్టి పూర్వార్ధము సెప్పినవాఁడు పండితుఁడనియు నుత్తరార్ధమునుడివినవాఁడు కవియనియునభిప్రాయము.

మఱియు భోజునిసభయందు జరిగినయతని యతిమానుషప్రభావద్యోతకంబు లగు చరిత్రంబులు పెక్కులు వినియున్నాఁడను. ఆతనిం బిలిపించి యతనియిష్టార్థంబు లొసంగి పూజించి కృతార్థతం గాంచ నెంచియున్నాఁడ. ఇది యెప్పటికి లభించునో యెఱుంగ.

భోజుఁడు రాజా! నీ కాయతిశయంబుఁ జెందుట కిదియ యదను!

వీర్యగుప్తుఁడు. విప్రోత్తమా! అదెట్లు!

భోజుఁడు. రాజా! చెప్పెదను. వినుము. మధుమంతపురాధినేతకూఁతురు మదనసేన యిప్పుడు నీచేతం జిక్కియున్నదిగదా!

వీర్యగుప్తుఁడు. సత్వరముగ. ఔను! అయిన నేమి.

భోజుఁడు. ఆకన్యకాశిరోమణి నతని కర్పించితి వేని యతనియిష్టార్థపూరణంబు సల్పినవాఁడ వగుదువు.

వీర్యగుప్తుఁడు. వైచిత్ర్యంబుతో.

ఈ కవి దానింగోరుటకు గతంబేమి?

భోజుఁడు. ఆమదనసేన యతనిసతి.

వీర్యగుప్తుఁడు. సోద్వేగముగ,,

ఆ! ఆతనిపత్నినా! నే నపహరించితిని!

ఆహా! ఎంతటి దుష్కార్యంబు నేయంబడె! ఆ కన్యక విద్యలయందు నన్నోడించుటచే నీసు వెరిగి సమయంబు రాఁగా నాకస్మికంబుగ దొరకిన యాకన్యకాలోకశిఖామణిని; గౌతముని చేతం జిక్కి పెక్కుచుండు దానిఁ దక్పాహోయుండై సముదించిన యవనునిం బిలుకుమాఱిచి తోడ్కొని వచ్చితి. ఇతనిభార్య యని యెఱింగిన నప్పుడె యతనికి సమర్పించి నాజన్మంబుఁ గృతార్థతాభాజనంబుగఁ జేయక పోదునే!

భోజుఁడు. ఓ రాజా! ఇప్పటికి మించినదేమి? ఆట్లొనర్పం జనును సుమా!

వీర్యగుప్తుఁడు. ఓ విప్రోత్తమా! మదనసేన బ్రాహ్మణపత్ని యని యెఱుంగను. ఎఱింగితి నేని తదపహరణంబునం బ్రవర్తింప. గౌతముఁడు కపటంబున నొకగాడిదెల మేపువానికి దానిం బెండ్లిసేయించె నని వినియుంటిని.

భోజుఁడు. ఓ రాజా! ఆగాడిదెలమేపువాఁ డెవఁ డని యనుకొంటివో! వాఁడె నీముఖ్యామాత్యుఁ డైనమిత్రమాధవునికుమారుండు కళాచంద్రుండు. ఆపంప కాళిదాసుండని కీర్తికెక్కియున్నాఁడు.

వీర్యగుప్తుఁడు. ఉల్లాసంబుతో,,

ఆర్యుం డగుమిత్రమాధవునిపుత్త్రుఁడా కాళిదాసుండు! కళాచంద్రుండు నాకు నెయ్యుఁడు. అతఁడు గురుశాపంబునం గడుకష్టలం గూడి మెలంగుచున్నాఁ డని యెఱింగి మిత్రమాధవునితో మనంబునందుఁ గడు సంతపించుచు ననేకస్థలంబుల వెదకి వెదకితదుపలబ్ధిలేక చింతించుచుంటిమి. ఇట్టుండ నాకళాచంద్రుండె కాళిదాసుండయి గన్పడుచున్నాఁడని వింటి. ఇంతకంటెఁ బరమముదంబు గలదే! శపథంబు సెల్లింప మదనసేనం దెచ్చినాఁడ నంతియకాని దానియం దేదేని విప్రియంబు నడప నాకు మనం బొప్పదు. ఆకన్యకయును నియ్యేడకుం జనుదెంచుటాదిగ తనభర్తృసమాగమమునకే మొక్కోర్వ్రతంబు సల్పుచున్నయది. ఆసతీతిలకంబు నేయంబూనినవ్రతాచరణంబు పరమామోదదాయకం బయ్యె. దైవవశంబునం బ్రాహ్మణాపరాధంబును మిత్త్రద్రోహంబును నాకుం గలుగక తప్పిపోయె. నేను తొలిపుట్టువున నేమిపుణ్యం బొనరించితినో! నాప్రాణమిత్త్రం బగుకళాచంద్రునిం గాంచి యతనివల్లభ నతనికి సమర్పించి ధన్యుండను గావలె నని యున్నాఁడ. ఆతండెయ్యెడ నున్నాఁడొ! ఈమహాతిశయంబు నాకెప్పటి కగునో! మదనసేనను గళాచంద్రునిం గూర్చి వారలు సుఖాంబుధిం దేలం జూచి నాకన్నులకుం ఫలంబు నెప్పుడుసంపాదించుకొనంగలనొ!

భోజుఁడు. ఓ రాజా! ఆతం డీయూరన యున్నాఁడు. నీ వనుకొన్నకార్యంబు నెఱవేర్చి పరమామోదంబును భాసురతరయశంబుం గాంచుము.

వీర్యగుప్తుఁడు. ఓవిప్రోత్తమా! నాయందుఁ గరుణ యుంచి యాకళాచంద్రుండుండుచోటికి నన్నుం దోడ్కొని పొమ్ము. ఆతనిని సపాదపతనంబుగ నభ్యర్థించి తెచ్చి మదనసేనతోఁ గూర్చెదను.

భోజుఁడు. ఓరాజా! అట్లయినం బోదము రమ్ము.

అనినిష్క్రాంతులైరి.

శుద్ధవిష్కంభము.



లీలావతియుం గాంచనమాలయుం బ్రవేశించిరి.

లీలావతి. ఓసి కాంచనమాలా! నేను సాధారణవిప్రకామినీవేషంబుం బూని వచ్చినదానం గావున న న్నెవరు గనిపెట్టం జాలరు. ఈయుపవనంబు పురుషవర్జితంబై పవిత్రంబగుచు మనకుం గోరినచోటులకుం జన ననువై యున్నది. మఱియు నిది శుక

పిక నిరంతరారావభరితంబై చెవులు సోఁగియుంచెడిని. శుభకరంబు లగుశకునంబులు గానంబడుటంజేసి మనయభీష్టార్థంబు వేగమ సమకూరు ననియుం దోఁచుచున్నది.

ముందుకు దృష్టులు నిగుడించి,,

ఓసి కాంచనమాలా! అదె! యాసరోవరంబును శ్రోతటంబునం జూడుము. అయ్యెడ నొకమనోహరం బగుపర్ణకుటీరంబును వదంతరంబున నొకకాళికామూర్తియు నాదేవియెదుటఁ గఠోరతపంబు సేయుచు గూరుచుండినయొకపుండరీకపత్రాక్షియుం గనంబడెదరు. ఈకామినీతిలకంబె నీప్రాణనాథునిదయిత యై యుండనోపు. ఆయ్యె డకుం జనియాకామినీమణివృత్తాంతం బారయుదము.

పరిక్రమించుచున్నారు.

లీలావతి. ఆశ్చర్యముతో,,

ఓసి కాంచనమాలా! ఈ సుందరీలోకలలామంబును గాంచితివె కే!

ఉ. ఏమి వయోవిలాస మిది యేమి సురూపవిశేష మేమి యా,
కోమలదేహభవ్యరుచికోమలికం బిది యేమి యాకర యా,
కామకళామనోజ్ఞముఖకాంతి యి దేమియొ గాంచలేదె యా,
సామజయానవంటి పెరసాంకవగంధుల నీధరాస్థలిన్.

ఈకోమలి యిపుడు కఠోరతపశ్చర్యావిశేషంబు సలుపుచుండుటం గాంచి.

కం. పతిఁ బాసి నవసి మానవ। సతిరూపున ప్రకృతము లోలిసలుపఁ గడఁగునా,
రతియో యని తలఁపందగు। నతివ యి దేలా వ్రతంబు లాస సలిపెడిన్.

ఈ మనోహరాంగివృత్తంబు మన మారయం దగునదియై యుండు. ఈ కాంత వసించుపర్ణకుటీరంబునకు దక్షిణమున నుండురసాలవల్లరీనికుంజంబుమాటున నుండి యిది యాడుకొనువచనంబులచే దీనివృత్తం బారయుదము.

కాంచనమాలయు లీలావతియు రసాలవల్లరీనికుంజాంతరిత లైరి. భోజుండును గాళిదాసుండును వీర్యగుప్తుండును బ్రవేశించిరి.

వీర్యగుప్తుఁడు. ఓభోజభూపతీ! నీవు విప్రవేషంబునం జనుదెంచి నన్ను మోస పుచ్చితివి. నీవు మన్నగరంబునకుం జనుదెంచినప్పుడు నిన్ను నే నేవిధి గారవించి తోడ్కొనిపోవలయునో యది గావింపకుండ నన్ను వంచించితివి. ఇట్లు విప్రవేషం బునం జనుదెంచి నాప్రమాదంబుం బ్రకాశింపం జేసితివి.

శోకావేగంబుతో " బాష్పంబు లురల్చుచు,,

ఇంక.

గీ. భువనజననేత్ర నిర్మాణపుణ్యఫలము । లలితసౌభాగ్యలీలావిలాసపదము,
రూపగౌరవలక్ష్మీనిరూఢపదవి। మగనియాకారరేఖ నెమ్మదిఁ గాంతు.

అని యేడ్చుచున్నది.

లీలావతి. ఓమదనసేనా! ఏయేకాలమున కెది యెది యెవనికి లభింపవలసియున్నదో! అది తప్పిపోవునా! ఇట్లని మానసంబునకుం దనవలన నైనంతదనుక సమాధానంబు చేసికొనవలయుంగాని యిట్లు దుఃఖావేశవేగంబున కెదురీఁ దుచుండవచ్చునే!

మదనసేన. ఓయవ్వ! ఏమి సేయుదును. ఏటికిం దానమాడఁ బోయినవాఁడింటికిం జనుదెంచునంతలో నాగతి యిట్టు లయ్యెనే! ఇందు కెంత చింతించినం దీఱునా! అదియునుంగాక.

చం. అతిసుకుమారకాయుఁ డతఁ డంగజఘోరనిశాతసాయక,
ప్రతతికిఁ జిక్కి వేదనలపా లయి యోర్వఁగ లేక లోకనే,
త్రతతిఫలంబు వాయఁగను దక్కిన దౌతనదేహయాత్ర స,
మ్మతి విడనాడె నొక్కొ యని మాటికి మాటికిఁ గుందుచుండెదన్.

లీలావతి. ఓమదనసేనా! నీ వతనికై చింతఁ గూరవలదు. నీదయితుండు కళాచంద్రుం డిప్పుడు ధారానగరంబున నున్నవాఁడు. కాంచనమాల యనువేశ్యాకన్యకవలన నతఁడు తనలోకయాత్రయందు శిథిలుండు గాక యుండెడిని.

మదనసేన. సంతసంబుతో,,

ఇన్నిదినములకు నాదయితుని క్షేమవృత్తంబు వింటిని. చెవులకలిమికి ఫలంబుం గంటిని. ఆనందసుధాంబుధిం దేలం గంటిని.

ఆత్మగతమున,,

నానాయకుండు మత్ప్రాప్తియం దాశ మాని వేశ్యాకన్యకతో సుఖించుచున్నాఁడు గాఁబోలు!

ఆకాశములక్ష్యముచేసి. ప్రకాశముగ,,

ప్రాణనాథ!

చం. అమరసమాన! నేను గర మాసఁ గఠోరము లౌవ్రతంబులన్,
క్రమమునఁ జేసి చేసి కడుఁ గాతితాఁ జెందుచు నుండుచుండెదన్,
రమణినిఁ గూడి నీవు ఘనరాగముతోడఁ జరించుచు న్సుఖం,
బు మహితరీతిఁ గాంచెదవు బోరనఁ బాసెద నిప్డు ప్రాణముల్.

అని విముక్తకంఠయై యేడుచుచున్నది.

లీలావతి. ఓమదనసేనా! ఉత్తలంపడకుము. ఆకాంచనమాలయే నీకు నీదయితు నింజేర్పం బ్రయత్నించుచున్నది.

భోజుఁడు. ఓవీర్యగుప్త! మిత్రమా! ఈ మదనసేన ప్రియావిరహంబున నింకం గొంతతడవునకు శరీరంబు వాయు నని తోఁచెడిని. దానిసమీపమునకుం జని సోమా చంద్రునిరాక యెఱింగించి యూరడింపుము.

వీర్యగుప్తుఁడు. ఓభోజభూపతీ! యట్ల యగుంగాక.

అనిపరిక్రమించుచున్నాఁడు.

మదనసేన. వీర్యగుప్తునింగాంచి. భయోత్కంఠంబులతో. ఆత్మగతమున ,,

ఈవీర్యగుప్తుని కేఁ జెప్పినగడు విప్పటితో ముగిసె. వ్రతసమాపనానంతరము తనశయనంబునకు వచ్చెద నని నేఁ జెప్పియుండుమాటమేరకు వాతోఁ గలయ నిదె యీతండేగుదెంచుచున్నాఁడు. వీనివలనం దప్పించుకొనుట కుపాయంబు లేదు. ఈప రోజలంబులం బడి ప్రాణంబులు వాయుటయ మానంబు గాచుకొన నను వంయున విధానంబు.

ప్రకాశముగ,,

ఉ. ఏ నొకవత్సరంబు గడు వేడ్కల వేడితి రాజు నిచ్చె న,
న్మానముతోడ నే వ్రతము మానక చేసితి వ్యర్థ మయ్యె పో,
పూనిక వీఁడధర్మరతి పుట్టి నను గలయంగ వచ్చెడిన్,
మానము గాచుకోఁజనను మాన్యతఁ బ్రాణము లోలిఁ బాసెదన్.

కం. జలములఁ బడి ప్రాణంబులు। లలిఁ బాసిన నాకు నింకిలం గలుగదు పో,
బలవద్వ్యసనము ప్రేల్మిడి। దొలఁగెదఁ గాయంబుతోడఁ దుర్విధివశనై.

అతి త్వరితగతిం జలములకడ కరుగుచున్నది.

భోజుఁడు. ఆ! కష్టము! కష్టము! వీర్యగుప్తుండు తనకడకు వచ్చుటకుం గతంబు యథార్థంబుగ గ్రహింపం జాలక యీనీలాలక యితఁడు తన కెగ్గుదేరిఁ గావించునో

చం. సుమసుకుమారగాత్రిని విశోభితపుణ్యచరిత్రఁ గాంచి తీ,
వమలినకీర్తితో నిచట నప్పుడు నప్పుడు నాపురంబునన్,
క్రమముగ సంతతంబును ని కామముదంబున నుండి యిర్వురన్,
రమణులఁ గూడి సౌఖ్యము తిరంబుగఁ గాంచుచునుండుమీ భువిన్.

ఓచెలికాఁడా ఇంకను నీ కేమి ప్రియం బొనఁగూర్పం గలవాఁడను ?

కాళిదాసుఁడు. ఓమిత్రమా ! భోజభూపతీ యింతకంటెను నా కేమి ప్రియంబు గావలెను ? అయిన నిది యగుంగాత.

## భరతవాక్యము.

గీ. నిరత మగుఁగాఁత జనులకు నిండుసుఖము,
లవని ఫలియించుఁగాఁత సస్యంబు లెపుడు,
లీల వెలుఁగోటిరాజగోపాలకృష్ణ,
యాచభూమీంద్రు శ్రీసతి బ్రోచుఁగాత.

ఇది శ్రీరాధానాథచరణకమలచంచరీకాయమాణమానస భార
ద్వాజగోత్రపవిత్రతిరుమలార్య పుత్ర పెరుందేవీగర్భజన్మ
చిలకపాటి వేంకటరామానుజశర్మ ప్రణీతంబైన కాళి
దాసచరిత్రప్రకరణమునందు దశమాంకము
సర్వంబును సంపూర్ణము.



“హిందూరత్నాకర” ముద్రాక్షరశాల, చెన్నపురి :—1928.